# నారద భక్తి దర్శనము



# నారద భక్తి దర్శనం

నారద భక్తి సూత్రాలకు తెలుగు వ్యాఖ్య

"శాంతిశ్రీ"
జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రి

శాంతిసదనం
తాడేపల్లిగూడెం

# పుష్పాంజలి

పరమ బ్రహ్మ మనంగా
పరతత్త్వమనంగ పరము పదమనగను నీ
శ్వరుడన కృష్ణుడన జగ
ద్భరితుడు నారాయణుండు దా వెలుగొందున్

అని బమ్మెర పోతన భాగవతంలో ప్రవచించాడు. ఆ భగవంతుని యందుగల పరమ ప్రేమయే భక్తి! భక్తినిగూర్చి మహర్షులు మహనీయులు మహానుభావులు మహాత్ములు సహస్ర విధాల ప్రశంసించారు.

"నిరంతర స్మరణమే ఉపాసన" అని శ్రుతి ప్రామాణ్యం. "ఆవృత్తి రసకృదుపదేశాత్" అనే సూత్ర వ్యాఖ్యానంలో శ్రీ శంకర భగవత్పాదులు "ఉత్కంఠతో గూడిన నిరంతర భగవన్నామ స్మరణమే భక్తి" అన్నారు.

"ఈశ్వర ప్రణిధానాద్వా" అనే పాతంజలి యోగసూత్రానికి వ్యాసుడు ప్రణిధానం అంటే "దేనిచేత యోగికి భగవదనుగ్రహం లభ్యమై ఆ యోగి అభీష్టం సిద్ధిస్తుందో ఆ భక్తి విశేషమే ప్రణిధానం" అన్నాడు. ఇదే సూత్రానికి వ్యాఖ్యానం చేస్తూ భోజదేవుడు "సర్వసమర్పణమైన భక్తి విశేషం ప్రణిధానం" అన్నాడు.

"సా పరానురక్తి రీశ్వరే" అని శాండిల్యుడు పరానురక్తియే భక్తి అన్నాడు. ఈసూత్రాన్నే వ్యాఖ్యానిస్తూ స్వప్నేశ్వరుడు అనురాగంలో 'అను' అంటే అనంతరం, 'రక్తి' అంటే రాగం అనగా పరమేశ్వర స్వరూప వైభవాదులు గ్రహించినమీదట కలిగే అనురాగమే భక్తి అన్నాడు.

అందరి అభిప్రాయం ఒక్కటే. భగవంతునిపై ప్రేమయే భక్తి. ఈభక్తి రస తత్త్వానికి మూలం భాగవతం. భాగవత తత్త్వాన్ని శ్రీమన్నారాయణుడు బ్రహ్మకూ- బ్రహ్మదేవుడు నారదమహర్షికీ- నారదమహా వ్యాసమహర్షికీ- వ్యాసమహర్షి శుకమహర్షికీ- శుకమహర్షి పరీక్షు హారాజుకు మరి సూత మహర్షికీ- సూతమహర్షి శౌనకాది మహాము శ్వరులకూ పరంపరగా బోధించినట్లు పురాణ ప్రవచనం. భగవంతు తత్త్వనిరూపణ గ్రంథం భాగవతం. ఈ భాగవతాన్ని శంకర రామాను మధ్వ వల్లభ నింబార్క శ్రీకృష్ణచైతన్యాదులు భక్తి రసభరితం వ్యాఖ్యానించారు. వీరి వ్యాఖ్యానాలకు ఇంకా వివరణాలు కూ- పెక్కు వచ్చాయి.

ఆ భాగవతం సహజపండితుడైన పోతనామాత్యుని చేతిలో మందార మకరంద ధారలు వర్షించింది తెలుగు వారి ముంగిటలో.

లలిత స్కంధము-కృష్ణ మూలము- శుకాలాపాభిరామంబు,
జు లతా శోభితమున్-సువర్ణ సుమన స్సుజ్ఞేయమున్-సుందరో
జ్జ్వల వృత్తంబు మహాఫలంబు-విమల వ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరువుర్విన్ సద్ద్విజశ్రేయమై-

ఒప్పునట్లుగా విశ్వకల్యాణ కరంగా లలితంగా లలితస్కంధంపై శుకవాణిలో కవిత్వాన్నీ, తత్త్వాన్ని జోడించి తీయని తేట తెలుగులో భాగవత లక్ష్యాన్ని అద్వితీయంగా అందించి పునర్జన్మలేని శ్రీ కైవల్య పొందాడు పోతనామాత్యుడు.

భక్త్యాచార్యులైన సూత్రకారులలో నారద శాండిల్యులు ప్రముఖులు. "నారదీయ భక్తియే ఈ కలియుగానికి ఉపయుక్తం" అ శ్రీరామకృష్ణ పరమహంస అమృతోక్తి.

మహా విష్ణువు మనస్సుకు బాగా నచ్చిన మహర్షి నారదుడు. నారదుడు వేదవేదాంత జ్ఞాన విజ్ఞాన యోగాది అనేక శాస్త్రాలలో మహాపండితుడు. మధుర మార్దవ మానసుడు. బ్రహ్మమానస పుత్రుడు జగన్మిత్రుడు. మేధావి, హృదయాళువు.

"హరికి యోగివరుల కభిలషితంబైన
భాగవత విధంబు పలుకనైతి"

అని చింతిస్తున్న వేదవ్యాస కవీంద్రునికి భక్తి తత్త్వం బోధించి భాగవతం రచించుమని చెప్పింది ఈ మహాత్ముడే.

భక్తి తత్త్వం బోధించే నారద భక్తి సూత్రాలు పవిత్రాలు, జగత్ప్రసిద్ధాలు. ఈ సూత్రాలకు సంస్కృతాంధ్ర హిందీ భాషాదులలో అనేక వ్యాఖ్యానాలు వచ్చాయి. అయితే మరల నీవ్యాఖ్యానం ఏమిటి అంటే భక్తిరస భరిత హరిప్రసంగాలు ఎందరెన్ని రీతుల రచించినా, ప్రవచించినా, అవి నిత్యనూతనాలు, పరమ రమణీయాలు, ఎల్లకాలాలలో ఎల్ల మానవులకూ అవి మాననీయాలు.

"మరల ఇదేల రామాయణంబన్నచో!" అని ప్రశ్నించుకొని "నా భక్తి రచనలు నావికావ" అన్నాడు రామాయణ కల్పవృక్షంలో విశ్వనాథ. ఎవరు ఏది చెప్పినా అదే సరైన సమాధానం.

ఈ నారద సూత్రాలలో జ్ఞానకర్మ భక్తి సుగంధాల సమ్మోహన సమన్వయం ఉంది. భగవంతుని సగుణ నిర్గుణ పూజా యోగ ప్రాముఖ్యం ఉంది. నిశ్చల నిర్మల భక్తి రసామృత ప్రవాహం ఉంది. నిష్కామ కర్మ, త్యాగపూర్ణ సమర్పణ, శరణాగత ప్రధానత ఉన్నాయి. ఇది ఒక దర్శనం.

" స ఈశ్వరః అనిర్వచనీయ ప్రేమస్వరూపః "

ఈశ్వరుడు ప్రేమస్వరూపుడు, రసమయుడు, దయామయుడు

"రసో వైసః" అని కదా శ్రుతి.

ఆ రసమయుణ్ణి ఈ నారద భక్తి దర్శనం సాక్షాత్కారం చేయిస్తుంది. కనుక దీనికి నారద దర్శనం అని పేరు పెట్టటం జరిగింది.

ఈ వ్యాఖ్యానంలో మహాత్ముల మహితోక్తులు కవిపుంగవుల కవితోక్తులు క్రోడీకరించబడినాయి. శ్లోకాలకు పద్యాలకు అవసరమైన కొన్నిచోట తాత్పర్యం వ్రాయడం జరిగింది, గ్రంథ విస్తరణభీతి వలన కొన్ని శ్లోక పద్యాలను ఉదహరించకుండా భావాలు మాత్రమే అందించాను.

ఈ రచన ఒక గొప్పసాహసమే. భక్తియోగం కదాఅని ఫలితం భగవంతునికి వదలి ఈ కార్యానికి పూనుకొన్నాను. ఇందుకు ఆ ప్రాచీన నవీన సంస్కృతాంధ్ర హిందీ గ్రంథాలు కల్పవృక్షాలై మందార పుష్పాలను అందించాయి. కనుక ఆయా గ్రంథ రచయితలకూ ప్రకాశకర్తలకూ సహస్రాభినందన చందన వందనాలు.

ఈ గ్రంథం ఇంత సుందర రూపంలో ఆవిష్కరింపబడటానికి కల్యాణ శ్రీనివాసుని కరుణాకటాక్ష వీక్షణాలే ముఖ్యకారణం. ఆ దివ్య సంకల్పం కార్యరూపం దాల్చడానికి సహకారం అందించిన సహృదయ న్మాన్యులు తిరుపతి తిరుమల దేవస్థానం కార్యనిర్వాహణాధికారి శ్రీ యం. లక్ష్మీనారాయణగారికీ, 'సప్తగిరి' సంపాదకులు సహృదయ చూడా మణులు శ్రీ కాట్రపాటి సుబ్బారావుగారికీ సర్వదాకృతజ్ఞతలు.

నాలోని రచనా రామణీయకతకు పాదులుచేసి పెంచి పెద్దచేసిన లలిత కవితా విశారదులు మా కరుణశ్రీ బాబాయిగారి - ఈ గ్రంథం పరికించి 'నాఉల్లాసలాస్యం' అని ఆశీస్సులందించిన మహాయోగీశ్వరులు గీతావాణీ సంపాదకులు అయిన శ్రీ శ్రీ శ్రీ శ్రీరామకృష్ణానందస్వామి వారికీ, అమృత హృదయంతో 'ఆనందవాణి' పలికిన ఋషికేశ శివానంద ఆశ్రమ నివాసులు శ్రీ శ్రీ శ్రీ సామీదేవనంద చినస్వామివారికీ నా నమ మనస్సులు.

నారద దర్శనం దర్శించి ఇందు వ్యక్తీకరించిన భక్తి నాన్యతో దర్శనీయం అని అమందానందంతో శుభాశంసనం పలికిన ఆచార్య కళాప్రపూర్ణ బ్రహ్మశ్రీ దివాకర్ల వేంకటావధానిగారికి అనేకానేక అభివాదములు.

ఈ నారద దర్శనం దర్శించి స్పృశించి స్పందించి "మధురదర్శనం' ప్రసాదించిన నిరంతర రామతత్త్వప్రవచన పారీణులు శ్రీ భాష్యం అప్పలాచార్య దేవులకు అభివాదములు. మధుర హృదయంతో నారద భక్తికి 'మహతీశ్రుతి' మేళవించిన మహా విద్వాంసులు అవధాన సరస్వతీ బిరుదాంకితులు శ్రీ పేరాల భరతశర్మగారికి నమస్సులు.

నా రచనలను అనురాగంతో ఆప్యాయంగా అందుకొని అడుగ కుండగనే ఆర్థిక హార్దిక సహాయ సంపత్తులు సదా అందిస్తూ ఈ నారద దర్శనానికి "మెరుక" తెలియ పలికిన కళా దృష్టులు 'కళాప్రపూర్ణులు' శ్రీ పసల సూర్యచంద్రరావు గారికి అనేక ధన్యవాదాలు.

ఈ పుస్తకరాజాన్ని ముచ్చటగా ముద్రించి ముస్తాబు చేసిన శ్రీ కృష్ణా పవర్ ప్రింటింగ్ వర్క్స్ అధినేతలు, తెలుగు సాహితీ సమాఖ్య అధ్యక్షులు, అతినిరాంబరులు అయిన శ్రీ పి. టి. వి. రామానుజాచార్యుల వారి, వారి బృందానికీ నా కృతజ్ఞతా పారిజాతాలు.

నా యీ ప్రయత్నాన్ని భక్త హృదయులు సాహితీ ప్రియులు ఆదరిస్తారని ఆశిస్తూ శ్రీ పద్మావతీ శ్రీనివాసుల పాదపద్మాలపై ఈ పూజా పుష్పాన్ని సమర్పిస్తున్నాను.

కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతే స్స్వభావాత్
కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణా యేతి సమర్పయామి!

మీ

— శాంతిశ్రీ



# ఆత్మనివేదనం



శ్రీపాల! గోపాల! నా పాదములు నీదు
గుడి గోపురమువైపు నడచు నట్లు
శ్రీహరీ! దనుజారి! నా హస్తములు నీదు
చిన్నారి సేవలు సేయు నట్లు
శ్రీనంద నందనా! నా నేత్రములు నీదు
కల్యాణమూర్తిని గాంచు నట్లు
శ్రీకృష్ణ! శ్రీరామ! నా కర్ణములు నీదు
కీర్తనమ్ములు ఆలకించు నట్లు

శ్యామసుందరా! గిరిధరా! నా మనస్సు
నీ పదాంభోజములపైన నిలుచు నట్లు
నా ప్రమేయమ్ములేకుండ ఏ ప్రయోజ
నమ్ము కాంక్షించనట్లు నన్ నడుపుమయ్య!

కమలనాభ! మమ్ము కాపాడగా నెంచి
ఎన్నినాళ్ళు నీవు ఈవిధాన
నిలువు కాళ్ళపైన నిలబడి యుందువు
కాళ్ళు కంది కదుమకట్టునేమొ!

నా మనమ్ము వికచ నళినమ్ము - దానిపై
కొంచమంత సేపు కూరుచున్న
కర్రటినీట వేడి కాపడమ్ములు పెట్టి
కాళ్ళుపట్టి సుఖము కలుగ సేతు.

మాత కోపగించి మంగాపురము వెళ్ళి
కొండపైన నీవు కూరుచున్న
మాకు సుఖములేదు మామాటలాలించి
అమ్మ నిటకు తెచ్చుకొమ్ము తండ్రి!

రామ! నారద భక్తి సూత్రిపుష్పాలు వేని
తెలుగుతోటలో నిన్ని పూవులనుజేర్చి
దర్శనీయమ్ముగా చిన్న దండనొకటి
గుచ్చి తోమాలసేవకై తెచ్చినాను.

నేను నాదన్న అస్తిత్వమేని లేని
మేనుదాల్చిన నీ ఆత్మలోనివాడ!
నే నివేదన సేయుట నిజముకాదు
ఈ కృతి దీయమ్మార్య! స్వీకృతి యొనర్పు.

# షోడశ శీర్షాలు

సత్సంగమాధురి



దుస్సంగనాగిని



మాయావాహినీ తరణి

ప్రేమ స్వరూపం



గౌణీభక్తి



మాతృశ్రీ

సాధనావరోధిని



పరమ ప్రేమ

వాద వేదన



సోపాన పాళి



భక్తిరేవ గరీయసి



భక్తి దర్శనాచార్యులు

అభిజ్ఞుల ఆశీస్సులు





| పేజీ | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 24 | 16 | సుతుడౌ | సుతుడే |
| 28 | 17 | దార్ఢ్య | దార్ఢ్య |
| 34 | 1 | భేదాల్ | భేదాత్ |
| 35 | 21 | నిచి | నునిచి |
| 48 | 22 | ఐతేయ | ఐతేయ |
| 51 | 11 | నీయమములు | నీయములు |
| 51 | 12 | కాంక్షించున్ | కాంక్షించుచున్ |
| 52 | 5 | అన్య | అన్యం |
| 53 | 26 | నునను | నందనుని |
| 76 | 23 | | రూపగోస్వామి-నీలమణి |
| 81 | 23 | 2 | 4 |
| 82 | 12 | అననన్య | అనన్య |
| 87 | 19 | పీర్ధ | తీర్ధ |
| 88 | 12 | సావాసం | సహావాసం |
| 95 | 18 | ఉపవాస | ఉపాసనా |
| 98 | 23 | జయంతీ | వైజయంతీ |
| 108 | 10 | వేదానామపి | వేదానపి |
| 112 | 10 | యోగంగా | యోగం |
| 139 | 15 | కలిగిన | లుండిన |
| 147 | 17 | తీర్ధం | తీర్థి |
| 149 | 4 | విచారతా | విచరతాం |
| 180 | 5 | యథాగ్ని | యథాగ్ని |
| 193 | 16 | కీర్తితః | ప్రకీర్తితః |
| ,, | ,, | ప్రవీనా | ప్రలీనా |
| ,, | ,, | పూర్ణః | పూర్ణాః |
| 196 | 10 | పాదపాదాబ్ధి | పాదపాబ్ధి |

# నారదమహర్షి



అహో దేవర్షిః ధన్యోఽ యం
యత్కీర్తిం శార్ఙ్గధన్వనః
గాయన్మాద్యన్నిదం తంత్ర్యా
రమ యత్యాతురం జగత్. 1

అహో నారదమహర్షీ! మహతీ తంత్రులపై మధురంగా మాధవునిగానం చేస్తుంటావు. మానవకళ్యాణంకోసం మూడులోకాలు పర్యటించి పరిశీలిస్తుంటావు. ధన్యుడవయ్యా! మార్గదర్శీ! మహర్షీ! మా నమస్సుమనస్సులు.

పునర్జన్మలేని మహాపురుషులు కారణజన్ములై భూమిపై అవతరిస్తుంటారు, భగవత్ కార్యం చేస్తుంటారు. మానవుని మాధవునిగా తీర్చిదిద్దటానికి దీక్షా బద్ధకంకణులై శ్రమతీసుకుంటారు. అట్టి లోకోత్తర అవతార పురుషులలో నారద మహర్షి ఒకరు.

నారదుడు దేవర్షి. నిత్యసంతోషి. విశ్వశ్రేయోభిలాషి. ఈతడు బ్రహ్మమానస పుత్రుడు. విష్ణుదేవుని పౌత్రుడు. అన్నికాలాలవారికి ఆప్త మిత్రుడు.

ఈ మహనీయుడు వేదవేదజ్ఞుడు, సకలసంహితా ధర్మజ్ఞుడు, బహు పురాణ శాస్త్ర ఇతిహాస విశేషజ్ఞుడు. ఈతడు బ్రహ్మవాది, త్రికాలవేది, త్రిలోక సంచారి, ఆజన్మ బ్రహ్మచారి. ఈతడు భక్తిమార్గానికి ఆచార్యుడు, మహానిజవపుష్యుడు, సంతత సత్కార్యధురంధరుడు. ఈతడు ధర్మసూక్ష్మ పరిజ్ఞాత, అఖిలాండపిండ బ్రహ్మాండ విజ్ఞాన వ్యాఖ్యాత. ఈయన శ్రీహరిగుణ మహాత్మ్యాసక్తిగల భక్తులలో ప్రథముడు.

---

1 శ్రీమద్భాగవతం ప్రథమ 6-39.

ఈ యశస్వి అపార తేజస్వి, అఖండ తపస్వి, మృదుమధుర మనస్వి ఈ విష్ణుసేవా పరాయణుడు లోకారాధన ప్రధాన లక్ష్యంగా స్త్రీ పురుషులలో "పరమ ప్రేమతత్త్వం" ప్రబోధం చేయనెంచిన మాన్యుడు, మహనీయుడు.

ఇట్టి బహుముఖ ప్రజ్ఞాశాలియైన నారదుడు ఒకరు కాదు పలువుర! కొందరు పండితుల వాదన.

" బ్రహ్మమానస పుత్రుడు - పర్వతఋషి మామ-వశిష్ఠపత్ని అరు( ధతికి అన్న - సత్యవతి భర్త - కలహభోజనుడు - కుబేర సభాసదస్యుడు - రామధర్మామాత్యుడు - జనమేజయ సర్వయజ్ఞశాలా సభ్యుడు......" ఇలా నారదుడు వేరు వేరు అని వారిభావన.

ఈవిషయం తేల్చవలసింది పరిశోధక చక్రవర్తులు. నారదుడు ఒక్కడే అని భావించడం భక్తులకు భద్రం.

వేదవ్యాసుడు ఒకరోజు సరస్వతీ నదీతీరంలో ఆశ్రమం ముంద కూర్చున్నాడు. అది సంధ్యాసమయం. ప్రకృతి వ్యాపారం ఆహ్లాదకరంగా ఉంది. కానీ ఆయన మనస్సు ఎందుకో వ్యాకులంగా ఉంది. మునీశ్వరుడ లోచనా మగ్నుడైనాడు. ఆయనకు ఏమీ తోచడంలేదు. ఆయన విచారంగా ఉన్నాడు.

ఇంతలో ఆ మహర్షికి మధురంగా మహతీనాదం వినిపించింది. ఆయ తలపైకెత్తి చూచాడు. ఎదురుగా బ్రహ్మమానస పుత్రుడు-అత్యంత ఆ మిత్రుడు-శ్రీహరి సంకీర్తనాచార్యుడు-నారదమహర్షి!

వ్యాస మహర్షి హర్షానికి అవధులు లేవు. మహర్షి లేచి ఇంటికి వచ్చి నారదమహర్షికి ఆనంద బాష్పాలతో స్వాగత సత్కారాలు పూర్తిచేశాడు ఇక మెల్లగా తన హృదయంలోని వ్యాకులతను వివరించాడు. కన్నుల నీర పెట్టుకొన్నాడు.

నారద మహర్షి క్షణంసేపు ఆలోచించాడు. మధురంగా మందహాసం చేసి ఇలా సెలవిచ్చాడు

"వేదవ్యాస మహాకవీంద్రా! నీవు వేదవాఙ్మయాన్ని ఋక్ యజుస్సామ అథర్వణాలుగా వివేకవంతంగా విభజించావు. అష్టాదశ పురాణాలను నిర్మించావు. పంచమ వేదంవంటి మహాభారతాన్ని "జయ" అనే పేరుతో జయప్రదంగా రచించావు. నీ 'జయ' ధర్మశాస్త్రంగా నీతిశాస్త్రంగా మహాకావ్యంగా బహుపురాణ సముచ్చయంగా వేదవేదాంత సారంగా సర్వపండితలోక ప్రశంస లందుకొన్నది. అందులో సందేహంలేదు. నీ రచనలో భక్తిగూర్చి అక్కడక్కడ బహుస్వల్పంగా పలికావుకానీ విష్ణుభక్తి ప్రధానమైన గ్రంథం ఒక్కటైనా రచించావా? లేదు. అదీ నీ అశాంతికి కారణం.

హరినామ స్తుతిలేని కావ్యంనిండా ఎన్ని వ్యంగ్యవైభవాలూ, అలంకారాలూ, చమత్కారాలూ ధ్వనివిశేషాలున్నా ఆకావ్యం కాకతీర్థం వంటిది అవుతుందేకాని పండిత ప్రశంసార్హంకాదు. హరినామస్తుతి చేసిన కావ్యం మహితమంజులమానస సరోవరంలా పరమహంసలకు విహారయోగ్యంగా భక్తజన మహాభాగ్యంగా విరాజిల్లుతుంది.

అపశబ్దంబులు గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపా
ప పరిత్యాగముసేయు కావునహరిన్ భావించుచున్ పాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబు కీర్తించుచున్
తపసుల్ సాధులు ధన్యులౌదురుకదా! తత్వజ్ఞ చింతింపుమా! 1

హరిచరిత్ర సర్వపాప పరిహారం చేస్తుంది. శాంతి చేకూరుస్తుంది. కాబట్టి విష్ణుభక్తి ప్రధానంగా ఒకకావ్యం రచించు. శ్రీహరి భక్తి మహిమ చాలా గొప్పది. అందుకు నా జీవితగాథయే ఉదాహరణ.

---

· పోతన ఆంధ్ర మహాభాగవతం ప్రథమ స్కంధం 97

నేను పూర్వజన్మలో ఒక సేవకురాలి పుత్రుణ్ణి. మాతల్లి బ్రాహ్మణుల గృహాలలో పనులు చేస్తుండేది. ఒకసారి మేమున్న గ్రామములోనికి కొంత మంది మునీశ్వరులు వచ్చి చాతుర్మాస్య వ్రతం జరుపుకొన్నారు. వారిదగ్గర కూడా మాఅమ్మ పనులు శ్రద్ధగా చేస్తుండేది. అపుడు నేను చాలాచిన్నవాణ్ణి. నేనుకూడా మాఅమ్మతో అక్కడికి వెళ్ళేవాణ్ణి. అక్కడే ఆ మునీశ్వరుల మాటలువింటూ వారినే చూస్తూండేవాణ్ణి. వారు ఏవైనా పనులు చెప్పినపుడు శ్రద్ధగా భక్తిగా చేస్తూండేవాణ్ణి. వారి విస్తళ్ళలో మిగిలిన పదార్థాలు కళ్ళ కద్దుకొని తినేవాణ్ణి.

వారిసేవా ప్రభావంతో నాపాపాలు పటాపంచలైనాయి. వారి ప్రసాదం వలన నాచిత్తం పరిశుద్ధమయింది. మనస్సులో భక్తిబీజం అంకురించింది. వారు చెప్పుకొనే పురాణ భాగవత కథలు నాకూ వినాలనిపించేవి. క్రమక్రమంగా వారినిచూచి భజనలు చేయటం, జపంచేసుకోవటం, బొమ్మలుపెట్టి పూజలు చేసుకోవటం నేర్చుకొన్నాను. ఆటగా ఆరంభమయింది అలవాటయింది.

నిరంతర హరికథా శ్రవణంతో స్మరణంతో నాలోఉండే రజోగుణ తమోగుణాలు అంతరించాయి. సాత్త్విక భక్తి వృద్ధి కాజొచ్చింది.

ఆ ఋషిపుంగవులు నన్ను ప్రేమగా "బాలభక్తా!" అని పిలిచేవారు. ఆ దయామయులు నాపై కరుణవహించారు. నన్ను వారెంతో ఆప్యాయంగా చూశారు.

చాతుర్మాస్య వ్రతం ఆషాఢ పౌర్ణమితో ప్రారంభమయి కార్తీక పూర్ణిమతో పరిసమాప్తి అవుతుంది కదా! చివరకువారు గ్రామం విడిచి పోతూ పోతూ నాకు ఒక మంత్రం ఉపదేశించారు. దానితో నాకు గుహ్యతమ జ్ఞానం కలిగింది. పరమపదం లభించే వాసుదేవ తత్త్వం అవగాహనం కాజొచ్చింది.

అదివిని నా దేహం పులకించింది. భగవంతుని కృపకు పాత్రుణ్ణి అయి నానుకదా! అని సర్వేశ్వరునకు సాష్టాంగ దండ ప్రణామాలు సమర్పించు కొన్నాను.

ఆక్షణంనుంచి సంతత సంకీర్తన చేస్తూవచ్చాను. నిస్సంగుడనై విహరించాను. కృష్ణదేవుని మనస్సులో నిల్పుకొన్నాను. తపస్సే లోకంలా వ్యవహరించాను. కొన్నాళ్ళకు శరీరం త్యజించాను. అపుడు నాకు నారాయణ కృపా విశేషంవలన శుద్ధ విజ్ఞాన భాగవత దేహం ప్రాప్తించింది.

కమలాసనుడు కల్పాంతంలో అఖిలప్రపంచాన్ని కడుపులో ఇముడ్చుకొని ప్రళయ సముద్రంలో శయనించాడు. నేనుమెల్లగా వారి శ్వాసలో చేరి తిన్నగా హృదయంలో ప్రవేశించాను. సహస్రయుగాల తదుపరి ప్రపంచ సృష్టి ప్రారంభం కాబోతుండి. అపుడు మరీచి మొదలైన మహర్షులతో బాటు నేనూ పుట్టుకొనివచ్చాను. మా తండ్రి నాకు హరి తత్త్వం ఇంకా బాగా వివరించాడు.

అప్పటినుండి అఖండ బ్రహ్మచర్య బలంతో లోకాలన్నీ సంచరిస్తున్నాను. మహా విష్ణుమూర్తిని మధురంగా మహతిపై గానం చేస్తున్నాను. భగవంతుని కృపామృత వర్షం నాపై పూర్తిగా వర్షించింది. నా భాగ్యం పండింది.

వ్యాస కవీంద్రా! అదిమొదలు పరమాత్మ ఎప్పుడు పిలిస్తే అప్పుడు పలుకుతాడు. తలచుకుంటేచాలు తక్షణం ఆ దివ్యసుందర భువన మోహన మూర్తి నవ్వుతూ సాక్షాత్కరిస్తాడు.

ఈ సంసార సాగరం తరించడానికి శ్రీహరి నామకీర్తనం ఒక బంగారు నౌక. అదిలేక భవసాగర తరణం సాధ్యంకాదు మహర్షీ! అని భక్తితత్త్వాన్ని వ్యాఖ్యానించటం ఆరంభించాడు నారదమహర్షి.



# భక్తి ప్రేమస్వరూపిణి

1. సూత్రం - అథాతో భక్తిం వ్యాఖ్యాస్యామః

"ఇపుడు ఇక భక్తినిగూర్చి వ్యాఖ్యానిస్తాను" అని నారద మహర్షి వేదవ్యాసునికి ఉపదేశించడం ప్రారంభించాడు.

అథ అంటే శ్రీహరి కృపాప్రసాదంచేత తత్త్వచింతనాధికారం కలిగిఅనీ, మంగళార్థకంగా అనీ అర్థం. అతః అంటే ఈ సమయంలో. జ్ఞానకర్మ యోగాది అనేక శాస్త్రవిషయాలపై సిద్ధాంతాలూ రాద్ధాంతాలూ జరిగాయి. అవి ఆత్మకు అంత తృప్తిగాలేవు. కనుక ఇప్పుడు సర్వ ప్రధానమైన పరమ భక్తితత్త్వాన్నిగూర్చి ముచ్చటిస్తాను- అని నారద మహర్షి భక్తి దర్శన సూత్రాలను వ్యాఖ్యానించడం మొదలుపెట్టాడు.

మానవునికి అనురాగం, ప్రేమ, కామన అనేవి అతి సహజగుణాలు. ఇవి భగవంతునివైపు మరలితే అతిపూజనీయాలు. వీనివలన మానవుడు మహనీయుడు మాత్రమేకాదు మహాదేవుడవుతాడు.

లౌకిక ప్రేమానురాగాలు భగవంతునిపై నిల్పితే పరమప్రేమ అవుతుంది. అదేభక్తి "ఈ భక్తి మహత్తరమైన ముక్తికి సాధకమా" అని కొందరి సందేహం.

లౌకిక విషయానందాలు, అనుభవాలు, ఆలోచనలను ప్రమాణంగా తీసుకొని భక్తియొక్క శక్తిని తూచటం అవివేకం అజ్ఞానం.

లౌకిక అనురాగానికీ భక్తికీ నక్కకూ నాగలోకానికీ ఉన్నంత దూరం. అనురాగమూ భక్తీ స్థూలదృష్టికి ఒకటిగా అనిపించినా వాటి భేదం బాగా అవగాహనం అవుతుంది.

హృషీకేశ సేవనం భక్తిరుచ్యతే -

విష్ణుసేవకు భక్తిఅని పేరు. భక్తికి వ్యుత్పత్తి "భజసేవాయాం" అని.

ద్రుతస్య భగవద్ధర్మాత్ ధారవాహికతాం గతా
సర్వేశే మనసో వృత్తిః భక్తి రిత్యభిధీయతే 1

ఆర్ద్రి హృదయుడైన మానవుడు భగవద్ధర్మాలు నిరంతరం వినటం చేత వాని చిత్తం ద్రవిస్తుంది. వానికి అపుడు ధారావాహికంగా భగవంతునిపై ప్రేమ జనిస్తుంది. ఈ మానసిక ప్రవృత్తినే భక్తి అంటారు.

ఐహికమైన ప్రేమ క్షణభంగురం, అశాశ్వతం, అతిచంచలం. అదే ప్రేమ భగవత్ పరమైనపుడు భక్తి అవుతుంది. ఆభక్తి నిత్యమూ, సత్యమూ. అది భగవంతుని సాన్నిహిత్యం సాంగత్యం చేకూర్చే సర్వసులభమైన సాధనం అవుతుంది.

జీవాత్మకు పరమాత్మను దర్శించే భక్తి ప్రాప్తించినపుడు దివ్యానుభూతి, దివ్యానందం కల్గుతాయి. అపుడు భక్తుడు మేనుపులకించి సర్వేశ్వరునకు సర్వసమర్పణంచేసి సార్థక జన్ముడవుతాడు. భక్తిలేని బ్రతుకు వ్యర్థం. భక్తితోడి జీవనం చరితార్థం. అట్టి భక్తియొక్క శక్తిని ప్రవచిస్తున్నాడు బ్రహ్మమానస పుత్రుడు, నారద మహర్షి.

హరిభక్తి వర్జితుల సంసారాలు ఎంత నిస్సారాలో పోతనామాత్యుడు ఎన్నో ఉపమానాలతో వినిపించాడు-

అంధేందూదయముల్-మహాబధిర శంఖారావముల్-మూకసద్
గ్రంథాఖ్యాపనముల్-నపుంసక వధూకాంక్షల్-కృతఘ్నావలీ
బంధుత్వంబులు-భస్మహవ్యములు-లుబ్ధద్రవ్యముల్-క్రోడసద్
గంధంబుల్ హరిభక్తి వర్జితుల రిక్తవ్యర్థ సంసారముల్. 2

---

1. వావిలాల వేంకటశివావధానులు
శ్రీమద్భాగవత సారం, విష్ణుభక్తి తత్త్వవివేకం. పుట 326
2. భాగవతం సప్తమ స్కంధం 168.

2 సూ. సా త్వస్మిన్ పరమ ప్రేమ రూపా

ఆ భక్తి అంటే పరమేశ్వరునిపై చూపు. అదీ పరమప్రేమ.

భక్తి అంటే విష్ణుప్రేమ, అదే విష్ణుసేవ. విష్ణువు విశ్వంభరుడు, ఆతడే కృష్ణుడు, రాముడు, శివుడు; పేర్లు మాత్రంవేరు, కానీ సచ్చిదానంద స్వరూపుడు మాత్రం ఒక్కడే. ఒక్కడే అనేకం.

సహస్ర శీర్షా పురుషః
సహస్రాక్ష స్సహస్రపాత్ 1

అనేక శిరస్సులూ, అనేక నేత్రాలూ, అనేక పాదాలూ అన్నీ ఆయనవే. ప్రాణులన్నీ ఈశ్వర ప్రతిబింబాలే. విశ్వం విష్ణు స్వరూపం. అదే ప్రేమ మయం.

మాతృదేవో భవ పితృదేవో భవ
ఆచార్యదేవో భవ అతిథి దేవో భవ

అని మానవుడే మాధవుడు అనీ జనుడే జనార్దనుడు. అనీ నరుడే నారాయణుడు అనీ భావించింది భారతీయ ఉపనిషద్వాణి. ఆ భావంతో లోకసేవను లోకేశ్వరుని సేవగా చేశారు, భారతీయ ఋషిపుంగవులు.

ఆ పరమపురుషుని ఆరాధనమే భక్తి. ఆ భక్తిరూపం పరమ ప్రేమ మయం. ఆ పురుషుడు ప్రేమమూర్తి. అది పేమమందిరం. ఈ పవిత్ర భక్తి మందిరంలో ప్రవేశించటానికి శ్రీధరస్వామి నవసోపానాలు అధిరోహించాలి అన్నాడు.

ఈ పరమప్రేమ భక్తి మోక్షంకంటే ఉన్నతమయింది. ధర్మ అర్థ కామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాలుకాక పురుషుడు సాధించ వలసిన ఐదవ పురుషార్థం ఇది అని పండితుల నిశ్చయం.

---

1. శుక్లయజుర్వేదం 18వఅధ్యాయం 1.

మహర్షులు వెళ్ళిన తర్వాత చాలాకాలంవరకు వారు చెప్పినట్లుగా శ్రద్ధగా ఇంకాదీక్షగా "మంత్రం" జపిస్తూ నియమాలు పాటిస్తూ వచ్చాను. నా మనస్సు శ్రీహరి పదభక్తిలో లగ్నమయింది.

ఒకరోజు రాత్రివేళ మా అమ్మను ఒకపాము కాటువేసింది. దానితో ప్రపంచంలో నన్ను మిక్కిలి గారాబంగా చూసేతల్లి చనిపోయింది. గుండె బ్రద్దలయ్యేలాగ ఏడ్చాను. ప్రక్కవారు నన్ను ఓదార్చారు.

నా మనస్సు పరిపరి విధాల ఆలోచించింది. 'ఇలా భగవంతుడు సర్ప రూపంలో వచ్చి మాతృమమతా బంధాన్ని తెంచివేశాడు. ఇదీ నామేలు కొఱకే కాబోలు!' అనుకొన్నాను. నా మనస్సు కుదుటపడింది.

భాగీరథి ఒడ్డున భగవచ్చింతనలో మునిగిపోయాను. ఏళ్ళు పూళ్ళు గడిచిపోయాయి.

ఒక శుభముహూర్తాన కమలాక్షుడు, కౌస్తుభవక్షుడు, కరుణా కటాక్షుడు నా కన్నులముందు ప్రత్యక్షమైనాడు. ఆ స్వామి ప్రసన్నవదనం, ఆ మధుర సుందర మందహాసం, ఆ కరుణా కటాక్షం నాకు మహానందం కలిగి చాయి. ఆ పరమానందం ఆ సుఖానుభవం మాటలకందదు మహర్షీ!

క్షణంలో ఆ భువన మోహనమూర్తి అదృశ్యమయినాడు. మరల అటువంటి ఆనందానుభవం కోసం పరితపించాను. అది లభించలేదు.

అశరీర వాణిగా అచ్యుతుని అమృతవాణి ఇలా వినిపించింది-

" ఓ బాలభక్తా! పరితపించబోకు. నాపై భక్తి దృఢపడుటకై ఒకసారి దర్శన భాగ్యం అనుగ్రహించాను. సత్సంగ ప్రభావంతో నీకు స్వచ్ఛమైన భక్తి కుదిరింది. నీవు అనతి కాలంలో ఈశరీరాన్ని విడిచి నేరుగా నా సామీప్యానికి వస్తావు. నీలో భక్తి నిశ్చలంగా ఉంది. కల్పాలు జరిగినా నీకు జన్మ పరిజ్ఞానం జ్ఞప్తిలో ఉంటుంది. "

న కించి త్సాధవో ధీరాః
భక్తా హ్యేకాంతినో మమ
వాంఛ త్యపి మయాదత్తం
కైవల్య మపునర్భవమ్ 1

నాపై ఏకాంత భక్తి గల సాధువులు మరోజన్మలేని మోక్షం ఇస్తామన్నా "వద్దు ప్రభో! నీ పాదపద్మాలపైని ప్రేమ భక్తి ప్రసాదించండి" అని ప్రాధేయపడతారు.

దీనినే "అనన్యభక్తి" అని గీతాచార్యులు, "జ్ఞానలక్షణం" అని శంకర భగవత్పాదులు, "జ్ఞానాఖ్య" అని ఆనందగిరి పండితులు పేర్కొన్నారు.

మానవులారా! జ్ఞానకర్మ యోగాది సాధనా రహస్యాలు తెలియకపోయినా చింతించకండి. భయపడకండి. భక్తిలో అన్ని సుగుణాలు ఇమిడి ఉన్నాయి.

మనసారా మాధవుని సేవించండి, ప్రేమించండి, మననం చేయండి, ధ్యానించండి. స్వామి సర్వాంతర్యామి. సర్వప్రాణికోటినే కాదు, చేతనా చేతనాలను సైతం పరమ పూజనీయములుగా భావించండి, సేవించండి.

శారీరక స్పృహ లేనంతగా తన్మయత్వంతో హరిభజన చేయండి. చిత్త ప్రవృత్తిని శ్రీహరివైపు మళ్ళించండి. అదే భక్తి. అదే ప్రేమ.

ఈ దీక్షావ్రతంలో ఇహలోక భోగాలేకాదు, పరలోక సౌఖ్యాలూ త్యజించండి. నిజమైన భక్తుడు మోక్షంకూడా కోరుకోడు. మీ జీవనం ఆ ప్రేమమయుని గుణశ్రవణంతో నామస్మరణంతో యశః కీర్తనంతో రూపచింతనతో పాదసేవనంతో ముడిపడి ఉండాలి. అది ఒక్కటే ధ్యేయంగా భక్తిని అభ్యాసం చేసుకుంటూవాలు.

---

1 శ్రీమద్భాగవతసారం విష్ణుభక్తి వివేకం 329.

మీ అనురాగం, ఆసక్తి, మమత, మమకారం, ప్రీతి, ప్రేమ అశాశ్వతమైన ఏవస్తువుపైనా ఉండరాదు. అన్నీ ఆ పురుషోత్తమునిపై నిలపాలి. ప్రేమ భావనతోనే బ్రతుకు పండాలి. తైలధారవలె భక్తిరసం హృదయనాళాలలో ప్రవహింపచేస్తుండాలి.

మీ బాహ్యేంద్రియాలు అంతరింద్రియాలు ఆ భగవంతుని సేవా కార్యాలలో సంలగ్నమై నిమగ్నమై ఉండాలి. భక్తి తప్ప మనస్సుకు మరొక ఆలోచ చేయటానికే అవకాశం ఈయరాదు. ఆ స్థితియే "అనన్య భక్తి యోగం" అదే సాధ్యభక్తి. అదే మానవుని మాధవుని చేసే మహత్తర భక్తియోగం. ఇది పరమ ప్రేమామృత భరితం అంటాడు నారదమహర్షి.

× × ×

తను హృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు ఆత్మలో నెరుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచు తలతున్ సత్యంబు దైత్యోత్తమా! 1

3 సూ. అమృత స్వరూపాచ

భగవంతునిపై ప్రసరించునట్టి ప్రేమయే భక్తి.

ఆ ప్రేమ అమృత స్వరూపం, ఆ ప్రేమ మధురాతి మధురం. ఆ భక్తిరసామృతం పానంచేసినవాడు అమృతుడు, అమరుడు, అనంతుడు.

ప్రస్తుత లోకంలో వ్యవహరింపబడే ప్రేమ నిజమైన ప్రేమకాదు. ఇది వట్టి కామం, మోహం. ఇది సుఖాన్నిచ్చి ప్రతిఫలంగా ఎక్కువ సుఖం కోరుకునేది. ఈ ప్రేమ అమృతంకాదు, మృతం. అచ్యుతం కాదు చ్యుతం. అక్షయంకాదు, క్షయం.

1. ఆంధ్ర భాగవతం సప్తమ 167

భగవంతుని గూర్చి నిస్వార్థమైన కామన అనేది ఉంటే అదీ ప్రేమ. అక్కడ పవిత్ర ప్రేమజ్యోతి వెల్గుతూఉంటుంది. స్వార్థం కామం మోహం అనే తిమిరాలు అటుచేరవు. పవిత్ర ప్రేమకాంతి మనసంతా తనువంతా నిండి నిబిడీకృతంగా ప్రకాశిస్తూఉంటుంది. భక్తుని దేహంలోని నర నరాలలో ప్రవహించేది రక్తంకాదు, అమృతరసం.

ఈ తీవ్రకామన భక్తుని మానసంలో పెరిగి పెరిగి మాయా మోహా బంధాలను విడకొడుతుంది. అమృతం ప్రవహింపచేస్తుంది. అదే భక్తియొక్క శక్తి. అదే భగవంతుని భక్తుల దగ్గరకు చేరుస్తుంది. భక్తులను భగవంతుని ఒడిలోనికి పంపుతుంది. దయామయుడైన భగ వంతుడు వాళ్ళను తన ప్రేమాంకపీఠికి చేరదీసుకుంటాడు. తానూ వాళ్ళ నిలయాలలో హృదయాలలో నిలిచి పర్యవేక్షిస్తుంటాడు, సంరక్షి స్తుంటాడు.

భక్తుడూ భగవంతుడూ కలిసి ఉండటమే అమృతత్వం, అమరత్వం. నీరధిలో నీటిచుక్క కలిసి ఉంటేనే దానికి అమృతత్వ సిద్ధి, నిత్యత్వ ప్రాప్తి. వేరయితే మృత్యుదశయే. చేప నీటిలో ఉంటేనే జీవిస్తుంది. బయటపడితే బ్రతకలేదు భక్తుడూ అంతే, భక్తిరస సముద్రంలో మాత్రమే జీవించగలడు.

అందుకనే నిజమైన భక్తుడు ముక్తి కోరుకోడు, భక్తి కోరుకుం టాడు. మాధవుని మధుర భక్తిలోనే రక్తి చూపిస్తాడు. నీరజాక్షుని సేవలోనే నిత్యుడై ఉండాలని అపేక్షిస్తాడు. కనుకనే భక్తుడు అమృతుడు -అని అంటాడు నారద మహర్షి.

"నీ పాదపద్మాలపై శిరసువంచి మ్రొక్కి అర్థిస్తున్నాను జగ న్నాథా! జన్మరాహిత్యం అక్కరలేదు. జన్మజన్మాలకు నీపాద సంసేవా సక్తి విడవకుండా ప్రసాదించు, మరేకోరిక కోరను. ఈమాత్రంచాలు" అంటారు భక్తితో కులశేఖరులు.

ముకుంద మూర్ధ్నా ప్రణిపత్యయాచే
భవంత మేకాంత మియంత మర్థం
అవిస్మృతి స్త్వచ్చరణారవిందే
భవే భవేమేఽస్తు భవత్ ప్రసాదాత్ 1

4 సూ. యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధో భవతి
అమృతో భవతి తృప్తో భవతి

భగవత్ ప్రేమామృతం త్రాగిన మానవుడు సిద్ధుడు. ఆతడు సంతృప్తుడు, అమృతుడు.

సిద్ధుడు అంటే అణిమాది అష్టసిద్ధులు పొందినవాడు అనికాదు. భక్తి యోగంలో పరిపూర్ణ సిద్ధిని పొందినవాడు అని భావం. నిజమైన భక్తునికి అన్ని సిద్ధులు సిద్ధిస్తాయి. కానీ భక్తుడు చివరకు మోక్షసిద్ధిని కూడా తృణీకరిస్తాడు. ఈ సిద్ధులే సద్భక్తులను లోభపెట్టడానికి అప్సరసల్లా వాళ్ళ చుట్టూ తిరుగుతూంటాయి. అయితే ఆ భక్తుని భక్తి యొక్క శక్తిముందు ఇవి తట్టుకోలేక పలాయనం జపిస్తుంటాయి. లేదా భక్తికి ప్రణమిల్లి దాస్యం చేస్తుంటాయి. భక్తుడు వీటివంక కన్నెత్తి కూడా చూడడు

"నన్ను త్రికరణశుద్ధిగా కోరే భక్తుడు బ్రహ్మపీఠం ఇంద్రాసనం చక్రవర్తిత్వం మహాలోకాధిపత్యం వంటి ఏ మహాపదవిని ఇస్తామన్నా స్వీకరించడు. మరే యోగసిద్ధులూ కోరుకోడు. చివరకు మోక్షసామ్రాజ్యం లభిస్తుంది అన్నా కాదు పొమ్మంటాడుసుమా!" అని భాగవతంలో భగవంతుడు ప్రవచించాడు. 2

---

1. ముకుందమాల కులశేఖర ఆళ్వారులు
2. శ్రీమద్భాగవతం ఏకాదశ 14

భువనమోహనుని మధురమైన ఆరాధానలో మైమరచిన ఒక భక్తుని అనుభవం ఇలా వ్యక్తీకరింపబడింది.

"పద్మపత్రాక్షుని పాద సమర్చనలో నాతనువు పులకిస్తుంది. భక్తి రసంలో నా మానసకమలం వికసిస్తుంది. సాయుజ్యం సార్ష్టి సాలోక్యం సారూప్యాదిముక్తులూ, అష్టసిద్ధులూ నా ద్వారంముందు పడిగాపులు కాస్తుంటాయి. అవి గర్వాలుడిగి నాకు దాస్యం చేయటానికి తపించిపో తుంటాయి. నేను వాటిని స్వీకరిస్తే సార్థకత చెందినట్లు భావిస్తుంటాయి. ముక్తి శక్తి మొదలైన సిద్ధులు భోగాలు హరిభక్తి అనే మహాదేవికి దాసీలై నిత్యం సేవిస్తుంటాయి."

అనగా భక్తుడు సర్వవిధాల పూర్ణకాముడు. మానవుడు భక్తి తపస్సులో కృతకృత్యుడు కాకపోతే మళ్ళీ మళ్ళీ జన్మలెత్తవలసిందే. పూర్ణకాముడైన భక్తుడు నిశ్చలుడై సృష్టి స్థితి లయములను భగవంతుని లీలగా భావించి చూస్తూ ఆనందం అనుభవిస్తుంటాడు. ఆ భక్తుడు కాలానికే కాలుడు, భయానికే భయంకరుడు. ఆ భక్తుడు మహోన్న తుడు.

మానవుడు దృశ్యమాన పదార్థం వేరు, భగవంతుడు వేరు అనే మాయలో ఉన్నంతవరకు సుఖాలు దుఃఖాలు కష్టాలు నష్టాలు లాభాలు లోభాలు అని పదార్థాలను వేరుచేస్తూ క్రొత్త క్రొత్తవాటిని అపేక్షిస్తూ అనుభవించిన వాటిని ఆక్షేపిస్తూ అసంతృప్తుడై ఆరాటపడు తుంటాడు.

భగవంతుని పూర్ణత్వం అవగతం చేసుకొన్న సంయమి మనస్సు అన్యపదార్థాలపైకిపోదు. అది ద్వంద్వాలకు అతీతంగా ప్రాప్తించిన దానికి సంతృప్తి పడుతుంది, అమృతస్థితి వైపుకు ప్రయాణిస్తుంది. అపుడు ఆ మనస్సంయమి పూర్ణత్వం పొందుతాడు, తృప్తుడవుతాడు అదే సిద్ధి. అట్టి ఉత్కృష్టమైన సిద్ధిని పొంది భక్తుడు తృప్తుడై అమృతుడౌతాడు.

ఇటువంటి భక్తులనుగూర్చి శ్రీ మహావిష్ణువు ఇలాఅన్నాడు. నా భక్తులు సిద్ధులు, అమృతాత్ములు, సంతృప్తులు, పరమసాధువులు.

సాధుల హృదయము నాయది
సాధుల హృదయంబు నేను జగములనెల్లన్
సాధుల నేన యెఱుంగుదు
సాధులెఱుంగుదురు నాదు చరితము విప్రా! 1

5 సూ. యత్ప్రాప్య న కించి ద్వాంఛతి
న శోచతి నద్వేష్టి న రమతే నోత్సాహీ భవతి

భక్తిరసామృతం గ్రోలినవాడు మరేవస్తువులను వాంఛించడు. ఏ కష్టానికి దుఃఖించడు, ఎవరినీ ద్వేషించడు, ఏ వస్తువుతోను సంతోషించడు, ఏ కార్యంపైనా ఉత్సాహం చూపించడు. దేనికీ పొంగిపోడు, ఏ కష్టానికి కుంగిపోడు.

భక్తి అలవడిన అదృష్టవంతుని ఇంటిముందు కల్పవృక్షం ఆవిర్భవిస్తుంది, పెరటిలో కామధేనువు నివసిస్తుంది, చేతిలో చింతామణి ప్రకాశిస్తుంది. ప్రక్కన పారిజాతం పరిమళిస్తుంది. అయినా వానికి ఏ కోరికా కలగదు. త్యాగులు యోగులు భోగులు కోరుకొనే ఐశ్వర్యం సౌందర్యం మాధుర్యం యశోధనం మొదలైనవి భక్తుని దృష్టిలో అత్యల్పాలు అతి నీచాలు. ఆ భక్తినిధికి సమంగా ఈ ప్రపంచంలోని నిధి నిక్షేపాలు సమస్తం కలిసినా ఆవగింజలో అరవైయవ వంతుకుకూడ తూగలేవు. కనుక భగవత్ప్రేమలో నిమగ్నమైన వానికి ఐహిక పదార్థాలు అతి నికృష్టాలు.

---

1. ఆంధ్ర మహాభాగవతం నవమ 123

మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు ?
నిర్మల మందాకినీ వీచికలదూగు
రాయంచచనునె తరంగిణులకు ?
లలిత రసాల పల్లవ ఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు ?
పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం
బరుగునే సాంద్ర నీహారములకు ?
అంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేషమత్త
చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు?
వినుత గుణశీల! మాటలు వేయునేల! 1

మందార పుష్ప మకరందం ఆస్వాదించే తుమ్మెదలు ఉమ్మెత్తల వైపుకూ, ఆకాశగంగావిహారం చేసే రాజహంసలు వాగులవైపుకూ, తియ్యమామిడి చిగుళ్ళు ఆరగించి పాటలుపాడే కోకిలలు అడవిమల్లెల వైపుకూ, పండు వెన్నెలలో విహారాలు చేసే చకోరాలు మంచుబండల వైపుకూ వెళ్ళనట్లే శ్రీహరి పాదారవింద చింతనా పరుని చిత్తము ఇతర వస్తువులవైపుకు పోదయ్యా! అన్నాడు శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో.

భక్తుడు ప్రపంచ సృష్టి స్థితి లయములకు సంతోషించడు, దుఃఖించడు. అంతా పరమాత్మ లీలగా దర్శించి మగ్నుడవుతాడు. భక్తిలో లీనమవుతాడు. చివరకు ముక్తిసాధనలు లోపించాయనికూడా అనుకోడు, ఆవేదన చెందడు. ఎన్నిజన్మలెత్తినా జన్మ జన్మకు హరిభక్తి పరివృద్ధం కావాలనే కాంక్షిస్తాడు. భక్తిధనాన్ని వృద్ధి చేసుకోవటమే భక్తుని పరమావధి. కనుక స్థితప్రజ్ఞుడైన భక్తుడు దేనికీ దుఃఖించడు.

1. ఆంధ్ర మహాభాగవతము సప్తమ 150

లౌకికులకు అనుకూలాలు ప్రతికూలాలు అంటూ ఉంటాయి. కానీ భక్తులకు ప్రతికూలాలు ఉండవు. భక్తులు విశ్వాన్ని విష్ణుదేవుని వినోద వేదికగా భావిస్తారు. కనుక సృష్టిలోని చరాచరాలలోనూ అణువణువులోనూ విష్ణువుని దర్శిస్తారు. భక్తుల హృదయాలలో సత్య దయా గుణాలేకానీ ద్వేషం అనేదే ఉండదు. వారిలో ప్రేమప్రవాహమే సర్వత్రా ప్రవహిస్తూంటుంది. అట్టివారికి అన్యచింతనకు అవకాశమే ఉండదు.

యోగ తత్త్వం గోపికలకు బోధించి వారికేదో జ్ఞానం కలుగ చేద్దాము అని ఉద్ధవుడు జ్ఞాన గర్వంతో వ్రేపల్లెకు వచ్చాడు. ఆ ఉద్ధవునితో ఒక గోపిక ఇలా అంటుంది-

"మహానుభావా! ఉద్ధవా! మాకు మనస్సు ఒక్కటే. అది నంద నందనుని పాదారవింద సమారాధనలో అర్పితమయింది. నందనందనుడు నవనీతచోరుడేకాదు మా మానసచోరుడూనూ, మాధవుడే మా ధవుడు. ఆతడు మధుర మురళీగానంతో మాధుర్య వచస్సుతో మా మనస్సును కాజేసి మధురకు వేంచేశాడు. ఇక మనస్సులేని మనుష్యులంగా మిగిలాము మేము. అమనస్కులమైన మాకు యోగసాధన ఎలా!

మా కన్నులనిండా కమలాక్షుని కమనీయ రూపమే. వీనులనిండా వెన్నదొంగ లీలావిలాసాలే. మనస్సునిండా మాధవుని మధురభక్తిరసామృతమే. ఇతరాన్ని మా కనులు కాంచలేవు. మా వీనులు వినలేవు. మా మనస్సు మననంచేయలేదు. మాకు మరొక మార్గం రుచించదు. మా హృదయంలో మరొక మాటకుకూడ చోటులేదు. మేము కృష్ణ శ్రవణం, కృష్ణ స్మరణం, కృష్ణ సేవనం తప్ప అన్యభావనం ఎరుగము.

మా రోమం రోమం కృష్ణనామం జపిస్తున్నదిచూడు. మా సర్వస్వం ఆ మధురాధిపతే. అన్యయోగాలు జ్ఞానాలు మేము ఎరగం, మాకు అక్కరలేదు. బాబూ! మా బ్రతుకులిలా నేసాగనీ! " 1

మానవులు సుఖం లభిస్తుందనే స్వార్థంతో అన్య పదార్థాలవైపు పరుగులుతీస్తారు. కానీ భక్తునికి అన్యం అంటే అసహ్యం.

"ఏ ప్రాణిపైన ద్వేషం రోషం లేనివాడు, దేనిపైన మమతా మమకారాలు పెంచుకోనివాడు, అహంకారం వికారం లేనివాడు, తన మనస్సును నాకు సమర్పించినవాడు, క్షమా శీలుడు, హర్ష ద్వేషాలకు శోకకామనలకు సుఖదుఃఖాలకు అతీతంగా ఉన్నవాడు, శుభాశుభాలను మానావమానాలను అలక్ష్యం చేసేవాడు, నాకు ప్రియభక్తుడు" అని గీతాచార్యుని అభిభాషణం.

> యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి
> శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః 2

6 సూ. యద్ జ్ఞాత్వా మత్తో భవతి
స్తబ్ధో భవతి ఆత్మారామో భవతి

భక్తి తత్త్వం అనుభవంలోకి వచ్చినవాడు తన్మయుడైపోతాడు, శాంతి అపేక్షిస్తాడు, ఆత్మారాముడై ఆనందం పొందుతాడు.

భగవద్భక్తి మానవుణ్ణి తన్మయుణ్ణి చేస్తుంది, అదే భక్తి దర్శనంలో ఉన్మత్తత అవుతుంది. హృదయం ప్రేమ రసంలో లీనంకావటం భక్తి లక్షణం.

---

1. సూరదాసు సూరసాగర్
2. భగవద్గీత ద్వాదశ 17

భక్తుడు అల్పమైన లౌకిక వ్యవహారాలు విస్మరిస్తాడు. రామ కీర్తనంతో, నామ జపంతో, రామ గానంతో, ధ్యానంతో భక్తుడు యుగాలు నిమిషాలులా గడుపుతాడు. దీనితో స్వార్థం లేశంకూడ వాని కంటు కోదు. త్యాగభావం అలవడుతుంది, ఇతరవస్తు స్పృహ ఉండదు. ఆతడు పైకి పిచ్చివాడుగా ఉంటాడు కానీ వాని మానసికస్థితి మహనీయం, అనిర్వచనీయం. వానిదృష్టి అంతర్ముఖమై విద్యుల్లోకాలలో విష్ణుదేవుని చుట్టూ పరిభ్రమిస్తూ ఉంటుంది.

భక్తుడు ఆభక్తి తన్మయత్వంలో ప్రశాంత చిత్తస్థితి అనుభవిస్తాడు. వాని చిత్తం చపలత్వం విడిచి సుస్థిర శాంతి పొందుతుంది. వానికి అమనస్కస్థితి వస్తుంది. మనస్సు లేనపుడు కోరికలేఉండవు. అదే పూర్ణకాముని స్థితి. అపుడు భక్తుడు తన హృదయపీఠంపై హృషీకేశుణ్ణి దర్శించి రూపసౌందర్య మాధుర్యాలు పానంచేస్తూ స్తబ్ధుడవుతాడు. చిత్తం పరాయత్తమై శాంతిని పొందటమే స్తబ్ధత.

భక్తుని ఆత్మ ఆనంద మగ్నమైనపుడు కలిగే స్థితిసే ఆత్మారాముని దశ అంటారు. ఆ మహానుభావుణ్ణి విషయభోగాలు స్వర్గసుఖాలు ఏవీ భ్రమింపజేయలేవు. అవి ఎండమావులనీ, అశాశ్వతాలనీ గ్రహిస్తాడు భక్తుడు.

నహి స్వాత్మారామం
విషయ మృగతృష్ణా భ్రమయతి 1

ఆత్మారామునికి అంతా అచ్యుత పదార్థమేకాని అన్య పదార్థం ఏదీ ఉండదు. "సర్వం బ్రహ్మమయం", "విష్ణు మయం జగత్" అని

1. శివమహిమ్న స్తోత్రము

భావన చేస్తాడు ఆ భక్తుడు. ఇదే ప్రేమాద్వైతం, ఇదే రసాద్వైతం. భక్తుడూ భగవంతుడూ అనే భేదంపోయి వాడే వీడవుతాడు. అదే "సోఽహమ్."

శుక యోగీంద్రుని దృష్టిలో భక్తుని భావనాలహరి ఇలా ఉంటుంది-

హరిమయము విశ్వమంతయు -
హరి విశ్వమయుండు-సంశయము పనిలే-దా
హరిమయము కాని ద్రవ్యము
పరమాణువు లేదు-వంశపావన వింటే! 1



1. ఆంధ్ర మహాభాగవతము ద్వితీయ 17

# ఏకాగ్ర భక్తి

7 సూ. సా న కామయమానా నిరోధ రూపత్వాత్

ఆ భక్తి కామనాయుక్తమైనది కాదు. అది నిరోధ స్వభావమైనది.

భక్తి కామనతో కూడిన మ్రొక్కుబడి కాదు. మ్రొక్కగానే కోరిక లిచ్చేది కాదు. అది కామనిరోధం. అది సంయమం. అదే ప్రేమమార్గం. కామనా నిరోధం దాని స్వరూపం. కామవిజయం దాని స్వభావం. త్యాగం దాని యోగం, దానం దాని జీవనం పూర్ణత్యాగం దాని భోగం.

ధనం మనం భార్యాపుత్ర సంసార బంధనం పదవీ, కీర్తీ, సర్వం పూర్ణాహుతి చేయుటే భక్తి యొక్క కార్యం. ఇంతే కాదు. మోక్షా కాంక్ష కూడ త్యాజ్యమే. కోరికలు జయించటం ఒక్కటే భక్తుని ఏకైక లక్ష్యం.

భక్తికీ ప్రేమకీ ప్రతిఫలం ఆశించకూడదు. ప్రతిఫలం ఏమిటి? అని ఆలోచన వచ్చినా అది నిష్కళంకమైన భక్తి కాదు - అది కామనా యుతం. స్వార్థ వ్యాపారం లౌకికం అవుతుంది.

అనన్య భక్తి కలిగిన మహాత్ముల చిత్తంలో కోరికలు పుట్టవు. పుట్టటానికి అవకాశమే లేదు. భక్తి ఒక పరంజ్యోతి. అది ఉన్నచోట కామాంధకారాలకు స్థానమే లేదు. ఆ భక్తికి అలాంటి మహాశక్తి ఉంది. అది పవిత్ర త్యాగాగ్ని, అఖండ జ్వాలామూర్తి.

"కామ నిరోధ" మంటే సమస్త కార్యకలాపాలు పూర్తిగా వదలి వేయటం అని పొరపడతారేమో అది కాదు. విషయవాంఛలు నిరోధించటం అనే గ్రహించాలి.

ధర్మరాజు ద్రౌపదితో ఇలా అన్నాడు - "రాజపుత్రీ! నేను ఫలాన్ని కోరి ధర్మం ఆచరించటంలేదు. ఈయదగినది అని దానం చేస్తున్నాను. యజింపదగునని యజ్ఞం చేస్తున్నాను. ధర్మం అనే భావంతోనే కృష్ణ ధ్యానం సాగిస్తున్నాను. ధర్మం అమ్మికొని బ్రతికేవాడు నీచుడు. వాడు ధర్మవాదులలో అధముడు."

నాహం ధర్మఫలాకాంక్షీ రాజపుత్రి చరామ్యుత
దదామి దేయమిత్యేవ యజే యష్టవ్యమిత్యుత
ధర్మఏవ మనః కృష్ణే స్వభావా చ్చైవ మే ధృతమ్
ధర్మవాణిజ్య కో హీనో జఘన్యో ధర్మవాదినామ్. 1

8 సూ. నిరోధస్తు లోక వేద వ్యాపార న్యాసః

నిరోధం అంటే లౌకిక వైదిక కర్మఫలత్యాగం.

కర్మత్యాగం అంటే పనులు మానుకోవటం అని కాదు. సర్వం సర్వేశ్వరార్పణ బుద్ధితో చేయటం అనిభావం. అంటే కర్తవ్యం తనమీద పెట్టుకోకుండ తాను కర్తను కాదని నిస్వార్థ బుద్ధితో కర్మకాండను భక్తుడైనవాడు నిర్వర్తించాలి.

నిరోధం అంటే లోకవ్యాపారాలు, కర్మకాండ, శాస్త్రవిధులు, నిత్యనైమిత్తికాదులు, భగవదర్పితంచేసి నిష్కామంగా కర్తవ్యాలు నెరవేర్చాలి అని, భగవద్గీతలో శ్రీకృష్ణుడిదే భావమును అర్జునుడితో వచించాడు.

---

1 మహాభారతం అరణ్యపర్వం అశ్వాసం 31

కామ్యానాం కర్మణాం న్యాసం
సన్న్యాసం కవయో విదుః
సర్వ కర్మ ఫలత్యాగం
ప్రాహుః త్యాగం విచక్షణాః ।

యత్కరోషి యదశ్నాసి
యజ్జుహోషి దదాసియత్
యత్తపస్యసి కౌంతేయ!
తత్కురుష్వ మదర్పణమ్. 2

సమస్తం భగవదర్పితంచేసి నిష్కామంగా కర్తవ్యం నెరవేరిస్తే కర్మత్యాగం దానంతట అదే సిద్ధిస్తుంది. భక్తిరసంలో తన్మయులైన భక్తులు ప్రాణప్రియుడైన భగవంతుని విడిచి మరో ప్రసంగం చేయరు, చేయజాలరు. వారి కన్నుల ముందు కమలాక్షుడే కనిపిస్తాడు. వారు ఏ పనిచేసినా కృష్ణ పరిచర్య అనే భావిస్తారు.

గోపికలు కృష్ణదేవుని ఇలా ప్రశ్నించారు - "ఓ దివ్యమోహన మూర్తీ! మా మానసాలు గృహకృత్యాలు చేయటానికి ఇదివరకు ఆనందంగా సిద్ధపడేవి. కానీఅవి ఇపుడు నీ సేవా కార్యాలు విడిచి మరో పనికి రావటంలేదు. మా హస్తకమలాలు నీ పరిచర్యలలోనే కానీ ఇతర గృహ కార్యాలు చేయనంటున్నవి. మా చరణాలు నీ సన్నిధానం వైపే కాని ఇళ్ళదిశకు మళ్ళడంలేదు. మమ్మ నిర్దాక్షిణ్యంగా నీవు ఇంటికి వెళ్ళమంటే ఎలా వెళతాము? వెళ్ళి ఏమిచేస్తాము."

లౌకిక ప్రపంచ పటం భక్తుని హృదయ దర్పణంపై ప్రతిబింబించదు. కనుక భక్తుడు లౌకిక కర్మలుకానీ వైదిక కర్మలుకానీ చేయటానికి అసమర్థుడు. అన్ని కర్మ బంధాలు వాటంతటవే భక్తుని నుండి విడిపోతాయి.

---

1, 2 భగవద్గీత

గోపికలు ఇందుకు ఉజ్జ్వలోదాహరణలు. వారికి కృష్ణ ప్రేమలో, కృష్ణ దాస్యంలో, కృష్ణ లీలలలో యుగాలు క్షణాలుగా గడిచిపోతాయి, బంధువులనినా, భర్త అనినా, లోకులు అనినా, భయం అసలేలేదు. అన్యదైవములపై ఆసక్తే లేదు.

వారికి కృష్ణ ప్రసంగం తప్ప మరొక ధ్యాసలేదు. ఇదే స్వచ్ఛమైన భక్తి లక్షణం అంటాడు - నారద మహర్షి. ఇలా భగవచ్చింతనలో మనస్సు లగ్నంచేసి కర్మలు చేయటమే నిరోధ-అంటే.

పరమేశ్వర భక్తిలో ప్రపంచాన్ని మరచిపోవాలి. పానీయం త్రాగేటపుడు, ఆహారం భుజించేటప్పుడు, నిద్రలో, స్వప్నంలో ప్రతిక్షణం పద్మనాభుని ప్రశంసయే. శ్రీపాదపద్మ సంస్మరణలో, ధ్యానంలో, పూజలో మనస్సును లీనంచేసి తన్మయుడవుతాడు భక్తుడు. వానికి ఐహిక స్ఫురణే ఉండదు. ఈవిషయమునే శుకమహర్షి ఇలా వచించాడు-

పానీయంబులు ద్రావుచున్ కుడుచుచున్ భాషించుచున్ హాసలీ
లా నిద్రాదులు చేయుచున్ తిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతస్వాద సం
ధానుండై మరచెన్ సురారిసుతుడా తద్విశ్వంబునున్ భూవరా ।[1]

9 సూ. తస్మిన్ననన్యతా తద్విరోధిషూదాసీనతా చ

భగవంతుని యెడల అనన్యప్రేమ కలిగి తద్వ్యతిరిక్తమైన విషయాలపట్ల ఔదాసీన్యం వహించటం నిరోధం.

భక్తిలో తన్మయత్వం కల్గనంతవరకు భక్తుడు అన్ని విధులు నిర్వర్తిస్తూ భగవత్సేవలో మునిగి ఉండాలి. నేను పరమతంత్రుడినై కార్యం

---

1. ఆంధ్ర మహాభాగవతం సప్తమ 123

నిర్వహిస్తున్నాను. అనేభావంతోనే భక్తిలో తన్మయత సంపాదించాలి. భక్తి భూమికలలో తానెంతవరకు ఉత్తీర్ణుడవుతున్నదీ ఆత్మసాక్షిగా పరీక్షించుకొనుచూ ఆసక్తితో, ప్రేమతో ముందుకు పోతూండాలి.

భగవద్వ్యతిరిక్త విషయాలలో ఉదాసీనుడై ప్రవర్తించాలి. ఇలా జాగ్రత్తగా నియమాలు పాటించటాన్ని "ఆత్మ సంయమం" లేక "చిత్త నిరోధం" అంటారు. ఇది భక్తునికి చాలా అవసరం.

భక్తుడు చేసే ప్రతి కృత్యం భగవంతుని కార్యమే అవుతుంది. ఒక భక్త శేఖరుడిలా పలికాడు-

శంకర! ఆత్మనీవు - గిరిజాసతి నామతి - పంచప్రాణముల్
లెంకలు - దేహమేగుడి - నిలింపనుతా! నిదురే సమాధి - కా
మాంకుర కర్మపూజ - అడుగడ్డుప్రదక్షిణ - పల్కులే నుతుల్
కింకరు డాచరించు ప్రతికృత్యము నీపద పంకజార్చనే! 1

10 సూ. అన్యాశ్రయాణాం త్యాగోఽనన్యతా

ఇతర ఆశ్రయాలు త్యజించటం అనన్యత.

భక్తుడు తనహృదయంలో ఇష్టదైవాన్నితప్ప మరొక మూర్తిని నిల్పలేడు అన్యదైవ భావాన్ని ఊహామాత్రంగా కూడ సహించలేడు. అతనికి సర్వథా సర్వదా దైవం అనే ఆత్మ జ్యోతి దర్శనం ఇస్తుంది. అది విశ్వవిరాట్ స్వరూపం. భక్తుడు విశ్వాన్ని విష్ణు దేవుని దేహంగా భావిస్తాడు. అన్యం అవలోకించటానికి అవకాశమే ఉండదు అతనికి. అనన్య భక్తుడు ఇలా ప్రార్థిస్తాడు.

---

1. శాంతిశ్రీ "ఆనందలహరి" సప్తగిరి జనవరి 1881

లావొక్కింతయులేదు ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులున్
ఠావుల్ తప్పెను మూర్ఛవచ్చె తనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడున్
నీవేతప్ప ఇతః పరంబెరుగ మన్నింపన్ దగున్ దీనునిన్
రావే! ఈశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా! 1

నీవే తప్ప నాకు దిక్కులేదు అని శరణాగతి పొందాలిభక్తుడు. ఇదే అనన్యత.

భక్తుడు అన్యదైవ ప్రశంసను సైతం వినజాలడు అనటానికి పార్వతీదేవి మన స్తత్వం చక్కని ఉదాహరణ.

పార్వతీదేవి పరమేశ్వరునిగూర్చి తపస్సు చేస్తున్నది. పరమేశ్వరుడే మాయా వటువుగావచ్చి శివపరిహాసం చేయటం మొదలుపెట్టాడు. ఎన్నో ఆశలు ప్రలోభాలు చూపాడు.

"ఓ తరళాయతాక్షీ !నీవు పరమేశ్వరుని పాణిగ్రహణ మొనర్చు వేళ ఆస్వామి సర్ప కంకణముల ఘూత్కారములకు నీవెట్లు తాళగలవో గదా. రాయంచలద్దిన నీపట్టుచీరకు శివుని పచ్చి ఏనుగు తోలుకును జత ఎలా కుదురుతుంది? హరిచందన సువాసితమగు నీ వక్షస్థలంపై ఈశ్వరుని భస్మరాగమలంకరింపబడుతుంది కాబోలు. అరుణరాగ రంజితమై లాక్షారాగ శోభితమగు నీ పదములు ఇక రుద్రభూమిలో సంచరించాలి కాబోలు. మనోహరమైన నీ ముత్యాల హారాలు సర్పహారాలతో చెలిమి చేస్తాయా! రాజకుమార్తెవైన నీవిక ముసలి ఎద్దుపై చరింప సంసిద్ధురాలవేనా?"

1. ఆంధ్రమహా భాగవతం అష్టమ 90

ఏనునుబ్రహ్మచారి దరళేక్షణ! నీవును కన్య-వెంతకా
లానకు నీకు బెండ్లియఫలంబగునేని విచారమేల! స
న్మానము తోడ నన్ను మునిమాన్యవివాహము గమ్ము లెమ్ము కా
దేని దపంబులోసి సగమిచ్చెద మాను తపోభిమానమున్ 1

ఉత్తములను నిందించటమేకాదు నింద వినటంకూడ పాపకారణం అని శివదూషణ చేయసాగిన వటువును దూరంగా పంపివేయమని అంటుంది పార్వతీదేవి.

11 సూ. లోకే వేదేషు తదనుకూలాచరణం
తద్విరోధి షూ దాసీనతా

భక్తుడు లోకాచారాలు వేద ధర్మాలు మొదలైనవాటిపై అపేక్షను, భగవద్భక్తికి వ్యతిరిక్త విషయాలపై ఉపేక్షను చూపాలి.

భక్తుడు తన్మయ స్థితిని పొందకుండానే ఆ ఉత్తమ స్థితి పొందినట్లుగా భావించుకొని కర్తవ్యాలు మరవటం కూడదని నారద మహర్షి ఇలావివరిస్తాడు-

భక్తునికి అన్నీ భజించేవే. అంతేకాని విభజించేవి లేవు. భక్తుడు అనన్య భావంతో భగవద్విశ్వాసం కలిగి సద్విధులు ఆచరిస్తూ ఉండాలి. ఆతడు భక్తికి తగని కార్యాలు చేయలేడు. ఆ కర్మలే అతనిని తప్పుకుపోతాయి.

తల్లి దండ్రులను గౌరవించుము. భర్తను పూజింపుము. గురువును సేవించుము. ఈ మొదలైనవి వేద ధర్మాలు. అవే లోకధర్మాలు. ఒకవేళ తల్లిదండ్రులు, పతి, గురువు, బంధువులు, భగవద్భక్తికి విరుద్ధ

1. శ్రీనాథుడు హరవిలాసం చతుర్థాశ్వాసం.

స్వభావులైతే వారి ఆజ్ఞలు ధిక్కరించి బాధలు భరించి అయినా, భక్తి ప్రేరకాల్ని మాత్రమే ఆచరిస్తాడు భక్తుడు. అతడు భగవద్భక్తికి వ్యతిరేకంగా ఏ పని చేయలేడు.

"కాముడంటే ఇష్టంలేనివారు ఆప్తబంధువులైతే వారిని బద్ధ శత్రువులుగా తలంచి వదలివేయాలి. ప్రహ్లాదుడు తండ్రిని, విభీషణుడు అన్నను, బలిగురువును, గోపికలు భర్తలను వదలలేదా! వారిని ఆదర్శంగా తీసుకోవాలి" అన్నాడు మహాకవి తులసీదాసు.

నిత్య, నైమిత్తిక, కామ్య, నిషిద్ధాలు అని కర్మలు నాల్గు విధాలు. వీటిలో మొదటి రెంటిని ఫలాపేక్ష లేకుండా భగవత్ ప్రీత్యర్థం చేస్తూ ఉండాలి. భగవత్ ప్రీతికోసం చేసే ప్రతికృత్యం భక్తిని ప్రవృద్ధం చేసేదే.

గీతానుసారం ఫలాసక్తి, ఫలాపేక్ష విడిచి మనసార భగవంతునికి అనుకూల కార్యాలు చేయటం భక్తుని విధి. "కామ్యానాం కర్మణా న్యాసం" అన్నారు. కావున అభీష్ట సిద్ధికి చేసే "కామ్య కర్మలు" త్యాజ్యాలు, ఇక మద్య - మాంస - సేవనం, జారచౌర్యాదులు అన్ని వర్గాల వారికి కూడనివి. అవి "నిషిద్ధాలు".

12 సూ. భవతు నిశ్చయ దార్ఢ్యా దూర్ధ్వం
శాస్త్ర రక్షణమ్

భక్తి దృఢ పడిన తర్వాతకూడ శాస్త్ర విధులు పాటించాలి.

"భక్తుడు బాహ్యావిస్మృతి పొందేవరకు శాస్త్రవిధులు తప్పక పాటించాలి" అని - భక్తిరసామృతం ఉద్ఘోషిస్తున్నది. పరిపూర్ణ భక్తి కుదిరితే శాస్త్రవిధులు అనుసరించే అగత్యం లేదని అభిమతం.

"భక్తి యొక్క ప్రథమ దశలో ఆత్మాభివృద్ధి లభ్యంకానిదే విగ్రహారాధన విడువరాదు, అంతవరకు ఆత్మ దర్శనానికి మాధ్యమిక వస్తువు అవసరం, అర్చనా విధానం నిరాకరించటం వలన అహంకారం వస్తుంద"ని కొందరు మహాత్ముల విశ్వాసం.

భక్తుడు తనలో దైవాన్ని ప్రేమించే శక్తి ఎంత పరిపక్వ స్థితికి చేరుకుందో పరిశీలించుకుంటూండాలి. భక్తి యోగంలో ప్రేమించు గుణమే కొలబద్ద. అదే ఐహిక బంధం పోగొట్టి ఆ ముష్మిక సిద్ధిని ప్రసాదిస్తుంది.

అనన్య భక్తితన్మయత్వం ఒక సిద్ధ లక్షణం. అది చేకూరినపుడు లౌకిక వైదిక కర్మలు ప్రాపంచిక శాస్త్రవిధులు అన్నీ వాటంతట అవే విడిపోతాయి. కనుక భక్తి పరాకాష్ఠ చెందాలి. అలాకాక భక్తునకు ప్రపంచ విస్మృతి కలిగీ కలగకుండానే " ఇక తాను పండిపోయాను " అనుకొని శాస్త్రవిధులు మానివేస్తే ఫలితం హాస్యాస్పదమే. శాస్త్ర సమ్మతమైన పూజాదులచే పరమ పవిత్ర భక్తి పొందవచ్చు.

గీతాకారుడు ఇదే అంటాడు - నీవేమిచేయాలో, ఏమి చేయరాదో శాస్త్రమే ప్రమాణం.

కావున మనిషి సంశయావస్థలో ఉన్నపుడు కర్తవ్యాకర్తవ్యాలను శాస్త్రం విధిస్తుంది. దానిని మనిషి పాటించాలి. శ్రీ శంకర భగవత్పాదులు ఇలా బోధించాడు -

వేదో నిత్యమధీయతాం తదుదితం కర్మ స్వనుష్ఠీయతాం
తే నేశస్య విధీయతామపచితిః కామ్యే మతి స్త్యజ్యతాం
పాపీఘః పరిధూయతాం భవసుఖే దోషానుసంధీయతాం
ఆత్మేచ్ఛా వ్యవసీయతాం నిజగృహాత్తూర్ణం వినిర్గమ్యతాం 1

---

1. సాధనా పంచకం

13 సూ. అన్యథా పాతిత్యా శంకయా

శాస్త్ర ప్రమాణం కాదని ప్రవర్తిస్తే భక్తుడు పతనం చెందే ప్రమాదం ఉండవచ్చు.

భక్తిలో పూర్ణ సమాధి స్థితి పొందకుండానే వైదిక కృత్యాలు, శాస్త్ర విధులు విడిచినట్లైతే వాడు పతనం చెందుతాడు. సదాచార విరుద్ధంగా అమర్యాదగా ప్రవర్తించేవాడూ, భక్తి పేరు చెప్పుకొని జనులను మోసగిస్తూ ఆత్మద్రోహం చేసుకొనేవాడూ, పుణ్యాత్ముడు కావటం అసంభవం. అట్టి మూర్ఖుడు పతనమవుతాడు.

శాస్త్ర విధిని కాదనే స్వేచ్ఛాచారుడు సిద్ధి పొందలేడు, సద్గతి పొందలేడు, వానికి ముక్తి లభించదు. తెలిసి తెలిసి శాస్త్ర మర్యాదలు ధిక్కరించటం భక్తి తత్త్వం కాదు. అది మోహం, అహంకారం, అది విశృంఖలత. విచ్చల విడి కది మారుపేరు. అట్టివాడు క్రూరమైన నీచ జన్మలు పొందుతాడు.

భగవత్ భక్తికి సర్వసమర్పణ అవసరం. కనుక అట్టి త్యాగానికి శాస్త్రవిధులు ఆటంకాలైతే వదలివేయవచ్చు, కానీ సోమరియై శాస్త్ర నియమాలు విడువరాదు.

'శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్' ధర్మసాధనకు శరీరం నిల్పుకోవాలి. కనుక చాలా జాగ్రత్తగ ఆలోచించి నడుచుకోవాలి. అందుకనే బ్రహ్మచర్యాది నియమాలను శాస్త్రం విధిస్తున్నది. ఈ నియమపాలనంతో శరీరం, మనస్సు ఆరోగ్యంగా ఉంటాయి.

అందుకనే చిన్నతనంలో చదువు, యవ్వనంలో గృహస్థ జీవనం, వార్ధక్యంలో మునివృత్తి, అవలంభించండి అన్నాడు కాళిదాసు -

శైశవే భ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణాం
వార్ధకే మునివృత్తీనాం యోగేనాంతే తనుత్యజామ్ 1

1. కాళిదాసు రఘువంశము

సజ్జనులు ఇలాంటి సదాచారాలు తప్పక పాటించాలి. గౌతముడు అన్నాడు - ఆచారంవలన ధర్మం ధనం సౌఖ్యం చివరకు మోక్షం ప్రాప్తిస్తాయి - అని.

"ఆచారాల్లభతే ధర్మ మాచారాల్లభతే ధనం
ఆచారా ల్లభతే సౌఖ్యం మాచారన్మోక్ష మశ్నుతే" 1

14 సూ. లోకోఽపి తావదేవ కింతు
భోజనాది వ్యాపారస్త్వా శరీర ధారణావధి

లౌకిక వైదిక కర్మకాండ భక్తియొక్క తన్మయస్థితి పొందేవరకు చేసి తరువాత, భోజనాది నిత్యకృత్యాలు శరీరం ఉన్నంతవరకూ చేస్తూ ఉండాలి.

లౌకిక కార్యాలైన ఆశ్రమ ధర్మాలు భగవదర్పిత బుద్ధితో, నియమ నిష్ఠలతో చేసుకుంటూ ఉండాలి. బాహ్య విస్మృతి, తన్మయత అనేది భక్తియొక్క భూమికలతో అత్యంత ఉన్నతస్థితి. ఆ దశలో వేదధర్మాలు, లోక ధర్మాలు, కట్టుబాట్లు వాటంతట అవే విడిపోతాయి. ఆ స్థితి అందుకొనే వరకు సమస్త కర్తవ్యాలు నిర్వహిస్తూండాలి.

ధర్మరక్షణకు శరీరం ముఖ్యం కాన శరీర రక్షణకు ఆహారం అవసరంగా తీసుకోవాలి. అయితే ఉన్మత్తుడైన భక్తుడు ఆహార సంపాదనకు తాను ప్రయత్నించడు. అయినను భగవంతుడు ఏదో రూపంలో ఆ భక్తునికి ఆహారం అందించి వాని యోగక్షేమాలు చూస్తుంటాడు, భక్తుడు ఆ ప్రాప్తించిన దానిని మహాప్రసాదంగా భావించి శరీరధారణకు తగినంత మాత్రమే స్వీకరిస్తాడు.

---

1. గౌతమ ధర్మసూత్రములు

బాహ్యస్మృతి లేని తన్మయత అంటే భావసమాధి మాత్రం కాదు. అది భగవంతుని దర్శన స్థితి. అపుడు భక్తుడు భగవంతుని తప్ప అన్యంఎరగడు. ఆ దశ విధి నిషేధాలకు అతీతం. అది అమృత స్వరూప స్థితి. అంటే సంఘ నియమాలు, శాస్త్రవిధులు భక్తి దృఢ పడేవరకు మాత్రమే అని అర్థం.

వేదాంత విషయ మననం వలన దైవిక చైతన్యం వృద్ధి అవుతుంది. ఆ చైతన్యం వలన శాస్త్ర మర్యాదలు గ్రహించే శక్తివస్తుంది, ఆలోచనకు సదసద్వివేకజ్ఞానం లభిస్తుంది. అది గ్రహించినపుడే పవిత్ర దివ్యజీవనంలో నడుచుకునే అవకాశం కల్గుతుంది. అపుడే ఈశ్వర సందర్శనానికి యోగ్యత లభ్యమానమవుతుంది. అట్టి యోగ్యత కల్గిన తర్వాత శాస్త్ర విధులు వదలినా ఫరవాలేదు. మేడకట్టుకున్నతర్వాత కర్రలతో కట్టిన మూసలతో అవసం లేదుకదా!

అయితే శరీరం ఉన్నంత వరకు ఆహారం మాత్రం తీసుకోవాలి శరీరం ధర్మసాధనకు మూలం అని కదా తెలుసుకున్నాము.

భక్తుడు తనస్థితికి తగినట్లు సాత్విక ఆహారం గ్రహిస్తూ ఉండాలే కానీ, ఆహారాన్ని పూర్తిగా పరిత్యజించరాదు. శరీరానికి వ్యాధికూర్చే అధిక ఆహారం కానీ, అల్ప ఆహారంకానీ, జీర్ణంకాని ఆహారం కానీ స్వీకరించరాదు. నియమానుసారంగా యుక్తమైన ఆహారం కూటిలో జీవి ఉన్నంతవరకు తీసుకోవాలి. అయితే "ఆహారశుద్ధౌ సత్వశుద్ధిఃసత్వ శుద్ధౌ ధృవాస్మృతిః" ఆహారంలో దోషంలేకుంటే చిత్తం శుద్ధంగా ఉంటుంది. చిత్తం శుద్ధంగా ఉంటే నిశ్చలమైన భక్తి కలుగుతుంది. అని శ్రుతి.

"జాత్యాశ్రయ నిమిత్తాదుష్టాదన్నాత్కాయ శుద్ధిః"

శుద్ధమూ నిర్దుష్టమూ అయిన ఆహారం తీసుకోవాలి. ఉల్లి మొదలైనవాటితో కూడినది జాతిదుష్టమైన ఆహారం. కేశకీటకమిశ్రితం నిమిత్త దుష్టమైన ఆహారం. చోరపతితాదులు ఇచ్చినది ఆశ్రయదుష్టమైన ఆహారం. ఈమూడు విధాలైన ఆహారం తీసుకోవద్దు అన్నాడు ద్రమిడాచార్యులు.

ఈ విధమైన నియమ నిష్ఠలతో పవిత్ర జీవనం నడుపుతూండాలి. మనస్సును మాధవునిపై లగ్నం చేయాలి. నియమవ్రతుడనని దేవుని నిర్లక్ష్యం చేస్తే గతిలేదు. భక్తుని ఉన్నతికి నిశ్చలమైన విష్ణుభక్తిమూలం.

సంసార జీమూత సంఘంబు విచ్చునే
చక్రి దాస్య ప్రభంజనము లేక
తాపత్రయాభీల దావాగ్ను లారునే
విష్ణు సేవామృత వృష్టిలేక
సర్వంకషా ఘౌఘ జలరాసు లింకునే
హరి మనీషా బడ బాగ్నిలేక
ఘనవిపద్గాంధ కారంబు లడగునే
పద్మాక్షునుతి రవిప్రభలులేక
నిరుపమాపునరావృత్తి నిమ్న-శంక
ముక్తినిధి గానవచ్చునే ముఖ్యమైన
శార్జ్గకోదండ చింతనాంజనములేక
తామరస గర్భునకునైన తాపసేంద్ర! 1

—0—

1. పోతన భాగవతం సప్తమ స్కంధం

# లక్షణావళి

15 సూ. తల్లక్షణాని వాచ్యన్తే నానా మత భేదాత్

మహాత్ములు భక్తి తత్త్వం తెలుసుకున్నారు. వారి ఉపాసనా పద్ధతులు విశ్వాసాలు అభిప్రాయాలు అనేకం. వారు భక్తి లక్షణాలను తమ తమ దృక్పథాలనుబట్టి వివిధ విధాలుగా వివరించారు.

ఒక్కొక్క మహా భక్తుని అనుభవం ఒక్కొక్క విధంగా ఉంటుంది. వారు తమ అనుభూతినిబట్టి భక్తి అంటే ఇది - ఇలా ఉంటే భగవద్దర్శనం లభిస్తుంది-అని నిర్ణయించారు. వారు ఆ విధంగా కైవల్యం పొందారు.

భక్తి తత్త్వం గూర్చి భక్తి లక్షణాలనుగూర్చి చాలామంది మహర్షులు ఎన్నో సంవత్సరాలు తపస్సు చేసి అనుభవజ్ఞానంతో వివరించారు. భక్తి సగుణ నిర్గుణ ఉపాసనా పద్ధతులలో శాఖోపశాఖలుగా విస్తరించి ఉంది.

అది సగుణ ధ్యానమనన్
సదమలగుణ! వినుము నిర్గుణధ్యానమనన్
విదితముగ నిరు తెరంగులు
మొదలిటియది సేయ నితరమునులభించున్ 1

---

1. పింగళి సూరన కళాపూర్ణోదయము పంచమ 179

16 సూ. పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః

భగవంతుని పూజాదులు అనురాగంతో ఆసక్తితో చేయటమే భక్తి అని వ్యాసమహర్షి అభిమతం.

విష్ణుపూజ మూడురకాలు - వైదికం, తాంత్రికం, మిశ్రమం. ఇందులో మళ్ళీ బాహ్యపూజ మానసికపూజ అని రెండు విధాలు. దీనినే సగుణారాధన నిర్గుణారాధన అనీ సాకార నిరాకార ఆరాధనలనీ అంటారు.

సగుణారాధనను మూర్తిపూజ అనీ, విగ్రహారాధన అని కూడా అంటాడు

ఇందుభక్తులు దారులోహ శిలా నిర్మిత సుందర తమమైన విగ్రహాలను శ్రీచక్రాది యంత్రాలపై ప్రతిష్ఠించుకొని అర్చిస్తారు. ఆప్రతిమలను సజీవమూర్తులుగా భావనచేసి నవవిధ భక్తి పద్ధతులతోనే కాక మధుర వాత్సల్య భక్తులతో కూడ పూజిస్తారు.

హేమధన్వుడు సతీసమేతంగా చంద్రశేఖర పూజ గావించిన విధం ఇది -

చంద్రకాంతోపలస్వచ్ఛ వేదీస్థలుల్
కట్టు జవ్వాజితో కలియనలికి
అనువుగా క్రొత్తకట్టాణిముత్తియముల
నిగ్గులు వెదచల్ల ముగ్గువెట్టి
అర్ఘ్యోదకంబుల నభిషేకమొనరించి
రమణీయ రత్న పీఠముననిచి
మృగమద పంకంబు మేననిండ నలంది
మేలేర్చి క్రొవ్విరుల్ గీలు కొలిపి

ధూప మర్పించి కర్పూర దీప మొసగి
అమృత దివ్యాన్న రుచిరోపహారమిచ్చి
వనితయునుదాను సాష్టాంగ వినతి జేసి
చంద్రిధరుగొల్చు నారాజచంద్రు డెప్పుడు 1

అలికి ముగ్గుపెట్టి ఆ పవిత్రి పీఠంపై మూర్తిని నెలకొల్పాలి. అర్ఘ్యపాద్యాలిచ్చి షోడశోపచారాలలో పూజించాలి. మనస్సులో చక్కని భావన చేయాలి

ఈ అర్చనలో రెండు విధానాలున్నాయి. ఒకటి అమూర్తార్చనం, రెండోది సమూర్తార్చనం. అగ్నిలో హవ్యాదులు ఆహుతి చేయటం అమూర్తార్చన - ప్రతిమాద్యర్చనం సమూర్తార్చనం - అని అత్రి సంహిత వచించింది.

"అబ్రహ్మణి బ్రహ్మదృష్ట్యనుసంధానమ్" 2

ప్రతిమారాధనం అనగా బ్రహ్మం కాని దానిని బ్రహ్మంగా భావించి భక్తితో దానిపై మనసును లగ్నం చేయటం.

"సుస్థిర చిత్తంతో నీపాదాలను ప్రోక్షించి గరికపూజ చేసినా భక్తుడు ఉత్తమగతి పొందుతాడు." అని బ్రహ్మ వామనునితో పలికాడు. ఈ భక్తి ప్రపత్తితో మూర్తి పూజ చేస్తూనే ఆ స్వామిని నిర్వికారుడు నిరాకారుడు విశ్వాత్ముడు విశ్వమయుడు అని భావనచేస్తారు భారతీయులు.

---

1. మల్లన రాజశేఖర చరిత్రము ప్రథమ
2. రామానుజాచార్య బ్రహ్మసూత్ర భాష్యం

దేహో దేవాలయః ప్రోక్తో
జీవో దేవ స్సనాతనః
త్యజే దజ్ఞాన నిర్మాల్యం
సోఽహం భావేన పూజయేత్ 1

దేహమే దేవాలయంగా, జీవుడే దేవుడుగా, అజ్ఞానమేనిర్మాల్యంగా, ఆ పరమేశ్వరుడే తానుగా భావన చేసి పూజచేస్తాడు భక్తుడు. ఇలా క్రమంగా సగుణారాధన అనే విగ్రహారాధన మానసికపూజకూ లేక నిర్గుణారాధనకూ దారి తీస్తుంది.

నిర్గుణారాధన లేక ఈ మానసిక పూజలో పుష్పాలు ఇలా సమర్పించాడు ఒక భక్తుడు :-

అహింసా ప్రథమం పుష్పం - పుష్పమింద్రియనిగ్రహం
సర్వభూత దయాపుష్పం - క్షమాపుష్పం విశిష్యతే
శమః పుష్పం - తపః పుష్పం - ధ్యానంపుష్పం తథైవచ
సత్యం చై వాష్టమం పుష్పం ఏతై స్తుష్యతి కేశవః 2

అహింస-ఇంద్రియనిగ్రహం-భూతదయ-క్షమ-శమం-తపం-ధ్యానం-సత్యం అనే అష్ట గుణాలను పుష్పాలుగా అర్చనచేశాడు ఈ మానసిక భక్తుడు

జీవాత్మ తనలోని సుగుణాలనే పుష్పాలుగా భావించి పరమాత్మను అర్చించటం మానసవికాసానికి ఆత్మోన్నతికి ఎంతగానో తోడ్పడుతుంది. మార్గంసుగమం చేస్తుంది.

---

1 శ్రీ ఆమంచి వీరరాఘవయ్య స్మార్త అర్చనా విధానమ్

2. విష్ణుపురాణభాష్యం శ్లోకం 69

ఒక భక్తుడు పరాత్పరునికి అంజలి ఘటించి మానసిక పూజ గావించిన విధం విశిష్టం -

కూర్చుండ మాయింట కుర్చీలు లేవు - నా
ప్రణయాంక మే సిద్ధ పరచ నుంటి
పాద్యమ్మునిడ మాకు పన్నీరు లేదు - నా
కన్నీళ్ళతో కాళ్ళు కడుగ నుంటి

పూజకై మావీట పుష్పాలు లేవు - నా
ప్రేమాంజలులె సమర్పింపనుంటి
నైవేద్య మిడమాకు నారికేళము లేదు
హృదయమే చేతి కందీయనుంటి

లోటు రానీయ కున్నంత లోనసీకు
రమ్ము దయసేయు మాత్మ పీఠమ్ము పైకి
అమృత ఝరి చిందు నీ పదాంకములయందు
కోటి స్వర్గాలు మొలిపించు కొనుచుతండ్రి 1

అని ఆ జగదీశ్వరునికి తన ఒడినే ఆసనంగా కన్నీళ్ళే పాద్యంగా ప్రేమలనే అంజలులే పూలుగా హృదయమే నారికేళంగా అర్పించ సంసిద్ధుడై ఆ స్వామిని ఆత్మపీఠంపైకి రమ్మనమని ఆహ్వానించాడు భక్తుడు.

ఏ విధంగా పూజించినా పరమాత్మ పరమ పదం ప్రసాదిస్తాడు.

శ్రీవిష్ణో రర్చనం యేతు ప్రకుర్వంతి నరాభువి
తేయాంతి శాశ్వతం విష్ణోరానందం పరమంపదమ్ 2

× × × ×

1. "కరుణశ్రీ" ఉదయశ్రీ ప్రథమ
2. విష్ణుపురాణ రహస్యం

17 సూ. కథా దిష్వితి గర్గః

భగవంతుని కథాదుల యందు ఆసక్తిచూపి ఆలకించటమే భక్తి అని గర్గ మహర్షి అభిప్రాయం.

భగవంతుని దివ్యలీలలూ మహిమలే కాక భక్తుల జీవిత గాథలు కూడ భగవత్కథలుగ పరిగణింపబడినాయి. ఈ కథలు శ్రవణం చేయటం-మననం చేయటం- కీర్తనం చేయటం- స్మరణం చేయటం- ఆసక్తితో ఆలాపించటం భక్తి లక్షణం అని గర్గ మహర్షి ప్రవచించాడు. గర్గ ముని 'సంహిత' రచించాడు ఆ మహాజ్ఞాని కథాశ్రవణానికి మిక్కిలి ప్రాధాన్యం ఇచ్చాడు.

శ్రీమహావిష్ణు స్మరణం- కీర్తనం- శ్రవణం చేస్తున్నవారు కథలు వివరించేవారు ఆసక్తితో ఆలకించేవారూ అందరూ మహాభక్తులే.

భాగవతంలో నారదమహర్షి వ్యాసునితో అన్నాడు కదా - "విష్ణుదేవుని గుణకీర్తన శ్రవణమే తపస్సు. అదే అధ్యయనం. యజ్ఞ మంత్ర జ్ఞానాదులవల్ల లభించేఫలం ఇదే ప్రసాదిస్తుందిసుమా!" అని. మహాతత్త్వ వేత్తలు తెల్పిన సారాంశం ఇది.

రామ కథా సుందర కరతారీ సంసయ విహాగ ఉడావని హారీ
భవసాగర యహ పార జోప వా రామకథా తా కహాం దృఢనావా 3

అని హరికథలో ఆసక్తికలుగుటే భక్తి. ఈ భక్తితో పరమపదం లభిస్తుంది అంటాడు మహాకవి తులసీదాసు.

హరికథలు వినెడివారికి
మరణాగత మోహ సంభ్రమములేదనఘా 1

---

1. ఆంధ్రమహాభాగవతము ప్రథమ 439.

భూషణములు చెవులకు బుధ
తోషణములనేక జన్మ దురిత ఓఘవిని
శ్శోషణములు మంగళతర
ఘోషణములు గరుడగమన గుణ భాషణముల్ 1

అని అనేక మంది మహా భక్తులు శ్రవణ భక్తికి మిక్కిలి ప్రాధాన్యం ఇచ్చారు. పరీక్షిన్మహారాజు శుకమహర్షితో కథాశ్రవణా సక్తిని ఇలా వచించాడు -

కల్యాణాత్మకమైన విష్ణుకథలా కర్ణించుచున్ ముక్తవై
కల్యుండెవ్వడు తృప్తుడా - అవి వినంగా శ్రోత్రతాచుండు-సా
కల్యంబేర్పడ భూసురోత్తమ! ఎరుంగం పల్కవే! రుక్మిణీ
కళ్యాణంబువినంగ నాకుమదిలో కౌతూహలం బయ్యెడిన్ 2

18 సూ. ఆత్మరత్యవిరోధేనేతి శాండిల్యః

ఆత్మరతికి అవిరోధమైన విషయాలపై అనురాగమే భక్తి అని శాండిల్య మహర్షి అభిమతం.

రతి అంటే అవిచ్ఛిన్నమైన భగవత్ ప్రీతి అని శ్రీధర వ్యాఖ్యానం. అవిచ్ఛిన్నంగా శుద్ధ ఆత్మస్వరూపంలో రతుడై ఉండటమే ఆత్మరతి. ఆత్మరతిలో నిరతం నిత్యుడై ఉండటమే భక్తి అని అవ్యక్తోపాసకులు భావించారు.

నిర్గుణోపాసకులలో అగ్రగణ్యుడు శాండిల్యుడు. అందువల్ల ఆయన ఆత్మజ్ఞాన విధానంలో భక్తిని అన్వయించాడు. శంకర భగవత్పాదులు ఇలా అన్నారు-

1, 2 ఆంధ్రమహాభాగవతం దశమ 1683, 1682.

సగుణమనంగనీవు విను - శంఖ సుదర్శన ముఖ్య చిహ్నాంతం
బగు పురుషోత్తమాకృతి - తదన్యము నిర్మల నిత్య చిన్మయం
బగు పరమాత్మరూప - మది యబ్బుట దుర్లభ మెట్టివారికిన్
సగుణవిలాస చింతనము సల్పగ సల్పగ గాని-భూసురా! 1

19 సూ. నారదస్తు తదర్పితాఖిలాచారతా
తద్విస్మరణే పరమ వ్యాకుల తేతి

నారాయణునికి సర్వసమర్పణ చేయటం - విష్ణుదేవుని గూర్చి విస్మరణ కలిగితే పరమ వ్యాకులత పొందటం భక్తి అని నారద మహర్షి అభిప్రాయం.

వ్యాస గర్గ శాండిల్యాదులు భక్తి దృఢపడటానికి లక్షణాలు చెప్పి-ని అకళంకమైన భక్తి తత్త్వాన్ని వెల్లడించారు.

భగవంతుని పూజనం, దైవ కథాదుల శ్రవణం, ఆత్మరతి యందా సక్తి, అవరం అనీ, అన్నిటికంటె ఆత్మనివేదనం, విష్ణుస్మరణం ముఖ్యం అనీ నారద మహర్షి పరమభక్తిలోని సగుణ నిర్గుణారాధనలలోని సారాంశం తేల్చి చెప్పాడు.

వ్యాసమహర్షికి విష్ణుసేవా ప్రాశస్త్యం వివరించి ఆయనను శ్రీమద్భాగవతం రచించమని పేరేపించినది నారద మహర్షియే. ఆనారద మహర్షి అన్ని విధానాలను సమన్వయ పరుస్తూ ఆత్మనివేదన ముఖ్యమని సర్వాంగ సంపూర్ణమైన భక్తి తత్త్వం నిర్దేశించాడు. పరమాత్ముని సందర్శనానికి పరమ వ్యాకులత పడటమే భక్తి లక్షణం.

శ్రీ రామకృష్ణ పరమహంస కాళీమాతృ సందర్శనం కోసం కన్నీరు మున్నీరుగా విలపించటం, పరితపించటం, పరమవ్యాకులత పొందటం సర్వవిదితమే.

---

1. పోతన భాగవత దశమస్కంధం పంచమ 180

"అర్జునా! తపస్వికంటె శాస్త్రవేత్తకంటె కర్మిష్ఠికంటె యోగి సర్వ శ్రేష్టుడు. నీవు యోగమూని యోగివికమ్ము. అన్ని యోగాలలో భక్తి యోగం సర్వశ్రేష్ఠం - సర్వసులభం. కనుక భక్తియోగం అవలంబించు. త్రికరణ శుద్ధిగా నన్ను భజించు" 1

"సర్వదా అవిరామంగా నా నామస్మరణం చేయి. మనస్సులో నన్ను నిల్పి ఫలాపేక్ష వదలి నాకోసం యుద్ధం చేయి. నీ మనస్సును నాకు అర్పించు. ఆత్మనివేదనమయిన తరువాత భక్తునికి బాధ్యత ఏమీ ఉండదు." 2

"మానావమానాలు లాభనష్టాలు జయాపజయాలు సుఖదుఃఖాలు నీవేమీ కావు: అవి అన్నీనావి. అన్నీ చూచుకోవలసింది నేను. నీవు నిమిత్తమాత్రుడివి. అది మరవవద్దు" అని కృష్ణ భగవానుడు ఉపదేశించాడు. 3

కనుక భక్తుడు ఫలితం దైవార్పణంచేసి అహంకార మమకార రహితంగా పరమాత్మను ధ్యానంచేయాలి. శరణాగతి కోరి అవ్యయానందుని అత్యంత శ్రద్ధతో నిరంతరం మననంచేయాలి. నిత్యం నీరజాక్షుని పరిచర్యలో నిమగ్నమై ఉండాలి. "లోకాస్సమస్తా సుఖినో భవంతు" అంటూ లోకక్షేమంకోసం దృఢ దీక్షతో ప్రవర్తన సాగించాలి

ఏ కారణం చేతనైనా విచలిత మనస్కుడవైతే, చింతనలో లోపం కలిగినందులకు నీళ్ళలోనుంచి బైటపడిన చేపవలె విలవిలలాడి పోవాలి. ఇదీ భక్తుని లక్షణ. ఇది సర్వోత్తమ పరమభక్తి.

ఇలాంటి ఉత్తమ భక్తుడు త్రైలోక్య లక్ష్మివచ్చి వరించినా, సాక్షాత్తు మోక్షలక్ష్మి కౌలిగించుకున్నా, ఏ పరిస్థితులలోనూ విష్ణు నామశ్రవణ స్మరణకీర్తనాదులను విడిచిపెట్టడు.

---

1 భగవద్గీత 6-46

2. భగవద్గీత 6-47

3. భగవద్గీత 8-7

"ఓ ఉద్ధవా! వాణీశ పార్వతీశాదులకంటే సహోదరులైన బలరామాదుల కంటె అర్ధాంగి లక్ష్మీదేవికంటె ఉత్తమ భక్తుడు నాకు ఇష్టుడు. ఏ వస్తువూ అపేక్షింపక ఏకోరికాలేకుండా శాంత చిత్తుడైన అజాత శత్రువు అంటే నాకు మరీ ఇష్టం. సర్వసమ భావంతో సర్వజీవులలో జడపదార్థాలలో కూడ నన్ను దర్శించే స్మరించే భక్తుని పాదధూళి నాకు ప్రియమైన వస్తువు." అని భక్తి తత్త్వాన్ని కృష్ణ దేవుడు ఉపదేశించాడు. 1

లోకిక మొల్లక నన్నా
లోకించు ప్రపన్నులకును లోబడి కరుణా
లోకనముల పోషింతును
నాకాశ్రిత రక్షణములు నైసర్గికముల్ 2

భక్తుడు అన్ని చరాచరాలలోను పరమాత్మను దర్శించాలి. అన్నింటిని పరమాత్మ భావంతో సేవించాలి. అపుడు భక్తుడు అవ్యయానంద పరమసుఖం పొందుతాడు. ఆ సుఖంలోని అతి రుచికరమైన స్వాదు రసం అన్యులెరుగరు.

భక్తులు పరమేశ్వర సాక్షాత్కారంకై పరితపించాలి అనేదే నారదుడు చెప్పిన భక్తి మార్గం.

బ్రహ్మదేవుడు నారదునికి తెలిపిన శ్రీమహావిష్ణువు విరాట్ స్వరూప వర్ణనమిది-

1. ఆంధ్ర మహాభాగవతం ఏకాదశ 14, 15, 16

2. ఆంధ్రమహాభాగవతము దశమ 1435.

బహు పాదోరు భుజానన నేత్రణ శిరః ఫాల శ్రవో యుక్తుడై
విహరించున్ బహు దేహి దేహగతుడై-విద్వాంసులూహించి త
ద్బహు రూపావయవంబులన్ భువనసంపత్తిన్ విచారింతు రా
మహనీయాద్భుతమూర్తి యోగిజన హృన్మాన్యుండు మేధానిధీ! 1

20 సూ. అస్త్యేవ మేవమ్

ఇదే నిజమైన భక్తి !

పరమభక్తి కొరకు వ్యాకులత పొందుటే నిజమైన సాధనా భక్తి. భక్తి సూక్ష్మతరమే కాక స్థూలతమంకూడ. దీని స్వరూప స్వభావాలు సువిశాలములు.

ప్రేమవల్ల శ్రద్ధ, శ్రద్ధ వలన జ్ఞానం, జ్ఞానం వలన సాధన, సాధన వలన సాధ్య భక్తి లభిస్తుంది. సాధ్య భక్తియే పరమ భక్తి. పరమ భక్తి వలన పరమాత్మ సాక్షాత్కారం సహజంగా లభిస్తుంది.

ప్రహ్లాదుడు విష్ణుదేవుని అన్ని వస్తువులలోనూ దర్శించాడు.

ఇందుగలడందు లేడని
సందేహము లేదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెతకి చూచిన
అందందే గలడు దానవాగ్రణి! వింటే! 2

ఓ రాక్షసరాజా! నామాట విశ్వసించి ఎక్కడ వెతకిచూస్తే శ్రీమహావిష్ణువు అక్కడే కనిపిస్తాడు అని హిరణ్యకశిపునికి ప్రహ్లాదుడు నొక్కి వక్కాణించాడు. స్తంభంలో స్వామిని ప్రత్యక్షపరిచాడు. అట్టి అచంచల విశ్వాసమే భక్తి.

---

1. ఆంధ్రభాగవతం ద్వితీయ 88 2. ఆంధ్రభాగవతం సప్తమ 275.

నోఁచివినంతవట్టు నుసలక నిచ్చుచో!
ఏలకట్టు విష్ణుడేటిమాట ?
కట్టెనేని దానకరుణించివిడుచును
విడువకుండనిమ్ము విమలచరిత ! 1

అని మేరువు తలక్రిందైనా, సముద్రాలు ఇంకి ప్రళయం వచ్చినా, నేను విష్ణుమూర్తికి సర్వం సమర్పించాలిసిందే అని బలిచక్రవర్తి ఆత్మ సమర్పణం చేసుకొన్నాడు.

"ఈ ఆత్మ నివేదనం అంటే - భావాద్వైత క్రియాద్వైతాలు తెలుసుకొని సర్వ కర్మలు భగదర్పణం చేయటం. దీనివలన ద్వైతభ్రమ పోతుంది.

× × × ×

ఉత్తమో బ్రహ్మసద్భావో ధ్యాన భావస్తు మధ్యమ:
స్తుతిర్జపోఽధమో భావో బహిః పూజాధమాధమా! 2

ఆత్మాభ్యుదయ పథంలో బ్రహ్మానుభూతి పొందటం ఉత్తమం. మానసిక ఉపాసన మధ్యమం. బాహ్యపూజ అధమం-అని మహానిర్వాణ తంత్రకారుని అభిమతం.

ఆత్మ జ్ఞానం-ఆత్మ నివేదనం-సర్వసమర్పణం ప్రతి భక్తునికి అవసరమని నారద మహర్షి అభిభాషణం.

21 సూ. యథా వ్రజ గోపికానామ్

భక్తి అనేది గోపికల భక్తివలె ప్రగాఢమై ప్రస్ఫుటించాలి.

పరమ భక్తికి, ప్రేమ స్వరూపమైన నిష్కళంక మధుర భక్తికి వ్రజ గోపాంగనలు ఆదర్శ ప్రాయులు. వారి భక్తి నిశ్చలం, నిర్మలం, నిరుప

---

1. మహాభాగవతం అష్టమ 604
2. మహానిర్వాణ తంత్రం - ఉల్లాసం 4.

మానం, నిరవధికం. ఆ భక్తిని వర్ణించే శక్తి వాణీ, వాణీశ, ఫణీశాదులకుకూడా లేదు. వారు మనం, ధనం, ఇహం, పరం, అన్నీ ఆ గోపాల దేవునకే అర్పించారు. ఆత్మలను అర్పించి అచ్యుతుని ఆరాధించారు. వారు రేబవలు క్షణం క్షణం అవిరామంగా అవిచ్ఛిన్నంగా గావించినది రంగనాథుని చింతనమే. కేశవ కీర్తనమే. వారు ఇతరం ఆలోచించరు. భక్తులైన వారు అంత తీవ్రకాముకతో భగవంతుని ఆరాధించాలి.

మోహన మురళీగానం వినిపించగానే ముగ్ధగోపాంగనలు భవనాలు వదలి వనాలకు పరుగులు పెట్టేవారు. అక్కడ స్వామి కనుమరుగైతే పొద పొదలో ఎద ఎదలో వెతికేవారు. వారికి లౌకిక జ్ఞానం పోయింది. "అవి మాట్లాడతాయా" అని వారు అనుకోలేరు. పువ్వు పువ్వును అడిగారు. చెట్టు చెట్టును ప్రశ్నించారు. మొక్క మొక్కతోనూ మొరపెట్టుకొన్నారు-

నల్లనివాడు-పద్మ నయనమ్ముల వాడు-కృపారసంబు పై
చల్లెడువాడు - మాళి పరిసర్పిత పింఛమువాడు - నవ్వురా
జిల్లెడు మోమువాడొకడు చెల్వల మానధనంబు తెచ్చె-ఓ
మల్లియలార! మీపొదలమాటున లేడు గదమ్మ! చెప్పరే! 1

అని మల్లెపూలను మరిమరీ అడిగారు.

అంగజునైన జూడ హృదయంగముడై కరగించువాడు- శ్రీ
రంగదురంబువాడు-మధురంబగు వేణురవంబువాడు- వ
మ్మంగజు పువ్వుదూపులకు నగ్గముచేసి లవంగ లుంగ నా
రంగములార! మీకడకు రాడు కదా! కృప నున్నజూపరే! 2

మారుమాటాడజాలని ప్రమానుమాకులకు మరీమరీ చెప్పుకొన్నారు-

---

1. 2. ఆంధ్రమహాభాగవతము దశమ 1016. 1011,

మానినీ మన్మధు మాధవు గానరే!
సలలి తోదార వత్సకము లార!
సలలి తోదార వత్సకవైరి గానరే!
సుందరోన్నతలతార్జునము లార!
సుందరోన్నతలతార్జున భంజు గానరే!
ఘనతర లస దశోకంబులార!
ఘనతర లస దశోకస్ఫూర్తిగానరే
నవ్యరుచిర కాంచనంబులార!

నవ్యరుచిర కాంచనకిరీటు గానరే
గహన పదవి కురవకంబులార!
గహనపదవి కురవకనివాసి గానరే !
గణికలార! చారుగణిక లార! 8

ఇలా గోపికలు మాధవునికొరకై ఏ పువ్వునూ విడిచిపెట్టకుండగ అడిగారు. గణికలను చారుగణికలనుకూడ వేడుకొన్నారు. బ్రతిమలాడు కొన్నారు.

ఇలా యమునదీ తీర భూములన్నీ వెతుకుతుంటే దూరదూరంగా తళుకు తళుక్కున కనిపించి కనుమరుగవుతున్నాడు గోపాలదేవుడు. అపుడు గోపికలంటారు ఆశగా_

అదె నంద నందనుం డంతర్హితుండయ్యె
పాటలీ తరులార ! పట్టరమ్మ !
హేలా పతుల "కృష్ణ"! ఏల పాసితి వని
ఐతేయ లతలార! అడుగరమ్మ!

వనజాక్షు డిచటికి వచ్చి దాగడు గదా!
చూతమంజరులార! చూడరమ్మ!
మానినీ మదనుశో మారాక మెరిగించి
మాధవీ లతలార! మనుపరమ్మ!

జాతి సతుల బాయ నీతియే హరి కని
జాతులార! దిశల జాటరమ్మ!
కదళులార! పోయి కదలించి శిఖిపింఛ
జూటు దెచ్చి కరుణ జూపరమ్మ! 1

భగవంతుని అన్వేషణలో భక్తులకు ఇంత వ్యాకులత ఉండాలి.

శ్రీకృష్ణ దేవుడు గోపికల భక్తికి పులకించి ఇలా అన్నాడు- "గోపికలారా! మీరు నాకోరకు సంసార బంధాలు త్రెంచుకొన్నారు. నన్నే నమ్ముకొని నన్నే ప్రాణాధికంగా కొలుస్తున్నారు. మీమనస్సులు మధుపములంటని మల్లియలు. మీ కరములు పరమ శ్రీకరములు. మీ చర్యలు పవిత్ర యోగిజన సంస్తవ్యములు. మీది తపస్సు. మీ ప్రేమ మహస్సును దేవయుగాంతం వరకూ మరువను. దీనికి మూల్యం చెల్లించుకోలేను. మీ ఉదార ప్రేమకు బందీనైనాను. దీనినుంచి ముక్తుణ్ణి కాలేను." ఇలా కృష్ణునిచేతనే స్తుతిపాత్రమైనది వారి భక్తి.

బ్రహ్మసూత్ర సారాంతంలో ఇలా ఉంది.

విముక్త సంగోను భజన్ భక్త్యా
తత్సమతా మగాత్ -

---

1 భాగవతం దశమ 1013

భక్తులు కూడా భగవంతుని వలెనే ప్రవర్తిస్తారు. భాగవతంలో గోపికల రీడలే ఇందుకు ప్రమాణాలు-

పూతన నైమె ఒక్క-పొలతి చరింపంగ
శౌరినైమె ఒకకాంత చన్నుగుడుచు
బాలుడై ఒకభామ పాలకు నేడ్చుచో
బండి నే నను లేమ బారదన్ను
సుడిగాలి నని ఒక్క- సుందరి గొని పోవ
హరి నని నర్తించు అబ్జముఖియు
బకుడనే నని ఒక్క- పడతి సంరంభింప
పద్మాక్షు డను కొమ్మ పరిభవించు
ఎలమి రామకృష్ణు లింతు లిద్దరుగాగ
గోపవత్సగణము కొందరగుదు
రసుర వైరి ననుచు అబల ఒక్క-తె చీరు
పసుల మనెడి సతుల భరతముఖ్య! 1

ఇంతే కాక "తత్త్వమసి," "సోఽహమ్" అనే మహా వాక్యాలకు కూడ భక్తులు ప్రమాణులు.

ఉద్ధవునితో గోపికల భక్తినిగూర్చి కృష్ణ పరమాత్మ ఇలా అన్నాడు-

"ఓ ఉద్ధవా! గోపికలు ఉత్త అమాయికలు. భక్తికి మూలికలు. నా హృదయానికి పలికలు. నిశ్చల నిర్మల ప్రేమ దీపికలు.

ఆ అరవిందనయనలు ఆ అబ్జవదనలు తమ హృదయారవిందాలను నాకెప్పుడో అర్పించారు. నేను వారికి ప్రాణం. వారు శరీరస్మృతి లేకుండా నన్నే ధ్యానిస్తారు. ఆ సమాధ్యవస్థ యోగీశ్వరులకు కూడా అలభ్యం.

1. ఆంధ్ర మహాభాగవతం దశమ 1019.

అంతటా కృష్ణ గానం, కృష్ణ కీర్తన, కృష్ణస్మరణం, కృష్ణ భక్తి, జ్ఞానం బోధిస్తానన్న ఉద్ధవునితో గోపికలిలా అన్నారు.

"ఉద్ధవా! మాకు జ్ఞానం తెలియదు. యోగం తెలియదు. భోగం తెలియదు. శాస్త్రం తెలియదు. వేదం నాదం తెలియదు. మాకు తెలిసిందల్లా కృష్ణ ప్రేమ, గోపాల లీల, గోవింద స్మరణ. అన్య మాకవసరంలేదు, మా హృదయాలలో ఇతరానికి ఇసుమంత కూడా స్థానంలేదు. కన్నులు తెరిచినా మూసినా కృష్ణరూపం కనిపిస్తుంది. మా దేవుడు మా కృష్ణుడు. వారితోనే మాజీవితం. మేము కృష్ణ పదారాధన మాను కొని క్షణంకూడా జీవించలేము. లోకులు కాకులు. కాకులు అరిస్తే కోకిలలు గానం మానుకుంటాయా! ఎవరేమనుకుంటే మాకేమిటే కానీ మా హృదయ భాండాల నిండా కృష్ణప్రేమ రసం నిండినది. ఈభాండాలు ఏసాగరంలో ముంచినా వానిలోనికి అన్యం ఎలా ప్రవేశిస్తుంది. తాత్త్వికాలు మాకు తెలియవు. ఆ దేవకీ పుత్రుడే ఆ కేకీ పింఛకిరీటుడే మాసర్వస్వం గురువూ, దైవమూ, పతీ, గతీ అన్నీ ఆయనే.

ఆ శ్యామ సుందరాకారం, ఆ దివ్యసుందర వదనారవిందం, ఆగజ రాజగమనం ఆ మధుర మృదు మందహాసం, ఆ సుందరవిలాసం, ఆ రూప రసం,- మాకెక్కడ లభిస్తాయి. మా కన్నులు ఆ కృష్ణ దేవుని తప్ప మరొక వస్తువును చూడవు. మా వీనులు ఆ కృష్ణకథలు తప్ప మరొక మాటను వినవు. మా మనస్సు మరొకదాని మననం చేయదు.

ఉద్ధవా! ఏ యోగం వద్దుగానీ, మాకు కృష్ణదేవుడు ప్రాప్తించే యోగం ఉందా! మేము అబలలం, అమాయికలం, జ్ఞానం యోగం మాకేమి తెలుసు. కృష్ణుడు లేనిచోటు చూచి అక్కడ నీ బోధ మొదలుపెట్టు.

మాధవునితో చెప్పు. మానినీ మణులకు వక్షాలపై చందనం పూసుకొన్నా, మాల్తికా హారాలు వేసుకొన్నా, విరహాగ్నికి అవి భస్మం అవుతాయి అని ఆ నందనునతో మా మాటగా అను."

అలాంటి అనుభవం కాగా ఉద్ధవుని గర్వం మాయమై పోయింది. పరిశుద్ధ ప్రేమ, స్వచ్ఛమైన భక్తి అంటే ఏమిటో ఉద్ధవునికి తెలిసింది ఉద్ధవుడు పశ్చాత్తప్తుడై గోపకాంతల పాదాలపైబడి భక్తి నేర్చు కొన్నాడు.

"మహాయోగులు లోకంలో గోపికలుగా జన్మించారు. వారి మనస్సు మాధవునిపై లగ్నమయింది. సంతత సర్వేశ్వర ప్రేమాంబుధిలో మునిగియున్నారు. వారి జన్మలు సఫలం అయ్యాయి." అను కొన్నాడు మనసులో ఉద్ధవుడు.

22 సూ. తత్రాపి న మాహాత్మ్యజ్ఞాన
విస్మృత్యపవాదః

ఇంత ఉన్నత భక్తి మార్గంలో ఉండి కూడా గోపికల మదిలో కించిత్తుకూడా గర్వంలేకపోవడం అద్భుతమైన విషయం.

గోపికలు కృష్ణ భగవానుని మహత్వం, కృష్ణ భక్తిలోని విశ్వతత్త్వం ఏక్షణంకూడా మరువలేదు. గోపాల స్వామిని వారు సామాన్య గోపాలుడని ఎన్నడూ తలంచలేదు. పరమాత్మగానే భావనచేశారు. లోకనాథుడుగనే ర్తించారు. స్మరించారు ఆత్మసమర్పణం కావించారు.

కృష్ణ దేవుని పరాక్రమం అతిలోక ప్రశంసనీయం. వారు దానిని కనులారా చూస్తున్నారు. చెవులారా వింటూనే ఉన్నారు. పూతనాది రాక్షస సంహారం, కంసవధ అన్నీ వారికి తెలిసినవే. రాసక్రీడలో కృష్ణ దేవుని అనేక రూపాలు వారు దర్శించినవే.

లౌకిక ప్రేమవేరు-భగవత్ప్రేమ వేరు. భగవద్భక్తికి భేద భావం లేదు. గోపికలు కృష్ణ ప్రేమపొంది పరమానందానుభూతిని అందు కొన్నారు.

భాగవతంలో గోపికలు కృష్ణునితో ఇలా పలికినట్లుగా ఉంది.

"ఓ కమలాక్షా! కమలాపతీ! కామినీ మదనా! లక్ష్మీదేవి! ఆనందం కలిగించే నీపాద సేవాభాగ్యం మాకు కూడా ఒక్కంత ప్రసాదించావు. రాసక్రీడలతో మా కోరికలు తీర్చావు. తపోధనులనే కాదు మమ్ము కూడా ఆనందపరచిన పరమాత్ముడవీవు.

నీవు మా పతివే కాదు జగత్పతివి. మా నాథుడవే కాదు త్రిలోక నాథుడవు పురుషుడవు నీవు ఒక్కడవే. ఈజీవకోటి అంతా స్త్రీలోకమే. పురుషోత్తముడవన్న నామం నీకే తగును.

నీ కృపాలేశం కోసం దేవముని జనులెల్లరు అహర్నిశలు ఆయాసపడుతుంటారు. కొందరు లక్ష్మీదేవికి తప్ప నీవక్షంలో మరెవ్వరి స్థానం లేదనుకొంటారు. కానీ భక్తురాలైన తులసీదేవికి స్థానం ఇచ్చిన దయామయుడివి. త్రివక్రి అయిన కుబ్జను పాలించి కోరిక తీర్చి పరమానందం పంచిపెట్టిన ఉదారగుణశాలివి.

నీ పాద రజం కావాలని, జన్మ జన్మలనుండి మునిగణాలు కోరుతున్నట్లే మేమూ కోరుతున్నాము. నిన్ను శరణాగతి వేడుకొంటున్నాము. గోకులంలో ఈనాటికి మా మధ్య అవతరించావు. మా జన్మలు ధన్యమైనాయి. నీవు కేవలం నందనందనుడివి కావు. పరమానందమూర్తివి, పరంధాముడివి, పరాత్పరుడవు. సర్వజీవకోటికి అధిపతివి. సర్వారాధ్యుడవు."

గోపికలు కృష్ణుని పరమాత్మ అనే భావించి ఆత్మ సమర్పణ కావించారు. ఇది అనేక ప్రమాణాలతో నిర్ధారించబడిన విషయం.

బ్రహ్మ దేవతాస్త్రీలతో ఇలా అన్నాడు-

హరి పూజార్థము పుట్టుడు
సుర కన్యలు భూమి యందు సుందరతనులై
హరి కగ్రజు డై శేషుడు
హరి కళతో బుట్టు తత్ప్రియారంభుండై 1

ఈ జ్ఞానం కలిగి పుట్టిన వారే గోపికలు.

23 సూ. తద్విహీనం జారాణామివ

భగవంతుడని తెలుసుకోకుండా సామాన్యుడని భావించి అతనిపై ప్రేమ ప్రకటిస్తే అది జారత్వం వలె ఉంటుంది.

నిశ్చల భక్తి కాని జారత్వం. భగవంతునిపై నిస్వార్థమైన నిష్కామమైన ప్రేమాసక్తియే భక్తి. ఆ ప్రేమాసక్తి భగవద్భక్తికి పునాది. తెలిసి కానీ తెలియక కానీ భగవంతుని ఎడల అనన్య ప్రేమ వ్యక్తమైతే అది నిష్ఫలంకాదు. కాగా తెలిసి చేసిన భక్తి మానవునికి విశేష ఫలం ప్రసాదిస్తుంది.

ఏకైక నిష్ఠతో పరబ్రహ్మపై భక్తి నిలుపలేక సిద్ధిని పొందలేక చంచలుడై వివిధ దేవతలను ఆరాధించటం వ్యభిచరించటం అవుతుంది. భక్తి అవ్యభిచారిణి అయిఉండాలి. బలహీనమైన మనస్సు వ్యభిచారానికి స్థానమవుతుంది. జారత్వం అంటే వేదాంత పరిభాషలో చపలముగా తిరుగుట లేక మనశ్చాంచల్యం అని అర్థం.

దివ్యమైన ప్రేమ హృదయ సంబంధి. అది అతి నిగూఢం. ఎవరికి వారే ఆత్మసాక్షిగా తన హృదయ దర్పణంలో తన శీల సంపదను పరీక్షించుకోవాలి. నిశ్చల నిర్మల పవిత్రప్రేమతో కృష్ణ దేవుని ఆరాధించి

---

1. భాగవతం దశమ 16

గొల్లభామలు పరమానందాన్ని పొందగలిగారు. ఇంత పవిత్ర చరిత్రలు కనుకనే వీరి చరిత్రగల భాగవతాన్ని శుకమహర్షి ప్రేమాసక్తితో పరీక్షిన్మహారాజుకు వివరించి చెప్పి మోక్షం కలుగజేశాడు.

ఈ ప్రేమ భగవత్ పరం అయినప్పుడు పరమ పవిత్రం, పరమా దర్శం అవుతుంది. దీనికి వ్యతిరిక్తమైనది ప్రేమకాదు. కాకూడదు. పతివ్రత పతిసేవాసక్త అయి పరుణ్ణి తలచదు. ద్వేషించదు. అల్లే భక్తుడు తన ఇష్టదైవాన్ని ఉపాసిస్తాడు. అంతమాత్రాన అన్యదేవతలను ద్వేషించడు. గోపికామణులు లక్ష్మీశ్వరుని ఏకైక దీక్షతో వైకుంఠ వాసుడని యోగిజన వంద్యుడని సేవించారు.

× × × ×

ఘన లక్ష్మీ యుతమై-వినన్ శుభదమై-కామాది విధ్వంసియై-
సనకాదిస్తుతమై-నిరంతర తపస్సంతప్త పున్నాగ జీ
వనమై-యొప్పెడు నీ కథామృతము ద్రావంగల్గునే భూరి దా
న నిరూఢత్వములేని వారలకు మా నారీ మనోహరకా! 1

24 సూ. నాస్త్యేవ తస్మిన్
తత్సుఖ సుఖిత్వమ్.

లౌకిక ప్రేమ వ్యవహారాలలో పరస్పర సుఖాభిలాష అమితంగా ఉంటుంది. కానీ ఈ పరమప్రేమ అంతా నిస్వార్థం, పరిపూర్ణ త్యాగం కనుక ఇది ఉత్తమోత్తమం.

---

1. ఆంధ్రభాగవతం

కాముకులు తన సుఖం, తన ఇంద్రియతృప్తి మాత్రం చూసుకొంటారు. కానీ పరమప్రేమ స్వరూపులైన భక్తులు పరసుఖం పరోపకారం పరమానందం అభిలషిస్తారు.

గోపికలు పరిపూర్ణ త్యాగమయ జీవులు. ఆ నారీజనం తన సుఖం తన గౌరవం తన జీవనం 'ఏమిటి' అని ఆలోచించలేదు. పరాత్పరున కానందం కోసం తాము ఏమయినా ఫరవాలేదు అని వారి నిశ్చయం.

పరమాత్మునిపై గల ప్రేమ కామంకాదు. భక్తులు కాముకులు కారు. కృష్ణ పరమాత్మ కాముకుడుకాడు. ప్రేమ స్వరూపుడు, విశ్వాత్ముడు, పరబ్రహ్మమూర్తి, మునిజనసేవ్యుడు, అఖిల వాఙ్మయ సంస్తవ్యుడు, సంభావ్యుడు. గోపికలు కోరుకొన్నది ఆ పరంధాముణ్ణి కానీ ఒక గొల్లవానినీ కాదు, ఒక రాచబిడ్డనూ కాదు.

గోపికలు గోపాలురూ తమ తమ ధనములను, మనములను, శరీరాలను సుమహారాలరాను విహారాలను ఆహారాలను భవనాలను క్రీడావనాలను కృష్ణ దేవుని పాదారవిందాలకు పూజాసామాగ్రిగా, యజ్ఞేశ్వరునికిచ్చే పూర్ణాహుతి సామాగ్రిగా సమర్పించారు. విశ్వపతి సుఖం మాత్రమే కోరుకొన్నారు. ఆయన ఆనందం కొరకై ఏమైనా చేశారే కానీ తమకోసం మాత్రం కాదు. వారు ఆ పవిత్ర ప్రేమలోని పరమానుభవం మాత్రం పొందారు

ఇదే కామానికి ప్రేమకు గల అంతరం. కామం ఇతరులనుండి తనకు కావాలని సుఖం కోరుతుంది. ప్రేమ తననుండి ఇతరులకు సుఖం అందించాలని కోరుతుంది.

కృష్ణస్వామికి సర్వం సమర్పించటం, ఆయనపట్ల క్షణం వియోగం కలిగితే పరమవ్యాకులత చెందటం, 'స్వామి సర్వజ్ఞుడు సర్వరక్షకుడు' అనే జ్ఞానం కలిగి ఉండటం, మురళీ లోలుని ఆనందంలోనే తామూ ఆనందం అనుభూతి పొందటం ఈ మొదలైనవి గోపికలలోని ప్రేమ గుణాలు.

# భక్తి ఫల స్వరూపిణి

25 సూ. సా తు కర్మ జ్ఞాన
యోగేభ్యోఽ ప్యధికతరా

కర్మ జ్ఞాన యోగాదులకంటె కూడా భక్తి అత్యధిక శ్రేష్ఠతరం.

ఈశ్వర సందర్శనానికి నాల్గు మార్గాలున్నాయి. ఆత్మానాత్మ వివేకంతో సంసారంలో పడకుండా బ్రహ్మ విచారమగ్నమైన జ్ఞాన మార్గం ఒకటి.

లోకోపకారానికి లేక తన వాంఛాపరితృప్తికై ఇహ పరాలకోసం పాటుపడే యజ్ఞయాగాదులతో కూడిన కర్మ మార్గం రెండోది.

ఇంద్రియ నిగ్రహంతో నిష్ఠా గరిష్ఠమైన కఠినాతికఠిన నియమ బద్ధమైన యోగమార్గం మూడోది.

ఆత్మనివేదనంతో శరణాగతి కోరి విశ్వాసంతో నామస్మరణ ద్వారా సులభ సాధ్యమైన భక్తి మార్గం నాల్గోది.

మొదటి మూడు మార్గాలలో అభ్యాసానికి కుల వయో లింగ భేదాలున్నాయి. అభ్యాసం, అనుష్ఠానం సరిగా లేకపోతే నియమ భంగం జరిగితే పతనమయ్యే ప్రమాదం ఎంతైనా ఉంది.

కానీ భక్తి మార్గంలో అలాంటి భయం లేదు. కుల వయో లింగ భేదం లేదు. అందరూ భక్తి మకరందం పానం చేయవచ్చు. తమ తమ శక్తి కొలది ఆచరించి అభ్యసించి తరించవచ్చు. వీరికి ఎల్లప్పుడూ భగవంతుని అభయ హస్తం రక్షగా ఉంటుంది.

భగవంతుడు ఇలా వివరించాడు -

"భక్తి నన్ను వశం చేసుకొన్నంతగా జ్ఞాన కర్మ స్వాధ్యాయ తప యోగాదులు నన్ను వశం చేసుకోలేకపోయాయి. శ్రద్ధా యుక్తమైన భక్తికి వశుణ్ణి అయిపోతాను. నా భక్తి రసం చండాలురను కూడా పవిత్రులను చేస్తుంది. భక్తికి అఖండ శక్తి ఉంది." 1

నాహం వేదైః న తపసా న దానేన న చేజ్యయా
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టివా నసి మాం యథా॥
భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప 2

ఓ అర్జునా! నీవు భక్తిలో నన్ను దర్శించినట్లుగా వేద తపదాన యజ్ఞ విదులు నన్ను దర్శింపజాలరు అనన్య భక్తి ద్వారా మాత్రమే ఇలాంటి నా సాక్షాత్కారం, ప్రేమ, నన్ను పొందే భాగ్యం, లభ్యమవుతాయి"

జ్ఞానయోగాదులచే శ్రమించటం ఎందుకు ! భక్తితో సులభంగా భగవద్దర్శనం కల్గుతుంది కదా!

ఇంటిలో ఉన్న కామధేనువును వదలి పాలకోసం పొరుగిండ్లకు పరువెత్తినట్లుంది

1. భాగవతం ఏకదశస్కంధం 14/20-22.
2. భగవద్గీత ఏకాదశ 61 53-54

గరుత్మంతుడు హరి భక్తితో ఎన్ని పనులు సాధించాడు! కాన ఆ వైనతేయునివలె భగవంతుని సులభంగా సేవించండి. భక్తి అనే నౌకలో కూర్చొని సారహీనమైన సంసార సాగరాన్ని దాటిపొండి.

శుకుడు పరీక్షిత్తుతో ఇలా అన్నాడు :-

వినుమంభోజభవుండు మున్ను మదిలో వేదంబుమున్మూఁడు నె
మ్మనమందున్ దలపోసి యెంతయు పరామర్శించి మోక్షంబు త
క్కిన మార్గంబులవెంట లేదనుచు భక్తింజింత సేసెన్ జనా
ర్దను నాత్మాకృతి నిర్వికారుడగుచున్ దన్మార్గనిర్ణేత యై 1

26 సూ. ఫల రూపత్వాత్

భక్తి ఫలరూపిణి, ఫలదాయిని.

ఈ భక్తి తత్వంలో పరాకాష్ఠ దశ సాధ్య భక్తి అంటారు. దీనికే పరమ భక్తి అనీ, అనన్య భక్తి అనీకూడా పేర్లు. ఈ సాధ్యభక్తిని చేరటానికి సాధనా రూపమైనవి గౌణీ భక్తులు. వీనికే సాధనా భక్తి పద్ధతులు అనికూడా పేర్లు.

సాధ్య భక్తి చేరటానికి ధర్మకర్మాలు, యజ్ఞయాగాలు, వేదాధ్యయనాలు నియమనిష్ఠలు సాధనలు. అనగా ఇవి గౌణీభక్తి విధానాలు అని అర్థం. ఈ గౌణీ భక్తి విధానాలద్వారా సాధ్యభక్తిని చేరుకోవాలి.

అనంత ప్రేమ రూపమగు భక్తియే పరమ ప్రయోజనం. ఇదే సర్వార్థ సాధకం. ఇదే సాధ్యభక్తి. ఇదే పరమానందం. ఇది సర్వ భక్తులకు సకల మునిజనులకు ధ్యేయం. దీనిని పొందుటే అందరి పరమావధి.

---

1. ఆంధ్రమహాభాగవతం ద్వితీయ 3౦

ఈ భక్తి ఒక మహాదేవి. ఈదేవిని సర్వసిద్ధులూ నానావిధాలైన భోగాలూ పరిచారికలవలె నిత్యం సేవిస్తుంటాయి. ఈ దేవి ఫలరూపిణి. సకల ఫలదాయిని.

హరి భక్తి మహా దేవ్యాః సర్వముక్త్యాది సిద్ధయః
భుక్త యశ్చాద్భుతా స్తస్యా శ్చేటికా వదనువ్రతాః 1

ఈ దేవి ఆదిశక్తి. చిత్కళా శక్తి. అందరి దేవతలకంటె అధి దేవత. సృష్టి స్థితి లయాలు ఆమె అధీనాలు. బ్రహ్మ ఈ తల్లిపాద రేణు సంపాదనా శక్తితో లోకాన్ని సృష్టిస్తున్నాడు. విష్ణువు ఒక్క పరాగరేణువును తన వేయి శిరాలపై మహాభాగ్యంగా మోస్తుంటాడు. శివుడు మహానందంగా ఒడలంతా పూసుకుంటాడు. ఆ పరాగ మహిమ అంత గొప్పది. ఆ తల్లిని వేవిధాల కీర్తించారు శంకర భగవత్పాదులు. ఆమె స్త్రీపురుష ఉభయరూపిణి. ఆ తల్లియే సౌందర్యలహరి. ఈమె అమ్మలగన్న అమ్మ ముగురమ్మల మూలపుటమ్మ. ఈ తల్లిని పోతన ఇలా ప్రస్తుతించాడు -

అమ్మల గన్న యమ్మ-ముగురమ్మల మూలపుటమ్మ-చాల పె
ద్దమ్మ-సురారులమ్మకడు పారడి ద్రుచ్చినయమ్మ-తన్నులో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ-దుర్గ-మా
యమ్మ-కృపాబ్ధి-ఇచ్చుత మహత్వ కవిత్వ పటుత్వ సంపదల్ 2

శ్రీ త్యాగరాజు తన కృతులలో ఈ భక్తి దేవిని అన్నిటికి మూలం అన్నాడు -

---

1. నారద పాంచరాత్రము
2. ఆంధ్రభాగవతం ప్రథమం

సంగీత జ్ఞానము భక్తి వినా
సన్మార్గము గలదె మనసా !
స్వర రాగ సుధారస యుత భక్తి
స్వర్గాపవర్గము రా! ఓ మనసా !

27 సూ. ఈశ్వర స్యా ప్యభిమాన
ద్వేషి త్వా ద్దైన్య ప్రియత్వాచ్చ.

ఈశ్వరునకు కూడా గర్విష్ఠుల యెడల ద్వేషం, కోపం, దీనులపట్ల ప్రేమ, కరుణ, జాలి, వాత్సల్యం, ఉంటాయి.

ఈశ్వరుడన్నా విష్ణువన్నా పరమాత్మ అనే అర్థం. ఈశ్వరుడు దర్పహారి, కందర్పహారి, శ్రీహరి శ్రీకరుడు, భక్తజన మనోహరుడు, ఆతడు యోగిజన హృదయవిహారి.

ఈశ్వరుడు పరమ దయామయుడు, ఆనందహృదయుడు. ఆయనకు ఎవరిపైన ద్వేషం కానీ కోపంకానీ లేదు, పక్షపాతం ఎవరిపైనా లేదు.

ఆయన సమవర్తి. లోకైక చక్రవర్తి. అందరిని కాపాడటం అందరి యోగక్షేమాలు చూడటం ఆయనపని. ఆయన గర్విని దండించి దారిలో పెడతాడు. దీనుణ్ణి ప్రేమించి లాలిస్తాడు. దైన్యం పోగొట్టి ధైర్యం చేకూరుస్తాడు.

కర్మజ్ఞాన యోగ సాధకులలో 'నేను ఉపాసనాపరులలో గొప్ప వాడను' అనే అహంకారం కల్గుతూ ఉంటుంది. అట్టివారిని భయపెట్టి వారి గర్వం తొలిగించి మంచి మార్గంలో నడిపిస్తాడు పరాత్పరుడు, ఇందువల్ల భగవంతుని అనుగ్రహమే కాదు ఆగ్రహంకూడా వైర భక్తుల యెడ వరప్రసాదమే.

నామస్మరణం ప్రేమతో చేసినా కోపంతో చేసినా భగవంతుడు ముక్తి అందిస్తుంటాడు. ఆ కరుణామయుని హృదయంలో గర్వితులయెడ కూడా ప్రేమ ఉంటుంది. కనుకనే దండించి అహంకారం ఖండించి అయినా వారినికూడా ఉద్ధరిస్తాడు ఆ దయామయుడు.

భగవంతుని దండనలోనూ దయ ఉంది. కోపంలోనూ కరుణ ఉంది. ప్రతి కార్యంలోనూ లోకాన్ని ఉద్ధరించాలనే తపన ఉంది.

సర్వసాధన హీనస్య పరాధీనస్య సర్వదా
పాపపీనస్య దీనస్య కృష్ణ ఏవ గతిర్మమ.

ఓ కృష్ణా ! ఏ సాధన లేని హీనుణ్ణి పరాధీనుణ్ణి పాపిని దీనుణ్ణి నాకు నీవేగతి శరణు ప్రభో ! నీవే తప్ప ఇతః పరం ఎరుగను నీవే మన్నించాలి. సంరక్షించాలి రావే ! భద్రాత్మకా! అంటే

పరువెత్తుకొని వచ్చి ఎట్టిపాపినైనా చక్రం అడ్డంవేసి రక్షిస్తాడు. ఆ ఈశ్వరుడు.

"సమోఽహం సర్వభూతేషు నద్వేష్యోఽస్తి నప్రియః"

దీనిని శ్రీ నీలకంఠ దీక్షితుల వారు వ్యాఖ్యానిస్తూ- అగ్ని ఆకర్షణ శక్తిలేదు. అయినా అది తన దగ్గరున్న వారి చలి పోగొడుతుంది. దూరంగా ఉన్నవారి చలి పోగొట్టదు. అట్లే భగవంతుడు కూడా అందరియెడల సమభావం కలిగిఉన్నా శరణన్న వారి భవ బంధాలు రూపుమాపుతాడు. ఆ స్వామికి రాగద్వేషాలు లేవు అన్నారు.

ఇతరులు తమ శక్తిని నమ్ముకొని గర్వంతో భగవంతునికి దూరమవుతుంటారు. భక్తులు తమ సర్వస్వం స్వామికి సమర్పించి శరణాగతి కోరి స్వామికి చేరువ అవుతుంటారు.

సర్వసమర్పణ వలన వచ్చే అహంకార శూన్యత భగవత్కృప వలననే ప్రాప్తిస్తుంది. అహంకృతి పోగానే నిష్కృతి వెంటనే కల్గుతుంది. నేనూ నాదీ అనేదేలేదు. చేసేవాడు చేయించేవాడు భగవంతుడే అనే పూర్తి విశ్వాసం భక్తునిలో స్థిరంగా ఉండాలి.

పలికెడిది భాగవతమట
పలికించెడి వాడు రామభద్రుండట నే
పలికిన భవహర మగునట
పలికెద వేరొండు గాథ పలుకగనేలా ! 1

అని పూర్తిగా భగవత్ విశ్వాసంతో పోతనామాత్యుడు పలికాడు. కనుకనే భాగవతం భక్తిరసనిష్యందమై అమందానందకందమై ప్రకాశిస్తోంది. చిరంజీవిగా పునర్భవం లేకుండా ఉండిపోయాడు ఆ భక్తకవీశ్వరుడు.

తనభక్తిని గూర్చి సాధనను గూర్చి గర్వం పొందని భక్తుడు సర్వశ్రేష్ఠుడు. ఆతడే పరమాత్మునకు ఇష్టుడు. పరమాత్ముడు దయామయుడు-సర్వసముడు.

ఆ. అలుకనైన చెలిమినైన కామంబున
నైన బాంధవముననైన భీతి
నైన తగిలి తలప అఖిలాత్ముడగు హరిన్
జేరవచ్చు వేరు సేయ డతడు 2

1 ఆంధ్రమహాభాగవతం 18
1. ఆంధ్రభాగవతం సప్తమ 14

28 సూ. తస్యా జ్ఞాన మేవ
సాధన మి త్యేకే

అనన్య భక్తికి సాధనం జ్ఞానమొక్కటి మాత్రమే. అని అనేక మాన్యుల ఆచార్యుల అభిప్రాయం.

సుస్థిర భక్తికి జ్ఞానం అత్యవసరం. అయితే ఏ జ్ఞానం అవసరం? విశ్వాసంతో కూడిన అచంచల భగవద్విజ్ఞానం. "నే నారాధించే స్వామి జగదధిపతి. ఆయన పరమేశ్వరుడు - సర్వసృష్టికి ఆధార భూతుడు - మూలపురుషుడు-సృష్టి స్థితి లయ కారుడు-నా స్వామి సర్వాంతర్యామి సర్వాధికుడు ఈతడే-" అనే జ్ఞానం ఉండాలి. ఈ జ్ఞానం లేకపోతే శ్రద్ధ కుదరదు. శ్రద్ధ లేకపోతే భక్తి కలుగదు. భక్తి లేనిప్రేమ పరిపూర్ణం కాదు. భక్తికి జ్ఞానం తోడయితే బంగారానికి తావి అబ్బినట్లే. అఖండ శ్రద్ధ వలననే భగవద్భక్తి ప్రాప్తిస్తుంది. అటువంటి అఖండ శ్రద్ధాపూర్ణ భక్తితోనే భగవంతుని పూర్ణానుగ్రహం కలుగుతుంది. జటాయువు, గజేంద్రుడు, ధ్రువుడు, గుహుడు, శబరి, కన్నప్ప ఆదిగాగల పెక్కుమంది భక్తులు భక్తి జ్ఞానంవల్లనే కైవల్యం పొందారు. జ్ఞానం అంటే పరమేశ్వర ప్రీతికొరకు సర్వం పరమేశ్వరార్పణం చేయటమే. అభిమానం అహంకారం మమత మమకారం వదలి పరమేశ్వర చింతనం చేయాలని అవ్యక్తనామ తత్త్వని రూపణం బోధిస్తూ బ్రహ్మదేవుడు ముని పుంగవులతో జ్ఞానం విశిష్టతను ఇలా వక్కాణించాడు- శివుడూ, విష్ణువూ ఒక్కరే. అసలు మూలపదార్థం ఒకటే అది. తెలుసుకోవటమే జ్ఞానం-

జ్ఞానము సవిశేష స్థితి
దానికి నాశంబులేదు దానిఁదెలియుటన్
మానాహంకృతి మమతలు
మానిన నిర్మలుడు మోక్షమార్గము గాంచున్ 1

1. ఆంధ్ర మహాభారతం అశ్వమేధ 166

మహా మునులు ఒకసారి విదేహారాజైన జనకమహారాజు యజ్ఞానికి వెళ్ళారు. వారిని పూజించి 'మహానుభావులారా! లోకంలో కూ్రరులు రోగులు దుఃఖ భాగులు అయిన నరులున్నారు. వారు తరించే విధానం చెప్పి అసలు జ్ఞానం అంటే ఏమిటో చెప్పండి' అన్నాడు మహారాజు. ఆ సంయమీంద్రులు ఇలా అన్నారు -

"రాజా! మనో వాక్కాయ కర్మలద్వారా చేయు ప్రతికృత్యము యొక్క ఫలం పరమేశ్వరార్పణం అని భావించి పలుకుటే సుజ్ఞానం. ఇది తెలిసిన నరుడు ముక్తుడవుతాడు."

కరణత్రయంబు చేతను
నరుడే కర్మంబు సేయు నయ్యై వేళన్
హరి కర్పణ మని పలుకుట
పరువడి సుజ్ఞాన మండ్రు పరమమునీంద్రుల్[1]

29 సూ. అన్యో న్యాశ్రయత్వ మిత్యన్యే

పెక్కు మంది ఆచార్య దేవుల అభిమతం కూడా భక్తి జ్ఞానములు పరస్పరాశ్రితాలు అనే.

సాధనాప్రాయమైన భక్తి భూమికల జ్ఞానంవలననే భగవత్తత్త్వానికి మార్గం తెలుస్తుంది. ఈ సాధనా భక్తిని గౌణి భక్తి అంటారు. ఈ గౌణి భక్తి ద్వారా భగవంతునిపై పరమ ప్రేమ ఉద్భవిస్తుంది. నిర్మలమైన అనన్యమైన భక్తి కలిగినపుడు భక్తి అనీ, జ్ఞానం అనీ వేరు వేరు భావాలు ఉండవు. వశిష్ఠుడు మహా భక్తుడు, మహా జ్ఞాని.

1. ఆంధ్ర భాగవతం ఏకాదశ 42

శంకర భగవత్పాదులూ అంతే. "ఆ పరమ భక్తి యొక్క శక్తి అనంతం. భక్తిలోనే ఆ జ్ఞానం ఇమిడి ఉంది. భక్తికి అన్యంగా మరొకటి లేదు" అని మహాత్ముల భావన.

సర్వ కర్మలు విష్ణువున కర్పించి కర్మయోగి, విష్ణుదేవుని వార్తా శ్రవణాదులు చేయుచు భక్తయోగి, విష్ణు తత్త్వ చింతనం చేయుచు జ్ఞానయోగి పరతత్త్వాన్ని భజించాలి. కర్మ భక్తి జ్ఞాన యోగాలు పరస్పరాశ్రితాలు. ఫలితం ఒక్కటే.

"ఏకంసత్ విప్రా బహుధావదంతి" అని శ్రుతి. ఉన్న పరతత్త్వం ఒక్కటే. పండితులు వివిధ తీరుల్లో వర్ణిస్తారు. మార్గాలు అనేకం. గమ్యం ఒక్కటే. కర్మ భక్తి సహాకృత జ్ఞాన యోగం వలన తత్త్వం తెలిసి పురుషోత్తముని భజించాలి.

హరిర్హి నిర్గుణస్సాక్షా త్పురుషః ప్రకృతేః పరః
స సర్వదృ గుపద్రష్టా తం భజన్ నిర్గుణో భవేత్ [1]

జ్ఞానం నేత్రం భక్తి హృదయం. కర్మ హస్తం. సత్యం నిత్యం. ధర్మం మార్గం. నిత్యమైన సత్యం తెలిసుకోవాలి జ్ఞాన నేత్రంతో. హృదయంతో ప్రేమించి సత్కర్మ చేతులారా చేస్తూపోవాలి ధర్మమార్గంపైన.

మనస్సు మహేశ్వరునివైపు మరలడమే భక్తి. అంటే భగంతునిపై ఆసక్తియే భక్తి. అట్టి భగవదనురక్తి జ్ఞానరూపమైన భక్తి ముక్తిఫలం ఇస్తుంది. కనుక భక్తి, జ్ఞానం కర్మ ధర్మ యోగాలు అన్నీ పరస్పరాశ్రితాలు. భక్తుడు సూక్ష్మ పరిశీలనాబుద్ధితో సత్కర్మ సదాచార సమన్వయంతో భగవత్సాక్షాత్కారం పొందాలి.

---

1. శ్రీ మద్భాగవతం దశమ 88-5

30 సూ. స్వయం ఫలరూప తేతి
బ్రహ్మకుమారాః

భక్తి స్వయం ఫలరూపిణి. ఒక సాధనా ఫలం. అని బ్రహ్మ కుమారుల నిశ్చయం.

సనత్కుమారులు, మరీచీ, నారదాదులు బ్రహ్మ మానస పుత్రులు. వీరి అభిమతం ప్రకారం భక్తి సాధన-సాధ్యంకూడా. భక్తులు పరమ భక్తి ప్రాప్తికై భక్తిని ఉపాసిస్తారు. భక్తికి భక్తియే ఫలం. భక్తి స్వయంగా ఫలరూపిణి, ఫలదాయిని. భక్తి ఫలం అత్యద్భుతం. భక్తి మహాత్వం అనంతం.

భక్తి మరొక సాధన ద్వారా లభించేదికాదు. అది స్వతంత్రం. భక్తి భక్తి ద్వారానే లభిస్తుంది. భక్తికి మించింది లేదు. జ్ఞాన విజ్ఞానాలు భక్తి ఆధీనంలోనే ఉంటాయి. ఈ విషయాన్నే తులసీదాసు ఇలా పలికాడు.

సో స్వతంత్ర అవలంబ న ఆనా
తేహి అధీన గ్యాన బిగ్యానా 1

అందుకే భక్తులు జన్మ జన్మాలకు భక్తినే అపేక్షిస్తారు.

న ధనం న జనం న సుందర
కవితాం వా జగదీశ ! కామయే
మమ జన్మని జన్మ నీశ్వరో
భవతా ద్భక్తి రహైతు కీత్వయి 2

1. రామచరిత మానసము
2. శిక్షాష్టకం శ్రీకృష్ణ చైతన్య

ఈ భక్తియే శ్రీవిద్య. విద్య అంటే పరబ్రహ్మ తత్త్వం తెలుసుకొనేది. పరబ్రహ్మం కారణ కార్యములకు అతీతమైన తత్త్వం.

31 సూ. రాజగృహ భోజనాదిషు
తథైవ దృష్టత్వాత్

రాజగృహ భోజనాదులు కొన్ని దృష్టాంతాలు -
రాజ ప్రాసాదాలు పరమాన్నాలు ఎక్కడో ఉన్నాయని ఊహించి వాటిని చూడకుండా అనుభవించకుండా పగటి కలలవలన కడుపు నిండదు. ఎండమావుల వలెనే ఉంటాయి ఇవి.

ప్రేమ అనుభవం లేకుండా కేవలం వస్తు జ్ఞానంచేత భక్తులకు ప్రయోజనం లేదు అని అర్థం. అద్దంలో కనబడే పదార్థాలు కంటికి అందుతాయే కాని అనుభవానికి అందవు. అవి ఆకలి తీర్చలేవు. అవసరానికి ఆదుకోలేవు.

భక్తులకు కావలసింది వర్ణనలూ కథలూ కావు. ఆడంబరం అంతకంటేకాదు. ప్రేమానుభవం, ఆచరణం, ఆనందం, అనుభూతి కావాలి.

శుకమహర్షి ఇలా అన్నాడు-

ఉపవాస వ్రతశౌచ శీల మఖ సంధ్యోపాస నాగ్నిక్రియా
జప దానాధ్యయనాది కర్మముల మోక్షప్రాప్తిచేకూర- ద
చ్చపు భక్తిన్ హరి-బుండరీకనయనున్-సర్వాతి శాయిన్-రమా
ధిపు- బాపఘ్ను-బరేశు-నచ్యుతుని నర్థిన్ గొల్వలేకుండినన్ 1

---
1. ఆంధ్ర భాగవతం ఏకాదశ 42

ఈ సూత్రానికి మరి కొందరు ఇలా వ్యాఖ్యానం చేశారు.

ఈ పరమభక్తి స్వయం ఫల రూపమైన రాజువంటిది. రాజు-గృహం- భోజనం- ఇవి దృష్టాంతాలు.

"ఒక రాజకుమారుని దొంగలెత్తుకు పోయారు. ఆ బాలుడు ఒక సన్యాసి దగ్గర పెరుగుతున్నాడు. వాడు తాను సన్యాసిని అనుకున్నాడు· కానీ రాజపుత్రుడను అని అనుకోలేదు. ఇతరులు 'నీవు రాజపుత్రుడివిరా' అన్నపుడు అతనికి స్వస్వరూప జ్ఞానం కలిగింది." 1

జీవాత్మ పరాత్పరుని అంశమే. మాయచే తానూ పరమాత్మ వేరు వేరు అనుకొన్నాడు. జీవుడు సాధనా బలంచే మహాత్ముల బోధ చేత తాను పరమాత్మ అని తెలిసికొన్నాడు.

కాని సంఘటనల వలన వాడు మారలేదు. వాడే వీడు. క్రొత్త ఏమీలేదు. అదే గృహం అదే భోజనం. ఆ రాజ పుత్రుడే వీడు.

దీనివలన పరమ భక్తి సహజసిద్ధమైనది. నిత్యం- సత్యం- అది.

32 సూ. న తేన రాజపరి తోషః
క్షుధా శాంతి ర్వా

దానివలన రాజు దయ లభ్యంకాదు-ఆకలీ తీరదు-

కేవల కల్పనా కథలవలన రాజానుగ్రహం కలుగదు-ఆకలీ తీరదు. అది శుష్క జ్ఞానం అవుతుంది.

రాజప్రాసాదం యొక్క అంద చందాలు వినటం వలన పని జరుగదు.

రాజు ధర్మాత్ముడు, శక్తిశాలి, ప్రజా శ్రేయోభిలాషి, రూప వంతుడు అని వినుకలి వలన ప్రయోజనం శూన్యం. రాజును దర్శించి వానినుండి సన్మానం పొంది వాని దాతృత్వం అనుభవించినపుడు తృప్తి. కానీ కేవలం రాజును గూర్చి తెలుసుకున్నంత మాత్రంచే లాభంలేదు.

---

1. దొడ్ల వెంకటరామరెడ్డి అనువాదం. నారద భక్తి సూత్రములు.

అలానే క్షీరాన్నాదులు తీయగా ఉంటాయి, పాలతో పంచదారతో మధురంగా తయారు చేస్తారు, అవి చాలా రుచిగా ఉంటాయి-అని వర్ణించినంత మాత్రాన కడుపు నిండదు. అలానే కేవలం శుష్క-శబ్ద శాస్త్ర జ్ఞానంతో భగవంతుడు ప్రసన్నుడు కాడు. శాంతి చేకూర్చడు. భగవంతునికి అందరూ సమానమే అయినా జ్ఞానులకంటే భక్తులంటేనే భగవంతునికి ఇష్టం. తర్క- జ్ఞానాదులకంటె హృదయ పద్మంలోని మకరందం అంటే మాధవునికి మరీ ప్రీతి.

కిరీతంసూత్రంలో చెప్పినట్లుగా

"సన్యాసి పెంపుడు పుత్రుడవు. నీవు సన్యాసి పుత్రుడవు కావు. అనినంతట ఆ రాజకుమారుడు అపుడు క్రొత్తగా రాజకుమారుడు కాలేదు. మొదటినుంచి రాజపుత్రుడే. ఈ మాటవలన వానికి నూత్న పదవి రాలేదు. క్షుధార్తునికి ఆకలి తీరినంత మాత్రంచే క్రొత్తరూపు రాలేదు. అడ్డంకులు మాయలు మాత్రం తొలిగి పూర్వం గల యథార్థ స్థితి తెలిసింది." 1

ఈ విషయానికి ఇంకా వివరంగా
శ్రీకృష్ణుడు భగవద్గీతలో ఇలా వచించాడు -

సమోఽహం సర్వ భూతేషు
న మే ద్వేష్యోఽస్తి న ప్రియః
యే భజంతి తు మాం భక్త్యా
మయి తే తేషు చాప్యహమ్. 2

---

1. దొడ్ల వెంకటరామిరెడ్డి అనువాదము నారద భక్తి సూత్రములు

1. భగవద్గీత 9_29

నేను అన్ని భూతహృదయాలలో సమానంగా ఉంటాను. నాకు ఒకరంటే ద్వేషం ఒకరంటే ప్రియం లేదు. నాకు అందరూ సమానం. కానీ నన్ను భక్తితో పూజించేవారు నా హృదయంలో ఉంటారు. నేను వారి ఆత్మ పీఠంపై ఉంటాను.

33 సూ. తస్మాత్ సైవ గ్రాహ్యా ముముక్షుభిః

ముముక్షువులు సంసార బంధాలు త్రెంచుకొని మోక్షం పొంద కోరినట్లైతే భక్తినే ఆశ్రయించాలి.

భక్తితో భవబంధాలు అనాయాసంగా విడిపోతాయి. భగవంతుడు ప్రేమాస్పదుడు, కారుణ్యమూర్తి, దయామయుడు ఆయన హృదయ పరీక్ష చేస్తుంటాడు. ఆర్తి ఆలకిస్తాడు.

ఆయన కరుణా కటాక్ష వీక్షణాలతో భక్తసత్తముల్ని ఉద్ధరిస్తాడు. ఉత్తమోత్తమ సాధనల ద్వారా లభించని దుర్లభమైన ముక్తి ధనం భక్తి వల్లనే ప్రాప్తిస్తుంది. కానీ పరిపూర్ణ భక్తులు ముక్తిని వదలి భక్తిని మాత్రమే అభిలషిస్తారు. అంటే ముక్తి కంటె భక్తిపై ఆసక్తి ఎక్కువ భక్తులకు.

ఆ భక్తాగ్రగణ్యులు లావణ్యవతియైన ముక్తి కాంతవైపు కన్నెత్తి కూడా చూడరు. "ముక్తి నిరాదర భగతి లుభానే".

సర్వసులభం, సర్వేశ్వర ప్రీతి ప్రదం, సర్వశ్రేష్ఠం, అయిన భక్తిరసం వదలి ఏ సహృదయుడు ఇతరం కోరుకుంటాడు?

శ్రద్ధాళువులు బుద్ధిమంతులు శ్రీమంతులు అయిన భక్తులు నిర్మల భక్తినే కోరి దానినే అనుష్ఠిస్తారు.

అతి దుర్లభ కైవల్య పరమపద
సంత పురాన నిగమ ఆగమ బద
రామ భజన సోయి ముకతి గొసాయీం
అనయిచ్ఛిత ఆవయి బరిఆయీం 1

అతి దుర్లభమైన కైవల్యం భక్తులు కోరకపోయినా అదే లభిస్తుంది. దీనికి పురాణాలు, ఉపనిషత్తులు, వేదాలు ప్రమాణం.

మోక్షం అంటే ప్రేమరూపమే. తదన్యములు క్షుద్రములని భక్తి యోగుల విశ్వాసం -

భుక్తి ముక్తి స్పృహా యావత్ పిశాచీ హృదివర్తతే
తావత్ భక్తి సుఖస్యాత్ర కథమభ్యుదయో భవేత్

అతి దుర్లభమైన కైవల్యం పొందాలంటే అన్నిటికంటె సులభమైన మార్గం పరాత్పరుని భజించటం, నామస్మరణ చేయటం, ఆత్మ సమర్పణ చేయటం.

× × × ×

చ. హరి చరణారవింద యుగళార్చన సన్నుతి భక్తియోగముల్
నిరతముకల్గు వా రభవ నీరజగర్భుల కందరాని భా
సుర పదమందు జేరుదురు-సూరిజన స్తవనీయ! అట్టి సత్
పురుషుల పూర్వజన్మ ఫలముల్ గణుతింప దరంబె వారికిన్ 3

---

1. తులసీదాసు రామచరితమానసము
2. జీవ గోస్వామి
3 ఆంధ్రమహాభాగవతం తృతీయ 43

# సత్సంగ మాధురి

34 సూ. తస్యాః సాధనాని గాయం త్యాచార్యాః

పరమ భక్తులైన ఆచార్యదేవులు భక్తి అలవడే సాధనలను ప్రశంసిస్తున్నారు.

కర్మ జ్ఞాన సాధనలకంటె గౌణీ భక్తి సాధనలు, భూమికలు ఉత్తమ మైనవి. నారదమహర్షి భక్తి తత్త్వ ఉపాసనా విధానాలను వివిధ విధాలుగా వర్ణించాడు.

"ఆత్మజ్యోతి ఉద్దీప్తం కావాలంటే తగిన ప్రేరణశక్తి మరో ఆత్మ నుండి ప్రసరింపబడాలి. ఇలాంటి ప్రేరణ ఎవరినుండి లభిస్తుందో ఆతడే గురువు. ఆతనినుండి ఆ ప్రేరణను అందుకోనే శక్తిగలవాడే శిష్యుడు."

బీజం సజీవమైయుండాలి. క్షేత్రం సాగుచేయబడి సారవంతమై సర్వసిద్ధంగా ఉండాలి. ఇవి రెండూ చేకూరితే పారమార్థిక సస్యం పుష్కలంగా పండుతుంది.

'ఆశ్చర్యో వక్తా కుశలోఽస్యలబ్ధా' కఠోపనిషత్తు. నిజమైన ధర్మబోధకుడు ఆశ్చర్యకర శక్తులు కలిగిఉంటాడు. అతనికి కుశలుడైన, చురుకైన శ్రోత లభించాలి. ఇలా ఇరువురూ తటస్థపడితే ఆత్మబోధ తేలికగా సాగుతుంది. ఇట్టివారే నిజమైన ఆచార్యులు. నిజమైన శిష్యులు,

ఈ జ్ఞాన బోధలో ఆత్మ సాక్షాత్కారానికి మహర్షులు అనేక మార్గాలు సూచించారు.

భక్తి ప్రాప్తికి ఆచార్యులు అనేక సాధనాలు చెప్పారు. మధుసూదన సరస్వతి ఏకాదశ భూమిలు, సారార్ధనీ కవీంద్రుడు ద్వాదశ భూమికలు శ్రీధరస్వామి నవభూమికలు పేర్కొన్నారు. ఇంచు మించు అన్నీ కలిసే ఉంటాయి. విభజనలో మాత్రం భేదం.

ముఖ్యంగా పేర్కొన్నవి ఇవి—

1. మహా పురుషుల సేవచేయుట 2. కృపకు పాత్రుడగుట 3. సూక్తులపై శ్రద్ధ పొందుట 4. గుణశ్రవణం 5. ప్రేమ ఉదయించుట 6. భగవద్దర్శనం, వివిక్త ఆత్మ విజ్ఞానం 7. పరానంద ప్రేమ వృద్ధి, దృఢ భక్తి 8. ఆనందానుభవం, తత్వవిజ్ఞానం. 9. భగవద్ధర్మనిష్ఠ 10. భాగవతగుణ ప్రీతిఫలనం 11. ప్రేమ సంప్రాప్తి. అనగా ప్రేమ పరాకాష్ఠ స్థితి. ఇదే పరమ ప్రేమ.

ఇలా భూమికలు క్రమక్రమంగా అధిరోహించి భక్తులు పరమస్థితి పొందుతారు.

మానసిక ధ్యానంద్వారా గజేంద్రుడు, వాచికంగా ఆర్తితో గొంతెత్తి పిలిచి ద్రౌపది, కాయికంగా శరణాగతి పొంది విభీషణుడు మొదలైనవారు భగవత్ ప్రేమ పొందగలిగారు.

భగవంతుని కామించి గోపికలూ, భయపడి కంసుడు, వైర భావంతో శిశుపాలుడూ మొదలైన రాజులూ, చుట్టరికంగా సంబంధం అందుకొని వృష్ణులూ యాదవులూ, ప్రేమించి పరీక్షిన్ మహారాజాదులూ, భక్తి ప్రపత్తితో శుకమునీంద్రాదులూ పరమేశ్వరుడైన శ్రీకృష్ణుని ప్రేమ పొంది పునీతులైనారు.

కామోత్కంఠత గోపికల్-భయమునన్ కంసుండు-వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్-సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు-భక్తి నేము-ఇదె చక్రిన్ గంటి-మెట్లైన ఉ
ద్దామధ్యానగరిష్ఠుడైన-హరిజెందన్ వచ్చు ధాత్రీశ్వరా! 1

× × × ×

శ్రవణం- కీర్తనం- విష్ణోః స్మరణం- పాదసేవనం
అర్చనం- వందనం- దాస్యం- సఖ్యం- ఆత్మనివేదనమ్ 2

ఇలా శుక మహర్షి నవవిధ భక్తులను వివరించాడు. ఈ నవవిధా నాలతో అనేక భక్తవర్యులు ముక్తి పొందారు. ఇందులో ముఖ్యంగా శ్రవణ భక్తిచేత పరీక్షిన్మహారాజు, సంకీర్తనంచేత శుకమహర్షి, సంస్మరణ మాత్రంచేత ప్రహ్లాదుడు, అర్చనంచేత లక్ష్మీదేవి, పూజచేసి పృథువు, వందనంచేత అక్రూరుడు, దాస్యంచేసి హనుమంతుడు, సఖ్యంచేసి అర్జునుడు, ఆత్మ నివేదనంచేసి బలిచక్రవర్తి వైకుంఠం పొందారు.

శ్రీవిష్ణోః శ్రవణే పరీక్షి దభవద్వైయాసకిః కీర్తనే
ప్రహ్లాదస్మరణే తదంఘ్రి భజనే లక్ష్మీః పృథుః పూజనే
అక్రూర స్త్వభినందనే కపి పతి ర్దాస్యేతు సఖ్యేఽర్జునః
సర్వస్యాత్మ నివేదనే బలి రభూత్ కృష్ణాప్తి రేవం పరః 3

35 సూ. తత్తు విషయ త్యాగాత్ సంగ త్యాగా చ్చ

ఆ భక్తి ఇంద్రియ వికారాలూ, విషయ వాంఛలూ, స్నేహాలూ, చర్చలూ, పరి త్యజించటం వల్లనే వృద్ధిపొందుతుంది.

ప్రతి జీవుని హృదయంలో కొద్దో గొప్పో ప్రేమరసం ప్రవహిస్తూనే ఉంటుంది.

---

1 ఆంధ్రభాగవతం 2, 3. మహాభాగవతం

ప్రశాంతుడూ పరమ ప్రేమ స్వరూపుడూ అయిన భగవంతుని యొక్క చిదంశం- జీవుడు. కానీ ఈ జీవుని ప్రేమ విషయాలవైపు ప్రవహిస్తూండటం వల్ల అది దూషితమయింది. ఈ జీవుని ప్రేమ కామ కల్మషంలో కలవటంచేత మలినమయింది. అందుచేత జీవుని హృదయ ప్రేమరసంలో భగవంతుని దివ్య సుందర ముఖారవిందం ప్రతి ఫలించ లేకపోతోంది. ఆ ప్రేమరసం స్వచ్ఛమై, దివ్యమై తేరుకుంటే ఈశ్వర ముఖం ప్రతి బింబిస్తుంది.

కనుక ఆ ప్రేమ రసంలో కామక్రోధ విషయ కల్మషాలు కలవ కుండా చూడాలి. ఆ ప్రేమ ఈశ్వరోన్ముఖం కావాలి. అంటే విష యాలూ, విషయాసక్తులూ, త్యజించాలి.

'విషయ సుఖాలలో లీనమైకూడా భగవంతుని చేరుకోవచ్చు' అనీ, 'భగవద్భక్తికి విషయ భోగాలు ఆటంకాలు కావు' అనీ కొందరి తలంపు.

కానీ అది పొరపాటు. భక్తుని మనస్సు విషయాల విషవల యాలలో సుళ్ళు తిరుగుతుంటే భగవచ్చింతన ఎలా సాధ్యం?

నిజమైన భక్తునికి భోగించు వస్తువూ, భోగమూ లేదు. అంతా భగవంతుడే భగవంతుడొక్కడే వానికి ముఖ్యాధారం. వానికి భోగమూ, భోగ్యమూ భగవంతుడే.

పురుషోత్తముడు ఒక్కడే పురుషుడు. మిగిలినదంతా స్త్రీప్రకృతి. భక్తుడు తాను పురుషుడ ననుకొని భోగాలకు పరుగులెత్తతాడు.

విషయ భోగాలలో శరీరం మునిగి ఉంటే మనస్సు పరమేశ్వరుని సేవించటం అసంభవం. విషయభోగాలు త్యజించటం భక్తునికి చాలా అవసరం. మనస్సు ఏ వస్తువుపైన నిలవాలన్నా ప్రథమంగా ఇంద్రి యాలను జయించాలి.

విషయాన్ ధ్యాయత శ్చిత్తం విషయేషు విషజ్జతే
మా మనుస్మరత శ్చిత్తం మయ్యేవ ప్రవిలీయతే 1

విషయ భోగాలను, సంసారలంపటాలను గూర్చి ఆలోచిస్తూంటే అందులోనే ఆసక్తి, లాలస పెరుగుతూ ఉంటుంది. నన్నుగూర్చి అంటే భగవంతునిగూర్చి స్మరణ శ్రవణ చింతనాదులు చేస్తూ ఉంటే మనస్సులో భగవద్భక్తి మాత్రమే వ్యాపిస్తుంది. మనస్సులో ఏది మననం చేస్తుంటే అటువైపే ఆలోచనలు పరుగెత్తు తుంటాయి. కాము డుండే మనస్సులో రాముడుండలేడు. రాముడుండే మనస్సులో కాము డండడు.

సంగం రెండు విధాలు:- (1) వంధ్య సంగం (2) వంద్యసంగం

1. సంసార సంబంధ వాంఛ వంధ్యసంగం. ఇది సంసార బంధ కారణం. ఇది లౌకికం, అశాశ్వతం, దుఃఖ కరం.

2. భగవత్ సంబంధిత వాంఛ వంద్య సంగం. ఇది సర్వేశ్వర భక్తికి కారణం. ఇది అమందానందప్రదం- శాశ్వతం మోక్ష శ్రీకరం. బ్రహ్మ నిష్ఠులకిది సాధ్యం.

శంఖచక్ర గదా హస్తో దేహో వివిధయే హాయా
వంద్య సంసక్తి వశతః పరిపాతి జగత్రయం 2

ఈ విష్ణ్వంశ మూడులోకాలు పాలిస్తూ ఉన్నది.

'సంగ త్యాగాచ్చ' అంటే వంధ్య సంగం సంసారహేతువు. కావున ఈ వంధ్య సంగం పరిత్యజించు అని.

---

1. శ్రీ భాగవతం 2. జ్ఞానవాశిష్ఠం

ఈ సూత్రంలో విషయ త్యాగంతోపాటు ఇచ్ఛా త్యాగంకూడా నొక్కి చెప్పాడు.

త్యాగః స్నేహస్య యత్త్యాగో
విషయాణాం తథైవ చ 1

విషయం విషయేచ్ఛాదులు రెంటినీ త్యాగం చేయటమే త్యాగం. ఇది నిజమైన నిష్కళంక త్యాగం.

కాబట్టి విషయానురాగ రహిత హృదయం పవిత్ర దేవాలయం. భగవత్ ప్రేమ యొక్క ప్రభావంతో విషయత్యాగం సహజంగా కల్గుతుంది

మయ్యర్పితాత్మనః సభ్య, నిరపేక్షస్య సర్వతః
మయాఽఽత్మనా సుఖం యత్తత్ కుతః స్యాద్ విషయాత్మనామ్ 1

ఉద్ధవా! మనస్సు సమర్పణ చేసి విషయలాలసను విడిచిన ఆత్మ స్వరూపులకు లభించే పరమ సుఖం సామాన్యులకు ఎక్కడ లభిస్తుంది! కనుక విషయాలే కాదు. మానవ సంబంధాలు కూడా మాని నన్ను సేవించాలి భక్తుడు.

పుత్ర దార గృహక్షేత్ర భూరి విషయ
ఘనసుఖా సక్తు డగుచు ఏ మనుజు డేని
అర్థి జరియించు వాడు భవాబ్ధి లోన
జెంది ఎన్నాళ్ళకును దరి జేర లేడు 3

---

1. మహాభారతం శాంతిపర్వం 192 17
2. ఆంధ్ర మహాభాగవతం 11-14-12
3. ఆంధ్రమహాభాగవతం 10 ఉ.భా 1228.

36 సూ. అవ్యావృత్త భజనాత్

అఖండ నామసంకీర్తన వలన భక్తికి సాధనం అబ్బుతుంది.

భజన భక్తికి ప్రధానసోపానం. ఇది సాధన-సాధ్యం కూడా. భగవద్భక్తులు సహజంగా నిరంతరం నామ సం ర్తన చేస్తుంటారు. వారి అవయవాలు ఇంద్రియాలు ఏ పనిచేస్తున్నా మనస్సు మాధవుని మననం చేస్తునే ఉంటుంది. ఇది అభ్యాసం చేయటం భక్తులకు అత్యవసరం. భజన లేకుండ భగవద్భక్తి కలుగదు.

తివిరి ఇసుమున తైలంబు తీయవచ్చు
తిరిగి కుందేటి కొమ్ము సాధింపవచ్చు

ఈ మాట సంగతి ఏమోకాని-

భజన లేకుండా హరిభక్తి బడయలేరు
తత్త్వ మరయక భవవార్ధి దాటలేరు.

అనుమాట మాత్రం సత్యం. భక్తికి భజన అనివార్యసాధనం. విషయ భోగ వైముఖ్యం కల్గితే వైరాగ్యం కల్గుతుందే కానీ భక్తి సాఫల్యం మాత్రం కల్గదు. భ వైరాగ్యం రెండూ కల్గితే విశుద్ధమైన భగవత్ ప్రీతి లభ్యమానమవుతుంది.

అనుక్షణం జరిగేదే అఖండ భజన.

"సతు దీర్ఘకాల నైరంతర్య
సత్కార సేవితో దృఢభూమిః" 1

---

1. పతంజలి యోగదర్శన్

'దీర్ఘకాల పర్యంతం నిరంతర సత్కార పూర్వకంగా ఆచరిస్తేనే అభ్యాసం దృఢమవుతుంది '

ఇలాంటి అఖండ అచంచల సంకీర్తనాది ప్రార్థనాభ్యాసం వల్లనే భగవత్ ప్రీతి సులభంగా లభిస్తుంది.

అనన్య చేతాః సతతం యోమాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః 1

ఓ అర్జునా! ఎవడు ఏకాగ్ర చిత్తంలో నిరంతరం నన్ను సంస్మరణ చేస్తాడో అట్టి యోగికి నేను అతిసులభుడను.

ప్రహ్లాదాది భక్తవర్యులవలె క్షణం కూడా మరవకుండా ఎడ తెగకుండా నామస్మరణ చేయటం వలన మనస్సు పరమపవిత్రం అవుతుంది. అనన్య భక్తి కుదురుతుంది.

నామస్మరణ ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో పాటు జరిగిపోతుండాలి. అభ్యాసం దృఢమైతే మనస్సు సంకల్ప రహితమైన భగవంతునిలో లయ మవుతుంది. భక్తులందరూ ఇలా చేసి తరించినవారే. మనస్సు లయం కావడమే ముక్తి అంటారు.

'స్వాసా మాహీం జపే తేం దుబిధా రహే న కోయ్'
'సాంస సాంస సుమిరన కయ్, యహ ఉపాయ అతినీక్' 3

జపస్తు సర్వధర్మేభ్యః పరమో ధర్మ ఉచ్యతే
అహింస యా చ భూతానాం జపయజ్ఞ ప్రవర్తతే 4

ఇతర యజ్ఞాలలో ఏదైనా హింస ఉంటుందేమో కానీ జపయజ్ఞంలో ఏ విధమైన హింస ఉండదు. ఈ జపయజ్ఞం స్త్రీ పురుషాదులెల్లరు చేయవచ్చు. మననం వలన మంత్రం అధిక ప్రభావం చూపుతుంది. మంత్రం విడవకుండా జపించాలి.

---

1. భగద్గీత 2. మహాభారతం 3. చరణదాసు 4 కబీరుదాసు

సాధన దృఢం కావాలి అంటే దీర్ఘకాలం జపతప ధ్యానాదులు అభ్యసించాలి. ఇందులో అనేక భంగపాట్లు వస్తుంటాయి. అయినా దృఢ నిశ్చయంతో అడ్డంకులు దాటి ఈ భక్తి వ్రతం సాగించాలి. ఎన్ని విఘ్నాలు వచ్చినా లెక్కించకుండా ముందుకు నడుస్తారు మహాత్ములు. భర్తృహరి ఇలా అన్నాడు–

ఆరంభింపరు నీచ మానవులు విఘ్నాయాస సంత్రస్తులై
ఆరంభించి పరిత్యజింతు రురు విఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్న నిహన్య మానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్

37 సూ. లోకేఽపి భగవద్గుణ శ్రవణ కీర్తనాత్

భక్తుడు జనమధ్యంలో ఉన్నాకూడా భగవద్గుణ శ్రవణ ర్తనాది అభ్యాసం వలన భక్తి సుస్థిరమవుతుంది.

నామ సంకీర్తన చేస్తూ సమస్త ఇంద్రియాలు భగవత్ సేవలో అనన్యంగా నిమగ్నం కావాలి. శ్రవణం స్మరణం కీర్తనం వలన భక్తి సాధ్యమవుతుంది. నామ జపం చేస్తూ సంసార సంబంధమైన వార్తలు వింటూ దృశ్యాలు చూస్తూకూడా మనస్సును ఏకాగ్రతలో నిల్పగల సంయమికే ఇది సాధ్యం. అభ్యాసం వలన మనస్సు నిలుస్తుంది.

భగవన్నామం అమోఘ శక్తిని ప్రసాదిస్తుంది. అట్టి నామ శ్రవణం చేయని చెవులు చెవులు కావు. నామం పలుకని నాలు నాలుక కాదు.

కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సుర రక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము

విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి

దేవ దేవుని జింతించు దినము దినము
చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు
కుంభినీధవు జెప్పెడి గురుడు గురుడు
తండ్రి! హరిజేరు మనియెడి తండ్రి తండ్రి 1

మానవుడై పుట్టినందుకు భగవద్భక్తి అలవరచుకోవాలి. జన్మ సార్థక్యం చెందాలి. నిద్రాహార మైథునాదులు పశువులకు మానవులకు సమానం. కానీ మానవునకొక విశిష్టమైన జ్ఞానం, సదసద్వివేకం ప్రత్యేకంగా ప్రసాదించాడు భగవానుడు. ఈ జ్ఞానం మరచినవాడు ద్విపాద పశువు వాసుదేవుని వర్ణించని వాణి వ్యర్థం. మాధవుని మననం చేయని మనస్సు మనస్సుకాదు.

సంతానానికి పెట్టుకున్న, భగవన్నామం తోకానీ, పరిహాసంగా కానీ, తెలిసి కానీ తెలియకకానీ, రాముని స్మరిస్తే పాపపుంజాలు అగ్ని పైబడిన దూదివలె భస్మమవుతాయి.

భగవన్నామం జపిస్తే చండాలుడైనా మానవ శ్రేష్ఠుడై యజ్ఞయాగాలు చేసిన జ్ఞానియొక్క పుణ్యంతో సమమైన పుణ్యం పొందుతాడు.

కష్టంలోనో, కాలుజారితేనో 'రామా' అంటే వచ్చి రక్షించే రామచంద్ర దయాళువు సంతోషంగా భక్తితో నామస్మరణ చేస్తే ఆనందంగా కాపాడడా! తప్పక కాపాడతాడు. అని భాగవతం ఘోషిస్తున్నది.

---

భాగవతం సప్తమ స్కంధం - 169.

బ్రహ్మహత్యానేక పాపాటవుల కగ్ని
  లలు హరినామ కీర్తనములు
గురుతల్ప కల్మష క్రూర సర్పములకు
  కేకులు హరినామ కీర్తనములు
తపనీయ చౌర్యసంతమసంబు నకు సూర్య
  కిరణముల్ హరినామ కీర్తనములు
మధుపాన కిల్బిష మదనాగ సమితికి
  కేసరుల్ హరినామ కీర్తనములు
మహిత యోగోగ్ర నిత్యసమాధి విధుల
నలరు బ్రహ్మాది సురులకు అందరాని
భూరి నిర్వాణ సామ్రాజ్య భోగభాగ్య
ఖేలనంబులు హరినామ కీర్తనములు 1

38 సూ. ముఖ్యతస్తు మహత్కృప యైవ
భగవత్కృపా లేశాద్వా

ముఖ్యంగా మహాపురుషుల దృష్టి పడాలి. తర్వాత భగవత్ కటాక్షం కొంచం ఉంటే చాలు. భగవద్భక్తి యోగం లభిస్తుంది.

మహాపురుషుల కృప ఉంటే భక్తి తేలికగా లభిస్తుంది. అటువంటి మహాపురుష కృపా భాగ్యం కలగటం చాలా దుర్లభం. ఆ మహాత్ముల వాత్సల్యానికి పాత్రులు కావటం అంటే కఠినాతి కఠినం. వారి సాంగత్యంతో విషయ వాసనాజాలం పటాపంచలవుతుంది. వారి సత్సంగంతో హరి గుణస్మరణ కీర్తనాదుల అభ్యాసం కల్గుతుంది.

1. భాగవతం షష్ఠస్కంధం 118.

ఆ మహానుభావులు కేవలం శాస్త్రజ్ఞులు, సదాచార సంపన్నులు, నిష్ఠా గరిష్ఠులు, శీల ప్రభావులు మాత్రమే కాదు భగత్తత్త్వం సంపూర్ణంగా తెలిసి అనన్య భక్తి రసాబ్ధిలో తేలియాడే పరమ హంసలని గమనించాలి. అట్టివారి సత్సంగం సామాన్యులపై దివ్య ప్రభావాన్ని కలిగిస్తుంది.

సూత మహర్షి ఇలా అన్నాడు :-

ఓ సౌమ్య! భగవత్ సాంగత్యంగల మహాత్ముల స్నేహం స్వల్పంగా లభించినా దాని ప్రభావం ఇంతఅని చెప్పలేము. స్వర్గాదుల కంటె, త్రిభువన రాజ్యభోగాలకంటె మహాత్ముల స్నేహం చాలగొప్పది. దేనితోనూ అది సరితూగదు." 1

ఇదే విషయాన్ని తులసీదాసు ఇలా పలికాడు —

తాత స్వర్గ అపవర్గ సుఖ ధరిఅ తూలా ఏక అంగ
తూల న తాహి సకలమిలి జో సుఖ లవ సతసంగ 2

స్వర్గ అపవర్గ సుఖాలన్నీ కలిసినా సత్సంగం యొక్క మహత్వం ముందు సరిరావు. అట్టి సత్సంగం ఏ కొద్దిగా లభించినా అంతఃకరణాన్ని పరిశుద్ధం చేసి కైవల్య మార్గానికి చేరువ చేస్తుంది.

హరి కరుణా కటాక్ష ప్రాప్తికి దోహదం కల్గజేసేది గురుకరుణా కటాక్షం. గురుకటాక్షం కోసం బుద్ధిమంతుడైన భక్తుడు మహాత్ములను సేవిస్తాడు. మహా మహుల కృపతో ముక్తియేకాదు, పూర్ణ భక్తి కూడా లభిస్తుంది. కాగా ముక్తి భక్తిని ఆటంక పరుస్తుందని భక్తుడు ముక్తిని తిరస్కరిస్తాడు. "పరమాత్మ మేధాశక్తిచే కానీ విద్యాప్రవచనాదులచే కానీ లభ్యంకాడు. ఆ పరమాత్మకు ఎవనిపై దయకల్గునో వానికే భగవత్తత్త్వం అవగాహన అవుతుంది."

---

1. శ్రీమద్భాగవత ప్రథమస్కంధం 18-13
2. రామచరిత మానస్

నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహుల నా, శ్రుతే న
యమే వైష వృణుతే తేన, లభ్యః
తస్యైష ఆత్మా వివృణుతే తేన తనుం స్వామ్ 1

సాధువుల ప్రసంగాలు ఉత్సాహాన్ని శ్రవణానందాన్ని మాత్రమే కాదు. పరమానందాన్ని కూడా కల్గిస్తాయి.

సతాం ప్రసంగాత్ మమ వీర్య సంవిదో
భవంతి హృత్కర్ణ రసాయనాః కథాః
తజ్జోషణా దాశ్వపవర్గ వర్త్మని
శ్రద్ధారతిః భక్తి రనుక్రమిష్యతి 2

39 సూ. మహత్సంగస్తు దుర్లభో అగమ్యో అమోఘశ్చ

మహా పురుషుల సాంగత్యం, దుర్లభం, అగమ్యం, అమోఘం. మహాత్ముల సందర్శనం అతిదుర్లభం. అది ఎప్పుడు ఎలా అబ్బుతుందో ఊహించలేము. అటువంటి వారి సందర్శనం అద్భుత ఫలితాలను ప్రసాదిస్తుంది.

మహాత్ములు భగవదారాధనలో, ఆత్మరతిలో, తన్మయత్వంలో, సమాధిలో జపతపాదులలో నిరంతరం నిమగ్నమై ఉంటారు. వారు సాధరణంగా జన సందోహంలోనికి రారు. ఎప్పుడన్నా వచ్చినట్లైతే అది ఆ పృథ్వి చేసుకున్న పుణ్యం. ఎన్ని జన్మల ఫలంవల్లనో మహాత్ముల సందర్శనం లభిస్తుంది. వారి పాద పద్మాలు సేవించే మహా భాగ్యం ఏ కొందరికో కల్గుతుంది. ఇది సాధారణంగా సాధ్యం కాదుకనుక ఇది దుర్లభం.

1 ముండకోపనిషత్ 2 శ్రీమద్భాగవతం

'వానిది భాగ్యవైభవము వానిది పుణ్యవిశేష మెట్టిదో యిన్
వాని దవంధ్య జీవనము వానిది జన్మము వేరుసేయకె
వ్వాని గృహాంతరంబున భవాదృశ యోగి జనంబు పావన
స్నాన విధాన్న పానముల సంతస మందుచు బోవునిచ్చలున్' 1

అని ప్రవరాఖ్యుడు సిద్ధపురుషుల సేవించు గృహస్థులను గూర్చి చేసిన ప్రశంస ఇది. సిద్ధపురుషుల మాటలు మహిమాన్విత మంత్రాలు వారి పాద పవిత్ర అమలతోయం ఆకాశగంగా జలం.

శీలసంపన్నుడు, ధర్మకర్మదీక్షా పరతంతుడు అయిన ప్రవరాఖ్యుడు ఎన్నెళ్ళగానో తీర్థ సంవాసులను సేవించగా, ఒక్క సిద్ధుడు అనుకోకుండా లభ్యమైనాడు. అది దుర్లభం మైన భాగ్యం ఆయనకు లభించింది.

ప్రవరుడు 'నను మీ శిష్యునిగా స్వీకరించవలసిందని' ప్రార్థించాడు. గురు కరుణాకటాక్షం వానిమీద పడింది. ఆతడు వెంటనే మహిమాలయమైన హిమాలయం సందర్శించకలిగాడు.

'అభ్యాగతః స్వయం విష్ణుః' సిద్ధస్వరూపులు విష్ణుస్వరూపులు. ఇట్టి మహాత్ములు రత్నాలవలె అరుదుగా ఉంటారు. ప్రపంచమంతా వెతికినా ఒకరో ఇద్దరో కనిపిస్తారు. వారి సాంగత్యం దుర్లభం. వారి కృపాఫలం అమోఘం. ఆ ఫలితాలు అత్యాశ్చర్యకరాలు.

అనిశ మాచార్య సేవ కల్గిన జనులకు
దేవ భూదేవ తీర్థ సంసేవ లేల!
అనిశ మాచార్య సేవ కల్గని జనులకు
దేవ భూదేవ తీర్థ సంసేవ లేల! 2

1. పెద్దన మనుచరిత్ర - ప్రథమ 63
2. సారంగు తమ్మయ్య వైజయంతీ విలాసం

ఆచార్య సేవకల్గినపుడు ఆ శిష్యులకు, భక్తులకు దేవబ్రాహ్మణ తీర్థాది పూజలు అవసరంలేదు. ఆచార్య సౌభాగ్యం లభించనపుడు దేవ బ్రాహ్మణాది సేవలవలన ఫలితం లేదు అని విశిష్టంగా పలికాడు తమ్మయ కవి.

40 సూ. లభ్యతేఽపి తత్కృపయైవ

భగవత్ కృపా ప్రసాదం చేతనే మహాత్ముల సందర్శనం, సాంగత్యం, సంసేవనం, ప్రాప్తిస్తాయి.

ఎన్నో జన్మల పుణ్యఫలం వలన కానీ హరికృప కల్గదు. హరికృప వల్లనే మహా గురూత్తముల సందర్శన భాగ్యం కల్గుతుంది. భగవంతుడు ఎవరిని ఎప్పుడు ఉద్ధరించాలి అనుకుంటాడో వాని దగ్గరకు తానే మహాత్ములను పంపిస్తాడు లేదా స్వయంగా ఏదో రూపంలో వస్తాడు.

భగద్విలాసం సాధుసాహసం పరస్పర ఆశ్రితాలు. సాధు సహావాసం లేకుండా భగవత్కృపాలేశం ప్రాప్తం కాదు. భగవత్ కృపాలేశం లేకుండా సాధుజన సందర్శనమే కాదు.

హనుమంతుని సాంగత్యం కలిగిన తదుపరి కానీ విభీషణునికి రామ రసానుభవం కల్గలేదు.

అబమొహి భా - భరోస - హనుమంతా
బిను - హరి - కృపా - మిలహిఁ - సంతా 1

శ్రీహరి ప్రేరణతోనే శుకమహర్షి హస్తిపురికి వచ్చాడు. శ్రీ శుకమహర్షి ఉపదేశంతో పరీక్షిన్మహారాజుకి శ్రీహరి కరుణామృతం లభించింది. అమృత పదం ప్రాప్తించింది.

నందమహారాజు గృహానికి గర్గ గురూత్తముడు దయచేశాడు. గర్గ మహర్షి అద్వితీయ జ్యోతిశ్శాస్త్ర వేత్త, బ్రహ్మజ్ఞాని, మహాత్ముడు, అందరికి హితుడు, యదువంశ పురోహితుడు.

మహాత్ముడు వస్తాడని అనుకోలేదు నందుడు. గర్గుని చూచి పరమానందుడైన నందుడు ఇలా సంస్తుతిస్తాడు.

ఊరక రారు మహాత్ములు
వా రధముల యిండ్లకడకు - వచ్చుట లెల్లన్
కారణము మంగళములకు -
నీ రాక శుభంబు మాకు నిజము మహాత్మా! 1

మంగళము చేకూర్చ వలసినపుడు మాధవుడు మహాత్ములను భక్తుల దగ్గరకు తానే పంపుతాడని ఇందు విదితమయింది.

41 సూ. తస్మిన్‌స్తజ్జనే భేదాభావాత్

భగవంతునికి భగవద్భక్తులకు భేదం లేదు.

భగవంతుని సాయుజ్యం పొందిన భక్తులు భగవంతుని స్వరూపులు. ఈశ్వర సాన్నిధ్యం పొందినవాడు ఈశ్వరుడే. అపుడు భక్తుడు భగవానుడై సంచరిస్తాడు. పరులను పలకరిస్తాడు, కరుణిస్తాడు, కల్యాణ మార్గం చూపిస్తాడు. మనుష్యుడు భ్రమరకీట న్యాయంగా తాను తలంచే రూపు తాలుస్తాడు అనికదా శాస్త్ర వాక్యం!

"బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" బ్రహ్మజ్ఞానం తెలిసిన మహాత్ముడు బ్రహ్మ స్వరూపుడే. అలాగే భాగవతుల సేవ భగవత్ సేవ. 'తత్త్వమసి', 'సోఽహమ్' మొదలైన మహా వాక్యాల భావం ఇదేకదా.

---
1. ఆంధ్రమహాభారతం దశమ పూ. 284

కృష్ణ భగవానుడు ఇలా పలికాడు -

"సాధువు నా హృదయంలో ఉంటాడు. నేను సాధువు హృదయంలో ఉంటాను. ఆ మహాత్ములు నన్నుతప్ప ఎవరినీ ఎరుగరు. నేను వారిని విడిచి మరొకరిని ఎరుగను" 1

యే భజంతి తు మాం భక్త్యా
మయి తే తేషు చాప్యహమ్ 2

నన్ను ప్రేమతో భజించేవారు నాలోనూ, నేను వారిలోనూ లీనమైపోతాము. భక్తులు తన్మయులై బాహ్యం విస్మరించి కృష్ణ లీలలు స్మరించి స్మరించి కృష్ణ రూపమే తాము పొందుతారు.

42 సూ. తదేవ సాధ్యతాం తదేవసాధ్యతామ్

అదియే సాధించాలి. అదియే అందుకోవాలి.

భక్తులకు భగవంతుని సారూప్యం పొందిన భక్తవరేణ్యుల సహవాసం, వారి కృపాసౌభాగ్యం అవశ్యం పొందదగినవి. భగవత్ ప్రేమ కావలెనంటే భాగవత శ్రేష్ఠులను సేవించాలి. సత్సంగంవలన పాపజాలం పటాపంచలవుతుంది.

లోకంలో ఒకవ్యక్తి యొక్క ప్రేమాభిమానాలు పొందాలంటే ఆ వ్యక్తికి తెలిసినవాణ్ణి పట్టుకోవాలి. ముందు వీణ్ణి సంతుష్టి పరచాలి. అపుడు వీడు చెప్పినట్లు అవతల వ్యక్తికిష్టమైనవి తెలుసుకొని అవి కఠినాలైనా సంపాదించి అవతల వ్యక్తి యొక్క అభిమానం పొందాలి. అలానే భగవంతుణ్ణి బాగా ఎరిగిన భక్తుణ్ణి పట్టుకొని ఆ భక్తునిద్వారా ఆయన మార్గదర్శకత్వంలో నడిచి భగవంతుని చేరుకోవాలి.

1. శ్రీమద్భాగవతం నవమస్కంధం 4-38.
2. భగవద్గీత

మాధవ ప్రేమ అందరికీ అర్థమయ్యేదీ కాదు, లభ్యమయ్యేదీ కాదు కృష్ణుడు తన సఖుడైన ఉద్ధవునికి ప్రేమపాఠం చెప్పాలి అనుకొన్నాడు. ఉద్ధవుని పరీక్షించాడు. ఉద్ధవునిలో 'నేను జ్ఞానిని, జ్ఞానయోగ మార్గాలే మోక్షప్రదాలు' అనే కించిత్తు గర్వం ఉంది. కృష్ణుడు అది పోగొట్టటంకోసం ఉద్ధవుణ్ణి గోపికలచెంతకు పంపాడు.

ఆ పరమ ప్రేమ తత్త్వం ఆ ప్రేమానుభవం ఉన్నవారికే తెలుస్తుంది. అది శాస్త్రాలకు తర్కాలకు అందదు.

పరమప్రేమ అనే భక్తి హృదయ సంబంధి. కనుక భగవంతుని ప్రేమ తత్త్వం ఆ ప్రియురాండ్రకే తెలుస్తుంది. అది అనిర్వచనీయం, అనుభవైకవేద్యం.

గురువు కొత్తగా వచ్చిన శిష్యుని అనేక విధాల పరీక్షించి ఉపదేశం పొందటానికి పాత్రుడు అని తేల్చుకొన్న తర్వాతనే శిష్యునిగా స్వీకరిస్తాడు. గర్వం పోగొట్టి సర్వం బోధిస్తాడు. అయోగ్య శిష్యులను గురువు స్వీకరించడు.

అట్టి వాడే నిజమైన గురువు. గురు కృపకై ఎన్నేళ్ళో తపస్సు చేయాలి. భక్తుడు హృదయాన్ని కామనా రహితంగా, సదాచార భరితంగా, భక్తిరస మహితంగా తీర్చి దిద్దుకోవాలి.

మనసా వాచా కర్మణా భక్తుడు భక్తికై తపించాలి. జపించాలి. భక్తి భావనా సుధను వర్షించాలి. అప్పుడు భాగవత శ్రేష్ఠుడైన ఆ గురువు భగవంతుని దగ్గరకు వెళ్ళే సులభమైన మార్గం చూపుతాడు.

భగవంతుడే తన దివ్య ప్రేమ యొక్క ప్రచారం కోసం, లోకోద్ధరణ కోసం, ముక్త పురుషులను లోకంలోకి పంపుతుంటాడు. భగవంతుడు కరుణామయుడు. భక్తులు అవ్యాజపరోపకార పరాయణులు. వారు తమ దర్శన, స్పర్శన, భాషణలతో ప్రేమప్రదానం చేస్తారు. అందులకై యోగ్యులైన భక్తులను చేరదీస్తుంటారు.

ఆ ముక్తపురుషుల కర్తవ్యమే ఇది. కనుక మానవులారా! మహా భాగవత వరేణ్యుల పాదరేణువులను శీర్షాలపై తాల్చండి. వారి కృపా దృష్టి లేశమైనా సంపాదించండి. సత్సంగం పొందండి. ఇది వంద్యా సంగం. నివృత్తి మార్గానికి సోపానం.

ఈ సత్సంగంతో నిత్సంగత్వం, దానితో నిర్మోహత్వం, దానితో నిశ్చల భక్తి తత్త్వం, దానితో జీవన్ముక్తి లభిస్తుంది. గోవిందుని భజించరా మూఢా! పాండిత్యం పనికిరాదురా! అంటాడు శంకర భగవత్ పాదులు—

సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చల తత్త్వం
నిశ్చల తత్త్వే జీవన్ముక్తిః 1



భజగోవిందం భజగోవిందం
గోవిందం భజ మూఢమతే
సంప్రాప్తే సన్నిహితే కాలే
నహి నహి రక్షతి డుకృఞ్ కరణే 2



1. శంకర భగవత్పాదులు. భజగోవిందామృతం - 9. 1

# దుస్సంగ నాగిని

43 సూ. దుస్సంగః సర్వథైవ త్యాజ్యః

దుర్జన సాంగత్యం సర్వథా త్యజించాలి.

దుష్ట స్నేహం భక్తికి బాధాకరం. అవశ్యం దీనిని విడిపించుకోవాలి. సత్సాంగత్యం ఎంత మేలు చేస్తుందో ఎంత ఉపకారం చేస్తుందో దుస్సాంగత్యం అంత కీడుచేస్తుంది. అంత అపకారం చేస్తుంది. ఇది పూర్తిగా నిషేధింప దగింది.

సత్సాంగత్యం వలన భగవత్ కథాశ్రవణం, భాగవత చర్చ, భగవత్ ప్రీతి, సదసద్వివేకం, సేవాభావం, పరోపకార పారాయణత, నమ్రత, వినయం, ఓర్పు, బ్రహ్మచర్య అభ్యాసం, సాధుసాంగత్యం కర్త్వరాహిత్యం, క్షాంతి, శాంతి, శమం, దమం, మొదలైన సద్వృత్తులు పొంది మానవుడు మహనీయుడు అవుతాడు.

అలానే దుస్సంగతి వలన దుష్ట సాహిత్య పఠనం, విషయ వాంఛా విజృంభణం, పరనింద, భోగాసక్తి, అవివేకం, ఓర్వలేనితనం, కాముకత, దురభ్యాసాలు, గర్వం, మదం, మోహం, అసహిష్ణుత, అపవిత్రత, అశాంతి, సోమరితనం, హింసాప్రవృత్తి, అసత్యవాదిత్వం, దురభిమానం

ఆదిగాగల దుష్ప్రవృత్తులు ప్రకోపిస్తాయి. అపుడు మానవుడు దానవుడై సంఘద్రోహి, లోకకంటకుడు క్రూరుడు అవుతాడు. మానవునిలోని ఆసురీ ప్రవృత్తుల విజృంభణతో దైవీ ప్రవృత్తులు నశిస్తాయి.

'మూర్ఖసాంగత్యం దీర్ఘ దుఃఖప్రదం. అవివేకులతో చేరటం శత్రుమధ్యంలో ఉన్నట్లే. విజ్ఞుల సంపర్కం బంధు సమాగమం వలె సౌఖ్యప్రదం.' 1

మంథర యొక్క సాంగత్యం వలన ప్రేమమూర్తి అయిన కైకేయి ప్రాణపతిని పోగొట్టుకొంది. కన్నబిడ్డకు దూరమయింది. అయోధ్యా ప్రజల కోశాక సత్వాలకు దుఃఖ కారణమై నిందలు పడింది.

దుష్ట చతుష్టయమైన శకుని కర్ణాదులవలన సుయోధనుడు గర్వించి మహాభారత యుద్ధానికి సిద్ధమైనాడు. సర్వనాశనమైనాడు. శాశ్వత దుష్కీర్తి నెత్తిన వేసుకొన్నాడు.

శ్రీరాముడు విభీషణునితో అన్నాడు-

"ఓ విభీషణా దుష్ట సహవాసం కంటె నరకవాసం శ్రేష్ఠం. విధాత ఎట్టి వానికినీ దుస్సాంగత్యం కలుగనీకుండుగాక!"

కపిలదేవుడు దేవహూతితో ఇలా అన్నాడు-

'దుష్ట సహవాసియై, కామ వాసనాలంపటుడైనవాడు అంధకారంలో పడతాడు. వాడు దయాదాక్షిణ్యాలూ, ధనం, మానం, శీలం, యశస్సు, సత్యం, అహింసాది సుగుణాలు కోల్పోతాడు. ఇంద్రియ చాపల్యం వలన అశాంతి పొంది బుద్ధి నశించి భ్రష్టుడవుతాడు. కనుక దుష్ట సాంగత్యం పరిత్యాజ్యం'

సామాన్యులకే దుస్సాంగత్యం దూష్యం అయితే భక్తుల విషయంలో ఇది మహాపకారి.

---

1. దమ్మపదము - 16-11

దుష్ట సాంగత్యం అంటే కేవలం దుర్మార్గులైన వ్యక్తుల సంబంధం అనే కాదు, కామ మదమోహ లోభాది ఆలోచనలు కూడా ఇందులోకి వస్తాయి. ఇవి భగవద్భక్తికి ఆటంకాలు, కంటకాలు.

భక్తుడు కాగోరేవాడు చెడుదృశ్యాలు చూడరాదు. చెడు అనరాదు. చెడు సంగతులు వినరాదు. వాటినిగూర్చి చర్చించరాదు. ఏకాంతంగా కూడా వాటిని గూర్చి ఆలోచించరాదు. దృశ్యం మనస్సుపై ముద్ర వేస్తుంది. మనస్సు ఆలోచిస్తుంది. సన్మార్గ పతనం ప్రారంభమవుతుంది.

క్షుద్ర సాహిత్యం మహాపరిమాదాన్ని తెచ్చి పెడుతుంది. సామాన్యుల జీవితాలనే నాశనం చేస్తుంటాయి. ఇది అన్ని వర్గాల మానవులకు నిషేధమే.

మనసు ఆలోచించిన దానిని బుద్ధి నిర్ణయం చేస్తుంది. బుద్ధి బలహీనమైన స్థితిలో ఉంటే అది నీచనిర్ణయాలు తీసుకుంటుంది. కనుక బుద్ధిని తన అధీనంలో సుశిక్షణాయుతంగా నిలబెట్టుకోవాలి. భక్తుడు ముఖ్యంగా ఈ దిగువ పది విషయాలలో జాగ్రత్త పడాలి :-

1 నివాసం 2 ఆహారం 3 పానీయం 4 కుటుంబం 5 పరిసరం 6 దృశ్యం 7 సాహిత్యం 8 ఆలోచన 9 ఉద్యోగం 10 ఉపవాస విధానం.

ఇవి సాత్వికంగా ఉండి భక్తికీ శీలాని దోహదం చేసేటట్టు చూసుకోవాలి. ఇవి సాత్విక దోహద కారకాలు, కాకపోతే రాజసం, తామసం పెరుగుతాయి. దుస్సంగతితో ఇవి మరీ వృద్ధి అవుతాయి. కనుక దుస్సాంగత్యం పరిత్యజించాలి-అన్నాడు నారద మహర్షి.

44 సూ. కామక్రోధ మోహ స్మృతి భ్రంశ బుద్ధి నాశ
సర్వనాశ కారణ త్వాత్

దుస్సాంగత్యం కామక్రోధాభివృద్ధికి, స్మృతి భ్రంశానికి, బుద్ధి నాశనానికి, చివరకు సర్వనాశనానికి కారణమవుతుంది.

దుర్జన స్నేహం వలన అధర్మ పూరితమైన కోరికలు గుర్రాలై పరుగులు తీస్తాయి. ఆ కామం తీరకపోయేసరికి కోపతాపాలు క్రోధ క్రాచు బుసలు కొడతాయి. క్రోధాదులవలన జ్ఞాపక శక్తి నశిస్తుంది. కృతజ్ఞతాభావం అభావం అవుతుంది. దానితో మనిషి మేలు మరచి పోయి కృతఘ్నుడవుతాడు. దానితో మనిషిలోని సదసద్వివేకం, ఆలోచనా ధోరణి, వివేచనాజ్ఞానం నాశనం అవుతాయి. చివరకు తెలివిలేని పనులు చేసి ఉత్తముడు కూడా పతితుడు అవుతాడు.

రామ భక్తి కలవానికి కామాసక్తి పనికిరాదు. విషయ భోగాభిలాషి శ్రేయోభిలాషి కాలేడు. శ్రీకృష్ణ భగవానుడన్నాడు—

ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే
సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే
క్రోధాద్భవతి సంమోహః సంమోహాత్ స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశాద్ బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి 1

× × × ×

కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ 2

---

1. భగవద్గీత 2-63 భగవద్గీత 3-33

45 సూ. తరంగాయితా అపీమే
సంగాత్ సముద్రా యంతి

ఈ కామక్రోధాదులు ప్రథమంలో చిన్న చిన్న అలలుగా పుట్టి క్రమంగా పెద్ద సముద్రమంత అవుతాయి.

మొదట అల్పమైనవిలే అని అవగుణాల యెడల ఉపేక్ష చేస్తే అవి వెర్రితలలువేసి విజృంభిస్తాయి. అందుకనే అగ్ని శేషం, ఋణ శేషం, శత్రుశేషం ఉంచకూడదన్నారు. అవి చిన్నప్పుడే గిల్లివేయ బడితే సుఖం. కానీ అలా లేకపోతే పెద్ద ప్రమాదాలు తెచ్చిపెడతాయి.

దుష్ట సాంగత్యం అసలు అంటుకోనేకూడదు. అంటినచో వెంటనే తుడిచివేయాలి. కామం ఎడకూడా ఉపేక్ష పనికిరాదు. మొగ్గలో వంగ నిది మ్రానైతే వంగదుకదా!

కామక్రోధాలు సద్విచారానికి రవ్వంతకూడా స్థానం ఈయవు. కావున భక్తులు దోషాలను నిశ్శేషం చేయాలి. కుజన సంగతివలన పతనమైన భక్తులు పెక్కుమంది. విప్రనారాయణుడు మహాభక్తుడు, నిష్ఠా గరిష్ఠుడు, దృఢ మనస్కుడు. అటువంటివాడు. ఎలా క్రమ క్రమంగా దిగజారిపోయాడో. ఈ పద్యంలో చిత్రింపబడింది.

ఆ విప్రోత్తము వజ్ర పంజర నిభంబై నిశ్చలంబైన స
ద్భావం బంగన సాహచర్యగుణ సంపర్కంబునన్- లోహమై!
గ్రావంబై! దృఢదారువై! తరుణవృక్షంబై! ఫలప్రాయమై!
పువ్వై! తన్మకరందమై! కరగె బోబో నీళ్ళకుం బల్చనై 1

దుస్సాంగత్యం వలన మనస్సు చలించింది. క్రమంగా పతనోన్ముఖం అయింది.

---

1. జయంతీ విలాసం సారంగు తమ్మయ్య

# మాయా వాహినీ తరణి

46 సూ. కస్తరతి కస్తరతి మాయామ్? యః సంగం త్యజతి
యో మహానుభావం సేవతే నిర్మమో భవతి

ఎవడు దాటగలడు? ఈ మాయా సంసార సాగరాన్ని ఎవడు దాటగలడు?

జన సాంగత్యం త్యజించినవాడూ, మహానుభావుల్ని సేవించిన వాడూ, మమతా మమకారాలు వదలినవాడూ ఈ మాయా సముద్రాన్ని దాటగల సమర్థుడు.

మాయను తరించటానికి నారద మహర్షి పన్నెండు నియమాల అవసరం అని భావించాడు—

1 నిస్సంగత్వం 2 గురుపాదసేవనం 3 నిస్వార్థకామనం 4 ఏకాంత ధ్యానం 5 బంధ నిర్మూలనం 6 త్రిగుణాతీత భావనం 7 నిజయోగక్షేమ విస్మృతి 8 కర్మఫల త్యాగం 9 కర్మత్యాగం 10 నిర్ద్వంద్వం 11 వేదాధ్యయన త్యాగం 12 అనంత ప్రేమోపాసన.

వీటిని భక్తుడు పాటించాలి. ముందు రాబోయే సూత్రాలలో ఇవి వివరించబడతాయి.

నిస్సంగత్వం:- సంగం అంటే జన సాంగత్యం.జన సాంగత్యం భక్తి యోగంలో అవరోధాలు కలుగజేస్తుంది. దుర్జనసాంగత్యం పూర్ణ నిషిద్ధం. భక్తుడు బంధకారణమైన ఈ జన సాంగత్యాన్ని దూరంగా నెట్టివేయాలి. ఒక క్రొత్త ఈతగాడు నదిలో అలలను ప్రక్కలకు త్రోసి ఎలా ముందుకు వెళతాడో అలానే భక్తుడు అహంకారం, విషయాసక్తి, దుస్సాంగత్యం అనే సంసారసాగరంలోని అలల్ని నెట్టుకొని ఈదిఆవలకు జేరాలి. మాయా రూప వికారాలు పరిత్యజించాలి. లేనిచో భవసాగరంలో మునకలు వేయటం తథ్యం.

గురుపాద సేవ :- మహాత్ముల ఉపదేశాలు ఓడలవలె పనిచేస్తాయి. భక్తులు ఈకల్లోల సముద్రంలో దిగి ఈదకుండా ఈ ఓడలమీాద కూర్చొని సుఖంగా దాటిపోవచ్చు. భాగవతంలో భగవాన్ ఇలా అన్నాడు-

నిమజ్జ్యో న్మజ్జతాం ఘోరే
భవాబ్ధౌ పరమాయనం
సంతో బ్రహ్మవిదః శాంతా
నౌర్ధృఢే వాప్సు మజ్జతామ్ 1

సంత పురుషులు, బ్రహ్మవిదులు, శాంత చిత్తులు ఈ భవసముద్రంలో కొట్టుకుపోయే వారిని నౌకలవలె వచ్చి రక్షించి ఆవలకు దాటిస్తారు.

మాని నాథ! కుటుంబ జంబాల పటల
మగ్న మాదృశ గృహమేధి మండలంబు
నుద్ధరింపంగ ఔషధమొండు గలదె
యుష్మదంఘ్రిరజో లేశ మొండు దక్క 2

1. శ్రీమద్భాగవతం 11-26. 32 2. పెద్దన మనుచరిత్రము ప్రథమ 64

దిలీప మహారాజు నందినీ ధేనువుని అతి భక్తి శ్రద్ధలతో సేవించాడు. కఠినపరీక్షలకు నిలబడ్డాడు. ఒకసారి సింహం వచ్చి ధేనువును కబళించడానికి సిద్ధపడింది. రాజు తన ప్రాణాలనైనా వదులుతాను కాని ధేనువుకు అపకారం జరగటానికి వీలులేదన్నాడు. తన శరీరాన్ని ఆహారంగా ఇస్తానన్నాడు మాంసం ముద్దగా శరీరం సింహానికి అర్పించబడింది.

ఈ పరీక్షకు దేవతలు సంతసించారు. అపుడు నందినీ ధేనువు అంటుంది- నేను ఎవరిచేత చనిపోనులే. చిరంజీవీ !

"పుత్రా! గురువైన వసిష్ఠుని ఎడలగల నీ భక్తిచేత నేను ప్రసన్నురాలనైతిని. వరాలు కోరుకో! పాలుమాత్రమే కాదు నేను ఈప్సితార్థాలను పిదుకుతాను" అంది. కనుక గురుభక్తి అంత గొప్ప పనిచేస్తుంది.

భక్త్యా గురౌ మయ్యనుకంపయా చ
ప్రీతాస్మి తే పుత్ర! వరం వృణీష్వ ;
న కేవలానాం పయసాం ప్రసూతి
మవేహి మాం కామదుఘాం ప్రసన్నామ్ 1

జడ భరతుడు రహూగణ మహారాజుతో ఇలా అన్నాడు-

"రాజా! భగవత్తత్త్వం యొక్క అవగాహనం కేవలం యజ్ఞ జప తప దాన వేదాధ్యయనాదుల వలన, జలాగ్ని సూర్యదేవతా పూజల వలన కాదయ్యా! అది మహాత్ముల చరణ సరోజ సంసేవన చేసి ఆ ధూళి శిరస్సున దాల్చినందు వలననే లభిస్తుంది" 1

మహాత్ముల పరిచర్య త్రికరణ శుద్ధిగా అనుక్షణం చేయాలి. ఎన్ని కఠిన పరీక్షలు ఎదురైనా తట్టుకోవాలి. మానసికంగా కూడా ఏ ఒక్క పొరపాటు దొరలకుండా జాగ్రత్తపడాలి. అలా సేవించి వారి పాదరజో

1. కాళిదాసు రఘువంశం ద్వితీయ 64

విభూతి శిరమున ధరించి వారి కృపాసాభాగ్యం పొందాలి. అట్టి సేవా పరాయణులకే హరిభక్తి లభిస్తుంది. హరిభక్తి పొందినవారే మాయను తరించగలరు.

నిస్వార్థ కామనం :- భక్తునకు నిర్మోహం నిర్మమత అలవడాలి. ఈ వ్రతంలో స్వార్థపూరిత మమతానురాగాలూ, అహంకారాది వికారాలూ, ఎక్కడా పొడ చూపరాదు. ఈ సేవకుడు సర్వసంగ పరిత్యాగి కావాలి. ఏకైక లక్ష్యంతో గురుచరణ సేవ చేయాలి. అపుడు మహా పురుషుల కృపా కటాక్ష కాంతిరేఖలకు స్వార్థాంధకారాలు దూరం అవుతాయి. ప్రపంచమంతా పరమేశ్వర రూపంగా ప్రత్యక్షం అవుతుంది. 'నాది నేను' అనుకోవటం మూర్ఖత అనిపిస్తుంది. మాయను దాటటానికి 'నాది' అనేది వదలుకోవటమే సులభమైన మార్గం. అటువంటి నిష్కామి, నిస్వార్థుడు, నిరహంకారి మాత్రమే మాయామోహ సాగరం దాటగలడు. గురువులు, మహానుభావులసేవ గూర్చి కాళిదాసు మహాకవి ఇలా అన్నాడు—

బుధుని సంసర్గమున మందబుద్ధి కూడ
సూక్ష్మ దర్శనమును గాంచు శోణియందు
కతక సంయోగ మొనసిన కలుషజలము
పానయోగ్యంబుగా స్వచ్ఛమైన భంగి [1]

47 సూ. యో వివిక్త స్థానం సేవతే
యో లోకబంధన మున్మూలయతి
నిస్త్రైగుణ్యో భవతి, యోగ క్షేమం త్యజతి

1. కాళిదాస మాళవికాగ్నిమిత్రం - వేంచర్ల రామకృష్ణ కవి తెలుగు

ఏకాంత భక్తిని సేవించేవాడూ, సంసార బంధాలు త్రెంచుకొనే వాడూ, సత్వ రజస్తమో గుణాలకు అతీతుడైనవాడూ, తన యోగక్షేమాలు సైతం మరచి ప్రవర్తించేవాడూ, మాయను తరించి శ్రీహరి సన్నిధి చేరుకుంటాడు.

ఏకాంత ధ్యానం :- ఏకాంతం అంటే వివిక్త స్థానం. అనన్య భక్తిని వివిక్త స్థానంలో ఉపాసించాలి.

భక్తుడు సంగ రహితుడై, గురు చరణసేవ చేస్తూ, నిస్వార్థ భావంతో, ఏకాంతం అపేక్షించి, సంసారులకు దూరంగా ఉండాలి. ఎంత జాగ్రత్తగా ఉన్నా మమత మమకారం మాటి మాటికి మనుష్య మానసాన్ని మలినం చేసి మాయలో పడేసి మనుగడను మట్టిపాలు చేస్తాయి. గీతలో కృష్ణ భగవానుడిలా అన్నాడు –

"వివిక్తదేశ సేవిత్వ మరతి ర్జనసంసతి"

భక్తుడు నిర్జన ప్రదేశంలో ఏకాంత ధ్యానం చేయాలి. మనుష్య సమూహం మధ్యలో మసలడం మంచిదికాదు. అక్కడ ఆత్మరతి కుదరదు.

భక్తుని ఉపాసనా క్రమాభివృద్ధికి ఏకాంతం దోహదకారి. జనవాసం ద్రోహకారి. భక్తుడు మనస్సాక్షిగా నియమ పాలకుడై సంయమియై నిష్కామియై సర్వాంతర్యామిని ఉపాసించాలి.

"ఏకాంతవాసంలో ప్రశాంతిలో ఉండు మాధురిమం అనుభవించిన వాడు పాపవిదూరుడై ధర్మ ప్రీతి రసము త్రాగును" 1

సంసార బంధ నిర్మూలనం :- సంసారం మోహ సాగరం. మమకారం మనస్సును విడవదు. మాధవ చింతనతో మమతా బంధాలు తెగిపోతాయి. అపుడు సంసార బంధాలు అవే జారిపోతాయి. లోక సంకటాలూ సంతోషాలూ భగవల్లీలలుగా భగద్విలాసాలుగా భావించి

1. ధర్మపదం 15-9

భక్తుడు ఆత్మవిచారధారను అలవాటు చేసుకోవాలి. సంయమం పాటించి సర్వేశ్వర సేవలో నిమగ్నం కావాలి. అపుడే సంసార బంధాలు సడలిపోతాయి.

"శాంతముచేత క్రోధాన్ని, సాధుత్వంచేత దుష్టత్వాన్ని, ధ్యానం చేత లోభత్వాన్ని, సత్యంచేత అసత్యాన్ని జయింపదగును" 1

త్రిగుణాతీత భావం :- భక్తుడు సత్వ రజ స్తమోగుణాలను పరిత్యజించాలి. ముందుగా తమోగుణం విడవాలి. వివేకం వలన తమస్సు వదలిపోతుంది. రజోగుణం మనస్సును ఎక్కువ ప్రలోభ పెడుతుంది. ్తిని కాంక్షిస్తుంది. లాభనష్టాలను విచారణ చేస్తుంది. గౌర వాదరాలను అపేక్షిస్తుంది. దీనిని ఎదుర్కోటానికి భక్తుడు సంగ రహితుడై ఉండాలి. అభ్యాసం వలన దీనిని జయించాలి. సత్వగుణం చాలా మంచిదిగా కనిపిస్తుంది. వస్తుతః కూడా మంచిదే. కానీ ఇది బంధ హేతువు. కనుక భక్తుడు పుణ్య ఫలాన్ని కూడా పద్మాక్షుని పాద పంక జాలపై పరిత్యాగం చేయాలి. త్రిగుణాలకు పరుడై పరంధాముని ప్రస్తుతించాలి.

ఈ ప్రపంచం త్రిగుణాల వికారాలతోనే నిర్మింపబడి, పెంచబడి, సంహరింపబడుతోంది, ఈ మాయా లీలావతికి ఈ త్రిగుణాలే ప్రాణాలు. ఈ గుణకార్య కలాప సముదాయం ప్రపంచం. మాయామూలపదార్థాలపై అనాసక్తి, విరక్తి, ఉపేక్ష, కలిగి ఉండటమే త్రిగుణాతీతుడై ఉండడం అంటే. విషయాసక్తుడూ, గుణబద్ధుడూ మాయారహితుడు కాలేడు. హరి సేవాసక్తుడూ, భక్తుడూ గుణవిరక్తుడు మాత్రమే త్రిగుణాతీతుడై మాయా విచ్ఛేదం చేయగలడు.

---

1. ధర్మపదం 17-3

అట్టివానికి తన యోగక్షేమాల చింతకూడా ఉండదు. భక్తునికి ఏ వస్తువుపైన రక్తి ఉండదు. గుణలాభంపై ప్రలోభం ఉండదు. వాడు త్రిగుణాతీతుడు. వాడు ముక్తి అనినా పట్టించుకోడు. భక్తి మాత్రం వదులుకోడు.

యోగక్షేమ విస్మృతి :- అప్రాప్తం లభించటం 'యోగం'. ప్రాప్తించిన దానిని పరిరక్షించుకోవటం 'క్షేమం'. ఈ ప్రాప్తాప్రాప్తాలు పారమార్థికంగా ఈ అర్థాలలో ఉపయోగిస్తారు.

భక్తుడు తనముక్తి తనయోగం తనక్షేమం ఎలానా అని ఆలోచించడు. ఆ ఆలోచనకు ఆ వంతకూడా అవకాశం ఈయడు. వాడు భగవంతునిపై పూర్తి విశ్వాసంతో భక్తిలో భగవత్సేవలో నిమగ్నమై ఉంటాడు. అలాంటి భక్తుల యోగక్షేమాలు భగవంతుడే చూసుకొంటాడు.

అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ 1

'స్వామి సర్వాంతర్యామి, దయామయుడు, సర్వరక్షకుడు. భక్తుల క్షేమం చూసుకోవటం భగవంతుని కర్తవ్యం కదా!' అనే ప్రగాఢ విశ్వాసంతో చింతన చేయాలి భక్తుడు. 

'విశ్వమే నేను- నేనే విశ్వం'- అని విశ్వంభరుడైన విష్ణువు విశ్వభారం వహిస్తున్నప్పుడు 'నాసంగతి ఏమి' టని అడగటం ఎంత వెర్రి! భగవంతుడు తన భక్తుని ఎలా మరుస్తాడు?



భోజనాచ్ఛాదనే చింతాం వృథా కుర్వంతి వైష్ణవాః
యోసౌ విశ్వంభరో దేవః స కిం దాసా నుపేక్షతే 2

1. భగవద్గీత 1-22 2.

48 సూ, యః కర్మ ఫలం త్యజతి
కర్మాణి సంన్యస్యతి
తతో నిర్ద్వంద్వో భవతి

కర్మ ఫలం పరిత్యజించాలి. కర్మలను త్యజించాలి. దంద్వం విడిచి అద్వైతి కావాలి.

కర్మఫలత్యాగం : భక్తుడు కర్మఫలం ఏమిటని ఆలోచించ కుండా తన కర్తవ్యాలను చేసుకొంటూపోవాలి. కర్మఫలం భగవ దధీనం. 'ఏతత్ఫలం శ్రీ పరమేశ్వరార్పణ మస్తు' అని కర్మఫలాన్ని భక్తుడు భగవంతుని పాదాలపై ధారపోస్తాడు. భక్తుని యోగక్షేమాలు భగవంతుడు చూస్తుంటే వీనికి కర్మఫలంతో ఆవశ్యకత ఏమిటి? భక్తి రసంలో విలీనత పొందటమే భక్తుని లక్షణం.

భక్తులకు అణి మాద్యష్ట సిద్ధులు సహజంగా ప్రాప్తిస్తాయి. నిజానికి అవి భక్తునికి అక్కరలేదు. భక్తుడు ఏది చేసినా భగవంతుని కార్యమే. వానికి తనకార్యం పైకానీ, ఆ ఫలితాలపైకానీ ఆసక్తి లేదు. అందుకని ఆతడు అశ్రద్ధగా చేయడు- యోగంగా, పూజాయాగంగా చేస్తాడు. 'భగవంతు డీపనిని తనను నిమిత్తంగా నిలిపి చేసుకుంటున్నాడు' అనుకుంటాడు. ఆ పరిస్థితిలో భక్తునికి కర్మఫలాన్ని గూర్చి ఆలోచించవలసిన అవసరమేలేదు.

కర్మత్యాగం :- భక్తుడు కర్మత్యాగి కూడా కావాలి. అయితే అది అసంకల్పిత చర్యగా జరిగిపోవాలి. ఆ పని చేస్తున్నట్లు భక్తునికి స్పృహే ఉండరాదు. భక్తుని హృదయంలో ఆ దేవుడే కూర్చొని కర్మ కలాపం నిర్వర్తిస్తుంటాడు. భక్తునికి ఏమీ తెలియదు. భావంలో భగవంతుడు సుస్థిరుడౌ తాడు. ఆ స్థితి అందుకొన్నప్పుడే భక్తుడు కర్మత్యాగి అవుతాడు. వశిష్ఠముని రామునికి ఇలా భోధించాడు _

శివం సర్వగతం శాంతం
బోధాత్మక మజం శుభమ్
తదేక భావనం రామ!
కర్మత్యాగ ఇతిస్మృతః 1

"ఓ రామా! శివమూ, సర్వశ్రేయమూ, శాంతమూ, బోధాత్మకమూ జన్మరాహిత్యమూ, శుభమూ అయిన పరబ్రహ్మాన్ని భావనం చేయటమే కర్మత్యాగం అని స్మృతి వచనం"

× × × ×

అలసుని తృష్ణ "మాలువ" తీగవలె అతనిలో గుబురుగా ఎదుగును. అరణ్యమందు పండ్ల కొరకు ఒక కొమ్మనుండి మరొక కొమ్మపైకి దుముకు కోతివలె అతడు ఒక జన్మనుండి మరొక జన్మకు పోవుచుండును 2

నిర్ద్వంద్వం :- భక్తుడు సుఖదుఃఖాలకు లాభనష్టాలకు మానావమానాలకు అతీతంగా ఉండాలి. వానికి స్వ-పర భేదాలుండరాదు. స్థితప్రజ్ఞుడై ఉన్నత స్థితిని భజించాలి. భక్తునికి ఆ దశరానంతవరకు ఆతడు సాధనా రూపమైన కర్మఫలాన్ని మాత్రం పరిత్యజించాలి. అనావశ్యక కార్యాలు మానివైచి నిర్ద్వంద్వమైన అద్వైత భావంతో సంచరించ గలగాలి.

త్రైగుణ్య విషయా వేదా
నిస్త్రైగుణ్యో భవార్జున!
నిర్ద్వంద్వో నిత్యసత్వస్థో
నిర్యోగ క్షేమ ఆత్మవాన్ 3

---

1. జ్ఞాన వాశిష్ఠం. 2. దమ్మపదం - 24-1 3. భగవద్గీత ద్వితీయ 45

కృష్ణ భగవానుడు అర్జునునితో అంటున్నాడు–

అర్జునా! వేదాలు త్రిగుణ స్వరూప స్వభావాలతో, విశేష వికారాలతో, విలాస హాసాలతో లోకాన్ని ప్రకాశవంతం చేస్తుంటాయి. కనుక నీవు నిష్కామివై సుఖ దుఃఖాలకు జయాపజయాలకు అతీతుడవై ప్రవర్తించు. నిజయోగక్షేమ కాంక్షలు లేనివాడవై నిత్యసత్య రూపుడవై ఆత్మవిదుడవై మనుగడ సాగించు. కర్తవ్యం పాలించు. సర్వభారం నామీద ఉంచి కర్మలు ఆచరించు.

ఇది భక్తుని లక్షణం ఇలాంటి వాడే మాయా జాలాన్ని దాటగలడు.

49 సూ. వేదానా మపి సన్న్యస్యతి
కేవల మవిచ్ఛిన్నానురాగం లభతే

వేదాధ్యయన త్యాగం:– సృష్టిని ప్రకటించే వేదాలను వదలటం ద్వారా ప్రపంచ ధ్యాస తొలగిపోతుంది. భక్తుడు ప్రపంచాతీతుడు, నిష్కామి అయి ప్రేమామృత వార్థిలో తన్మయుడై ఉంటాడు.

ఆ దశలో లౌకిక వైదిక కర్మలు యథావిధిగా సాగవు. అన్ని బంధాలు సడలిపోతాయి. భక్తుడు బంధ విముక్తుడవుతాడు. పాము నుంచి కుబుసం విడినట్లు మాయ భక్తుని విడిపోతుంది. ఆ స్థితి ప్రేమ యొక్క పరిపక్వదశ. హరి భక్తిలో మునిగిన ఆ భక్తునికి భగవంతుడు సారూప్య దశ ప్రసాదిస్తాడు. అపుడు ఆ భక్తుడు 'సోऽహమ్' అయి ప్రకాశిస్తాడు.

50 సూ. స తరతి స తరతి స లోకాం స్తారయతి

వాడు తరిస్తాడు. అట్టివాడే తరిస్తాడు. మరి వాడే లోకాన్ని కూడా తరింప చేస్తాడు.

నారద మహర్షి సంతోషంతో మరి మరీ చెప్పుతున్నాడు. అట్టి స్థితికి జేరిన భక్తుడు తాను తరించటమేకాదు, ప్రజా లోకాన్ని కూడా తరింపచేస్తాడు. ఆ భక్తుడు సర్వలోకాలకు అన్నియుగాలకు భక్తులందరికీ ఆదర్శ జ్యోతి. ఆతడు మార్గదర్శి వాని బాట మాట అందరికీ అనుసరణీయం.

శ్రీ కృష్ణ భగవానుడన్నాడు- 'మద్భక్తియుక్తో భువనం పునాతి' నాభక్తుడు త్రిభువనాలను పునీతం చేస్తాడు. అందరినీ ఉద్ధరిస్తాడు.

మాయను ఎవడు దాటగలడు? అని ప్రశ్నించిన నారద మహర్షి ఈ సూత్రంలో సమాధానంగా ఇదిగో ఇట్టి సుగుణాలుగల సాధనా పరుడైన భక్తవరేణ్యుడు తాను మాయను తరిస్తాడు. మాయా జాలంనుండి ఇతరులను కూడా తరింప చేస్తాడు అని నిస్సందేహంగా నిశ్చయంగా వక్కాణించాడు.

ఇందు 'స తరతి స తరతి' అని రెండు సార్లు అనటంలో ఆనందం అభివ్యక్తం చేసినట్లూ అవుతుంది. ఇంకా మరో విశేషం, భక్తులలో రెండు రకాల వారుంటారు. ఒకరకం- విద్యద్వారా ఈశ్వర విజ్ఞానం పొందినవారు. రెండవ రకం- సహజంగా పుట్టుకతోనే ఈశ్వర జ్ఞానం పొందినవారు.

ఈ రెండు రకాల భక్తులూ ముక్తిని పొందుతారు. విద్య ద్వారా విజ్ఞానం పొందిన భక్తుడు తాను మాత్రం తరిస్తాడు.

సహజంగా పుట్టుకతోనే భక్తి తత్త్వం పొందిన భక్తుడు తాను తరించి మరియూ ఇతరులను ఉద్ధరిస్తాడు.

నారద మహర్షి నలుబది ఆరవ సూత్రంలో మాయను ఎవరు తరించగలరు? అని ఈ నాల్గుసూత్రాలలో నియమాలు చెప్పి చివర అఖండం అనంతం పరమం అయిన ప్రేమ భావం ముందు సూత్రంలో వివరిస్తున్నాడు.

# ప్రేమ స్వరూపం

## 51 సూ. అనిర్వచనీయం ప్రేమ స్వరూపమ్

ప్రేమ స్వరూపం ఇట్టిది అని వివరించటానికి వీలులేనిది. అది కవిత్వాలకూ భాషకూ అందనిది.

> ఏ లీల న్నుతియింప వచ్చు నుపమోత్ప్రేక్షాధ్వని వ్యంగ్య శ
> బ్దాలంకార విశేష భాషల కలభ్యంబైన నీరూపమున్
> చాలుంజాలు- కవిత్వముల్ నిలుచునే సత్యంబు వర్ణించుచో
> చీ లజ్జింపరుగాక మాదృశకవుల్ శ్రీకాళహస్తీశ్వరా! 1

కవిత్వాలలోని అలంకారాలు, వ్యంగ్యవైభవాలు నీరూపం వర్ణించలేవు. వర్ణించాము అనుకోవటం సిగ్గులేని తనం. నీరూపం ప్రేమ స్వరూపం. అది అనిర్వచనీయం అన్నాడు ధూర్జటి.

భక్తుడు భగవంతుడు ఇద్దరిలో భేదం లేదు. భక్తి మరియు భగవత్ శక్తి వీటిల్లో భేదంలేదు. భక్తి, ప్రేమలో భేదంలేదు. ప్రేమ బ్రహ్మ పదార్థం. వేదాలు "నేతి-నేతి" అంటూ పోయి పోయి చివరకు మూగపోయాయి, కనుక ఆ ప్రేమ స్వరూపాన్ని వాణి వివరించలేదు.

---

1 ధూర్జటి - కాళహస్తీశ్వర శతకం - 51

లౌకిక వ్యవహారాలలోనే పొంగి పొరలిన ప్రేమతో ప్రియ బంధువును కలుసుకొని స్పర్శించి భాషించిన ఆ అనుభవం ఇతరులకు "ఇలాంటిది" అని వివరింపలేముకదా! అలాంటిది ఆ దేవదేవుని దర్శించిన తర్వాత ఆ స్వామిపై కలిగే పరమప్రేమతత్త్వం వర్ణించటం ఎవరికి సాధ్యం? అది ఒకవేళ వర్ణించబడితే ఆ వర్ణన అసంపూర్ణమే. ఆ ప్రేమ అనుభవైక వేద్యం.

ప్రేమానుభవం మనస్సులో ఉంటుంది. ఆ అనుభవం పొందిన మనస్సు ప్రేమింపబడిన వస్తువు దగ్గరనే సుఖానుభూతి పొం తూ ఉంటుంది. మనస్సు లేని వాణి ఏవస్తువునైనా ఏమని వర్ణిస్తుంది. ఒక వేళ వర్ణన చేసినా అది సాంకేతికం మాత్రమే.

ప్రేమానుభవం ఆలాంటిది. అని తెలియటానికి కూడా అందు పూర్వ పరిజ్ఞానం ఉండాలి. అది ఉన్నవానికే ఆ ప్రేమతత్త్వం తెలుస్తుంది. ఇతరుంకది చెప్పినా అర్థంకాదు. ఇతరులు శ్రద్ధాళువులు సానుభూతి పరులు కాకపోతే విషయాన్ని పరిహాసం చేస్తారు. ప్రేమ భక్తి యొక్క సుఖస్వరూపం అనుభవంమీాద తెలుసుకోవలసింది మాత్రమే.

నదిలో కంఠం లోతుకు వెళ్ళేనంతవరకే మనిషి పలుకగలడు. నీటిలో పూర్తిగా మునిగిన వాడు. మాట్లాడలేడు. ఆస్థితిని గూర్చి చెప్పలేడు. వాడికి మాటరాదు.

అలానే ప్రేమ సుధాసముద్రంలో మునిగినవాడు ఏమీా మాట్లాడలేడు. పైపై తేలేవాడే, పైపై అనుభవాలు కలిగినవాడే మాట్లాడేది. యోగులు తమ యోగానుభవాలు పరులకు చెప్పలేరు. అనుభవజ్ఞులకు మాత్రం కొన్ని కొన్ని చిహ్నాలద్వారా ఆ తత్త్వంలో కొంత కొంత మాత్రం తెలుపుతారు. వీరు తెలుసుకొంటారు.

దూబై సో బోలైనహీం, బోలై సో అన్‌జాన్
గహారే ప్రేమసముందర్, కోఫ్రూ దూబై చతురసుజాన్ 1

52 సూ. మూకా స్వాదనవత్

మూగవాడు మధుర పదార్థాలు భుజించి ఆనందించి దాని రుచి ఇతరులకు చెప్పలేడు- అల్లే భక్తుడు ప్రేమభక్తి రసాన్ని అనుభవించి అది ఇట్టిది అని వివరింపలేడు.

ప్రేమ స్వరూపం అనిర్వచనీయం అని చెప్పి, దానికే పరిపుష్టిగా ఆ ఆనందానుభవం వెల్లడించ జాలనిది, అది మూగవాని దశవలె ఉంటుంది అని నారద మహర్షి వచించాడు.

యోగంగ-నిశ్శబ్దం- సమీపం-అనే పదాలు సమానార్థకాలు. భక్తి యోగం వల్ల భక్తుడు భగవంతుని సమీపానికి చేరుతాడు. అది నిశ్శబ్దంగా అనుభవించే మధురానుభూతి! ఈ భక్తి రసంలో తన్మయత ఉంటుంది. నేను ఏమిటి ఎలా ఉన్నాను ఇతరమేమిటి? అనేది ఎరుగని చిత్రమైన మానసిక దశ అది.

రాధాదేవి ఒక సఖితో అంటుంది –

"సఖీ! నేను కృష్ణ ప్రేమానుభవం కొంచంకూడా ఎరుగనే. ఆయన వచ్చినప్పుడు నా మానసిక దశ ఎలా ఉంటుందో! నే చెప్పలేనే. ఆయన స్పర్శ తగలగనే నాకు స్పృహే ఉండదు. ఆయన ఆగమన వార్త వినగానే నా మనస్సు పరవశమై ఏ స్థితి పొందుతుందో అర్థంకాదు. నీవు చెప్పమంటే నేనేమి చెప్పగలను"

అయితే భక్తిరసానుభవం అనిర్వచనీయం అయినట్లైతే మహాత్ముల సాంగత్యంతో ప్రయోజనం ఏమిటి అనుకుంటారేమో! భక్తి తత్వాన్ని ఆధ్యాత్మిక మార్గమందు అనుభవ పూర్వకంగా తెలుసుకో

వలసి ఉంది. అది భౌతిక తార్కిక హేతువాదాలకు అందేటు వంటిది కాదు. అది హృదయ సంబంధి. ఆ పరమ ప్రేమ ఇతర మానవుల చెంత నేర్చుకొనే పాఠం కాదు. అది ఈశ్వర కరుణాకటాక్షంచేత మహాత్ముల కృపా ప్రసాదం చేతనే లభ్యమవుతుంది. మహాత్ముల ఉపదేశానుసారం భక్తిని అభ్యాసం చేసుకోవాలి. ఈ అభ్యాసంలో గురువు మిక్కిలి సహాయం చేస్తాడు. వారి సాంగత్యం వల్లనే ప్రేమానుభవం పొందే స్థితికి భక్తుడు చేరుకుంటాడు.

ఆ అనుభవ సుఖంమాత్రం అనిర్వచనీయం. అతిమధురాతి మధురం.

వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునితో ఇలా అంటాడు –

సా స్వయం యోగ సంసిద్ధా సుషుప్తా దూరభావితా,
న గమ్యా వచసాం రామ హృద్యే వేహాऽను భూయతే 1

ఓ రామా! యోగముచే సిద్ధించే, సుషుప్త దశవంటి పరమాత్మ భావదశ హృదయమునందే అనుభవింపబడేదే, కానీ వాక్కులతో వర్ణింపవీలు లేనిది సుమా! ఆ దశ అటువంటిదేమరి.

53 సూ. ప్రకాశతే క్వాపిపాత్రే

ఆ ప్రేమ యోగ్యులైన మహా యోగీశ్వరుల హృదయాలపై ప్రస్ఫుటమవుతూంది.

ప్రేమ రసానుభవాన్ని భాష ప్రకటింపనిమాట అక్షరాలా నిజం. అనుభవాన్ని భక్తిరసంలో లీనమైన మహాత్ముల బాహ్యచిహ్నాల ద్వారా తెలుసుకోవచ్చు. వారు శరీరస్మృతి మరచి సమాధిలో ఉన్నపుడు

---

1 జ్ఞానవాశిష్ఠం షడ్వింశ 15.

కొన్ని కాంతి ప్రసారాలు, చేష్టలు చూడగలవారికి కనిపిస్తాయి. ఆ మహాత్ముల నేత్రాల నుండి, వాక్కుల నుండి, రోమాలనుండి కాంతి మయ కిరణాలు ప్రకాశిస్తాయి. అవి భగవంతుని ప్రేమమయ కిరణాలు. అటువంటివి ఎక్కడో ఎవరికో ఎప్పుడోగాని అనుభవంలోనికి రావు. బహిర్గతంకావు.

భక్తి ఆ మహా పురుషుల హృదయాలలో వివిధ దృశ్యాలలో సాక్షాత్కరిస్తుంది. ఆ మహిమ వివిధ రూపాలలో ప్రకాశిస్తుంది.

"భగవంతుని దర్శింపగోరే భక్తుడు కీర్తనం శ్రవణం దివ్యదర్శనం తప్ప ఇతరములు అంగీకరింపడు. ఇతర పదార్థాలంటే నిర్లిప్తుడై ఉంటాడు.

సర్వవస్తు జాలంలోనూ పరమాత్మనే దర్శిస్తుంటాడు. అన్ని శబ్దాలలోనూ ఓంకారమే శ్రవణం చేస్తాడు. ఆయనకు అన్నీ మంత్రాక్షరాలే. ఆయన విశ్వాత్మనే మననం చేస్తాడు. వాడే తానైపోతాడు. సర్వంలో ఆతడూ, ఆతనిలో సర్వం నిండి ప్రకాశ మానమవుతుంది.

× × ×

ప్రేమనున లోక ముదయించె నేమొ - కాక
ప్రేమయే లోకమున బుట్టెనేమొ - కాక
ప్రేమ లోకమయంబయ్యె నేమొ - కాక
లోకమే ప్రేమ మయంబై వెలుంగు నేమొ!

ఏమయిననేమి కొంచమూహించిచూడ
ప్రేమ మయుడీశ్వరుడు - సృష్టి ప్రేమ మయము -
ప్రేమ మయులెల్ల జీవులు - ప్రేమ ఒకటె
పావనంబైనదని బోధ పడుచునుండె -

అంతరంగమ్ము నిండి తొలొల్కెడు నేది?
ఇతర భావంబులను జొరనీని దేది?
కష్టసుఖముల భేదంబు గనని దేది?
ప్రతివిధానంబునకు ఆస పడని దేది?
అవిర తానంద దాయకమైన దేది?
అదికదా! ఉత్తమోత్తమమైన ప్రేమ 1

54 సూ. గుణ రహితం కామనా రహితం
ప్రతిక్షణ వర్ధమానం అవిచ్ఛిన్నం
సూక్ష్మతరం అనుభవ రూపం.

ఈ భగవత్ ప్రేమ త్రిగుణాతీతం. ఈ ప్రేమ కోరికలు లేనిది. క్షణం క్షణం ప్రవర్ధమానం అవటం దీని స్వభావం. ఇది అవిరళంగా, అవిరామంగా అమృతంగా ప్రవహిస్తుంది. ఇది సూక్ష్మాతి సూక్ష్మం. అనుభవైక వేద్యం.

గుణ ప్రేరితమైన ప్రేమ గుణపరిణామం చెందటంతోనే మారిపోయి మరుగున పడుతూంటుంది. భగవంతునిపై గల ఆ ప్రేమ తమోగుణం వలె మొరటుగానూ ఉండదు. రజోగుణం వలె ఉద్రేకంగాను ఉండదు. సత్త్వ గుణం వలె చల్లగా మెల్లగానూ ఉండదు. అది ఎప్పుడూ నిశ్చలంగా నిర్మలంగా నిలకడగా ఉంటుంది. పొంగుట క్రుంగుట అనేవి ఈ ప్రేమ ప్రవాహానికి ఉండదు. గుణాలవల్ల కలిగిన ప్రేమగలవానికి కోపాలు తాపాలు, ద్వేషాలు రోషాలు కల్గుతాయి. కానీ పరమ ప్రేమ గలవానిలో ఏ దోషాలూ ఉండవు. ఈ భగవత్ ప్రేమ ఎదుటి

1. వెంకట పార్వతీశ్వర కవులు - ప్రేమ "ప్రమాదావనం" నవల.

వ్యక్తిలోని గుణ దోషాలను పరికించదు. ప్రసరించటం ఈ ప్రేమరస స్వభావం. ప్రేమ ప్రేమకొరకే. ప్రతి ఫలం అనే ప్రశ్నే లేదు. ఇది సహజ సిద్ధమైన భగవత్ ప్రేమ స్వరూపం. అందువల్ల ఇది గుణరహితం.

ఈ ప్రేమ ఎవరినుంచీ ప్రతిఫలం అపేక్షించదు. ఏమీ ఆశించదు. ప్రేమాస్పదుడైన వ్యక్తి సుఖించాలి అనేదే దాని ఏకైక వాంఛ. మరో స్వార్థకాంక్ష దానికి ఎక్కడా లేదు. దాని పరమార్థం ప్రేమసుధను వర్షించటమే. ప్రేమ ప్రతిఫలం ఆశించటం జరిగితే అది కపటం, వ్యాపారం, స్వార్థం అవుతుంది. అది కళంకితం అవుతుంది. అందుచే నిష్కళంకమైన ప్రేమను "కామనారహితం" అన్నారు.

ఈ ప్రేమ సుధా ప్రవాహం ఎప్పుడూ తరగదు. వృద్ధి పొందుటే దాని స్వభావం. ఈ ప్రేమకు పరిసమాప్తిలేదు. ఈ ప్రేమ గల భక్తుడు తనలోని ప్రేమ ఏ క్షణంలోనైనా తరిగిపోతుందేమో! అని బాధపడతాడు. దాని సంరక్షణకోసం జాగ్రత్త పడతాడు. అది తన హృదయంలో నిండుగా ఉందిగదా ఇక చాలులే అని భావించదు. అందువల్ల ఆ భక్తుడు చేసే ప్రతి కార్యం ప్రేమాభివృద్ధికి దోహదకారి గానే ఉంటుంది. ఈ కృత్యాలవల్ల ప్రేమ పెరుగుతుంది. ఈ ప్రేమ శుక్ల పక్షంలోని చంద్రకళలవలె ప్రవర్ధమానం అవుతుంది. బహుళ పక్షంలో చంద్రకళలకు క్షీణ దశ ఉంది. కానీ ఈ ప్రేమ చంద్రునికి క్షీణ దశ అనేదే లేదు. ఈ భగవత్ ప్రేమ హృదయ కుహరంలోని దహరా కాశంలో "అణోరణీయాం" అణువు కంటె కూడ సూక్ష్మరూపంలో ఉంటుంది. ఇది కేవలం అనుభవంలోనే వ్యక్తమవుతుంది.

ఈ దివ్య ప్రేమనే ఆత్మగా భావించి ఋషులు ఇలా వివరించారు- ప్రేమ మూర్తి అయిన ఆత్మ అణువుకంటె సూక్ష్మం. అత్యంత సువిశాలం.

ఇది జీవుల హృదయ పద్మంలో అతి సూక్ష్మ రూపంలో ప్రకాశిస్తూ ఉంటుంది. దీనిని శోకరహితులు జితేంద్రియులు కర్మత్యాగులు మాత్రమే తెలుసుకో గలరు.

అణో రణీయా న్మహతో మహీయా
నాత్మాస్య జంతో ర్నిహితో గుహాయాం
తమ క్రతుః పశ్యతి వీత శోకో
ధాతుః ప్రసాదాన్మహిమాన మాత్మనః 1

55 సూ. తత్ప్రాప్య తదేవావలోక యతి
తదేవ శృణోతి తదేవ భాషయతి
తదేవ చింతయతి

ఈ భగవత్ ప్రేమ ప్రాప్తించిన భక్తుడు ఆ పరమ ప్రేమమూర్తినే చూస్తుంటాడు. ఆ మోహనమూర్తి మురళీగానమే వింటుంటాడు. ఆ మధుర మూర్తికి సంబంధించిన భావణలే కావిస్తుంటాడు. ఆ దేవుని దివ్య సుందర పాదారవి దములే చింతన చేస్తుంటాడు.

దివ్య భక్తిరస మగ్నుడైన మహనీయునికి సర్వత్ర ఆ ప్రేమ స్వరూపుడైన భగవంతుడే కనిపిస్తాడు. ఆయన గానమే వినిపిస్తుంటుంది. ఆ భక్తునికి అన్నీ ఆయన లీలలు గూర్చిన ఆలోచనలే. మరో వస్తువుపై ఆలోచన రాదు.

కృష్ణ ప్రేమలో మునిగిన గోపికలు ఎటు చూచినా శ్యామ సుందరుడే దర్శనం ఇచ్చేవాడట.

1. ఋగ్వేదం.

మనస్సులో సుమనస్సులో, వనంలో భవనంలో, నృత్యంలో సాహిత్యంలో, కోటలో తోటలో, బాటలో పాటలో, గదిలో మదిలో గుట్ట పైన చెట్టుపైన మేఘాలలో రాగాలలో సర్వత్ర సారసలోచనుడే. ఆయన కనబడని స్థానం లేదు. ఆయననుగూర్చి వినపడని గానం లేదు. ఆ దేవ దేవుడూ ఈ దీనభక్తుణ్ణి విడిచి ఉండలేడట. ఇద్దరి అంత ఆత్మీయత.

ఇట్టి భక్తునికి లోకంతో పనేమి ఉంటుంది. ఆ ఆనందం దివ్యం. పరమ భక్తుడైన ప్రహ్లాదుడు :-

శ్రీవల్లభుడు తన్ను జేరిన అట్లైన
చెలికాండ్ర నెవ్వరి జేర మరచు
అసురారి తనమ్రోల ఆడిన అట్లైన
అసుర బాలుర తోడ ఆడ మరచు
భక్తవత్సలుడు సంభాషించి నట్లైన
పరభాషలకు మారు పలుక మరచు
సుర వంద్యు దనలోన జూచిన అట్లైన
జొక్కి సమస్తంబు జూడ మరచు
హరి పదాంభోజ యుగచింతనామృతమున
అంతరంగంబు నిండినట్లైన అతడు
నిత్య పరిపూర్ణు డగుచు అన్నియును మరచి
జడత లేకయు నుండును జడుని భంగి 1

విష్ణు భక్తిలో సర్వం మరచిన భక్తుడు నిత్య పరిపూర్ణుడు అవుతాడు. లోకం దృష్టిలో జడునివలె ఉంటాడు. కాని అతడు ఆధ్యాత్మికంగా జడత లేని మహా మహోన్నతమూర్తి!

---

1. ఆంధ్ర మహాభాగవతం సప్తమ 122

# గౌణీ భక్తి:

56 సూ. గౌణీ త్రిధా గుణ భేదా
దార్తాది భేదాద్వా

గౌణీ భక్తి మానవుల గుణ స్వభావాలను బట్టి ఆర్తుల స్థాయిని అనుసరించి మూడు రకాలుగా విభాగించబడింది.

ఇపుడు ఉచ్చతర భక్తులను కాక సాధారణ భక్తులను గూర్చి విభాగాలు చేసి సాధనలు వివరిస్తున్నాను అంటాడు నారదమహర్షి.
ఈ గౌణీభక్తి మూడురకాలు. సాత్విక భక్తి, రాజసిక భక్తి, తామసిక భక్తి.

కర్మఫలం పరమేశ్వరార్పణ చేసి పరమేశ్వర ప్రీత్యర్థం పరమేశ్వర పాద పద్మార్చన గావించే భక్తుడు సాత్త్విక భక్తుడు. యశస్సు కొరకు ధనాకాంక్ష కొరకు విగ్రహారాధన గావించే భక్తుడు రాజసికమైన తరగతికి చెందినవాడు. ప్రతీకారేచ్ఛతో, హింసాబలులతో ఇతరులను మోసం చేయటానికో, డాంబికం కొరకో, క్రోధంతోనో పూజాదులు, నిర్వహించేవాడు తామసిక భక్తుడు.

సాధారణంగానే ఆర్తుడు జిజ్ఞాసు అర్థార్థి అనే భక్తులు మూడు రకాలుగా ఉపాసనలు గావిస్తుంటారు. ఇలా భక్తుల మానసిక స్థాయిని బట్టి గౌణీ భక్తి త్రివిధాలు. వీరికి సాక్షాత్తుగా భగవత్ ప్రాప్తి కలుగదు. కానీ వీరుకూడా సుకృతులే. చివరకు ఉపాసనాభ్యాసాన్ని బట్టి వీరందరికీ కూడా భగవత్ కృప కలుగుతుంది. భగవత్ భక్తిలో గల విశేషం ఇదే. భగవత్ కృప తప్పక అందరికీ కల్గుతుంది. భగవత్ భజన భగవదాశ్రయం భగవద్ధ్యానం భగవదారాధన ఏ రూపంలో జరిగినా ఫలితం తప్పక కనిపిస్తుంది. కనుక ప్రతివానికి భక్తిని అభ్యాసం చేసుకోవటం చాల అవసరం. వాటిలో సాత్త్విక భక్తి శ్రేష్ఠం.

పరమేశ్వర ప్రీతికై చేసే నిష్కామ సేవ, భగవదారాధన సర్వ శ్రేష్ఠం. అన్ని భక్తి పద్ధతులు పరమ భక్తిని జేర్చేవే. అన్నీ ఉత్తమ మార్గాలే.

ఇందులో అర్థార్థిభక్తి కంటె జిజ్ఞాసగల భక్తి ఉత్తమం. దీని కంటె ఆర్తితో గూడిన భక్తి ఉత్తమోత్తమం. అలానే సుఖాలు కూడా మూడురకాలు. ప్రథమంలో దుఃఖ కరంగా విషంగా ఉన్నా తర్వాత అమృతంవలె ఉండే ఆత్మానంద సుఖం సాత్త్విక సుఖం. మొదట అమృతంవలె ఉండి చివరకు దుఃఖంగా విషంగా పరిణమించే ఐహిక భోగ సుఖం రాజసికం. మొదట చివరకూడా ఆత్మకు మోహం కలిగించి సుఖం అనుకునే మందమతి సుఖం తామసిక సుఖం. కనుక మొదట విషంగా ఉన్నా అభ్యాసంచేసి భక్తుడు సాత్త్విక సుఖాన్ని పొందాలి.

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా.

x x x

హరి దాసుల మిత్రత్వము
మురరిపు కథ లెన్నికొనుచు మోదములోడన్
భరితాశ్రు పులకితుండయి
పురుషుడు హరిమాయ గెలుచు భూపవరేణ్యా 1

57 సూ. ఉత్తర స్మాత్ ఉత్తర స్మాత్
పూర్వ పూర్వా శ్రేయాయ భవతి.

తరువాత తరువాత దానికంటె పూర్వం చెప్పినవి కల్యాణ ప్రదాలు. అంటే తామసిక భక్తి కంటె రాజసిక భక్తి, రాజసికం కంటె సాత్వికం శ్రేష్ఠం. ఈ మూడింటికంటె "సాధ్యభక్తి" సర్వశ్రేష్ఠం. ఆ సాధ్యభక్తినే "పరమప్రేమ భక్తి" అంటారు.

రామకృష్ణ పరమహంస- "అన్నిరకములైన భక్తి పద్ధతులు మంచివే. అది తామసికం అయినా సరే మంచిదే. అది కొందరినైనా ఉద్ధరిస్తుందికదా" అంటారు.

సీతారామాంజనేయ సంవాదంలో ఆంజనేయుడు శ్రీరామ ప్రభువుతో ఇలా విన్నవించుకొంటాడు. దేహ బుద్ధితో చూస్తే నేను నీకు దాసుణ్ణి. జీవబుద్ధితో అయితే నేను నీ అంశాన్ని. ఆత్మ బుద్ధితో ఆలోచిస్తే నీవే నేను నేనే నీవు.

దేహ బుద్ధ్యాస్మి దాసోఽహం
జీవ బుద్ధ్యా త్వదంశకః
ఆత్మ బుద్ధ్యా త్వమేవాహం
ఇతిమే నిశ్చితా మతిః 2

---

1. ఆంధ్రభాగవతం ఏకాదశ 55
2. సీతారామాంజనేయ సంవాదం.

'దాసోఽహమ్' అయిన వాడు 'సోఽహమ్' స్థితికి చేరుకోటానికి భక్తునిలోని సాధనానుష్ఠానభక్తి క్రమంగా తామసికం నుంచి రాజసికంగాను, రాజసికం నుంచి సాత్వికంగాను పరిణతి చెందుతుంది. ఏకాగ్ర భక్తి సాధన వలననే సాత్విక స్థితినుంచి సాధ్య భక్తి లభిస్తుంది. అదే శ్రేయస్సునుంచి వేరుచేసి శ్రేయస్సు చేకూర్చే యోగం. అపుడు భక్తుడు భగవంతునిలో తాదాత్మ్యం చెందుతుంటాడు. అనుక్షణం ఆ భక్తసత్తముడు ఆ హరి చింతనలో భావనలో దర్శనంలో స్పర్శనంలో ఆ అనుభూతిలో లోకాన్నే కాదు తనను తాను మరచి మాధవునిలో మమేకమై ఉంటాడు. వానిస్థితి ఇలా ఉంటుంది—

వైకుంఠ చింతా వివర్జిత చేష్టుడై
ఒక్కడు నేడుచు నొక్కచోట
అశ్రాంత హరి భావ నారూఢ చిత్తుడై
ఉద్ధతుడై పాడు నొక్కచోట
విష్ణు డింతియకాని వేరొండు లేడని
ఒత్తిలి నగుచుండు నొక్కచోట
నలినాక్షుడను నిధానము గంటి నేనని
ఉబ్బి గంతులు వైచు నొక్కచోట

పలుకు నొక్కచోట - పరమేశు కేశవు
ప్రణయ హర్ష జనిత బాష్ప సలిల
మిళిత పులకుడై నిమీలిత నేత్రుడై
ఒక్క చోట నిలిచి ఊరకుండు 1.

1. ఆంధ్రమహాభాగవతం 124

# మాతృశ్రీ

## 58 సూ. అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ

ఇతరత్రా చెప్పబడిన అనేక మార్గాలకంటె ముక్తికి భక్తి మార్గం సులభమైనది.

ముక్తి అనే మూలశక్తిని జేరటానికి అనేక మంది మహర్షులు అనేక మార్గాలు సూచించారు. జ్ఞాన మార్గం, కర్మమార్గం, యోగ మార్గం ఇలా అనేకం. ఇన్నీ పరిశీలించినమీదట నారద మహర్షి నిశ్చయంగా చెప్పింది భక్తి మార్గం. ఇది మానవులకు చాలా అనుకూలమైనది. సులభంగా ఆచరించడానికి వీలైనది. అధిక ఫలం ఇచ్చేది. భక్తి మార్గంలో అనేక మంది భక్తులు సులభంగా తరించారు. భక్తిని అభ్యాసం చేసుకోటానికి శాస్త్ర జ్ఞానం, వేదాధ్యయనం కఠోరనియమ పాలనం, అగ్రజన్మ మహా భాగ్యం, కఠిన వైరాగ్యం- ఏ ఒక్కటీ ఉండాలని లేదు. భక్తునికి కేవలం సరళస్వభావం, దేవునిపై అచంచల విశ్వాసం, నిరంతర అభ్యాసం అనేవి ఉంటే చాలు. నిండు హృదయంతో భగవన్నామ స్మరణ చేస్తే భగవంతుడు సంతోషిస్తాడు. భగవత్ కృపా రశ్మి సర్వులపై సదా ప్రసరింపబడుతుంది. విశ్వాసంతో ప్రేమతో ఆప్యాయతతో దానిని అందుకొన్నవారే ధన్యులు. విశ్వాసంలేనివాడు వంచితుడౌతాడు.

శ్రీమద్ భగవద్ గీతలో కృష్ణ భగవానుడు ఇలా అన్నాడు–

సుహృదం సర్వభూతానాం
జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి 1

నేను సమస్త ప్రాణులకు ఆప్త మిత్రుణ్ణి. నన్ను విశ్వాసంతో మనసారా ప్రేమించి ఆరాధించువాడు ఆ క్షణంలోనే శాంతి పొందుతాడు.

"నేను అచంచల విశ్వాసంతో భగవత్ కృపా సాగరంలో మునిగి ఉన్నాను. నన్ను భగవత్ ప్రేమామృతం అన్ని కాలాలలో కాపాడుతుంది." అని తన్మయుడైన వాడు భగవత్ ప్రేమకు పాత్రుడు అవుతాడు.

నిర్మలమైన అనన్య ప్రేమార్చన ఎవరైనా చేయవచ్చు. పురుషుడు కానీ, స్త్రీ కానీ, బాలుడు కానీ, వృద్ధుడు కానీ బ్రాహ్మణుడు కానీ చండాలుడు కానీ, పశువు కానీ, పక్షి కానీ, పురుగు కానీ, పాము కానీ అందరు మోక్షానికి అర్హులే. ప్రాణి కానీ అప్రాణి కానీ భగవత్ ధ్యానంతో స్మరణతో ముక్తి పొందవచ్చు. ధూర్జటి మహాకవి అంటాడు–

ఏ వేదంబు పఠించెలూత–భుజగం బే శాస్త్రముల్ సూచె–దా
నే విద్యాభ్యాసనంబొనర్చె కరి–చెంచే మంత్ర మూహించె–బో
ధావిర్భావ నిదానముల్ చదువులయ్యా కావు–నీపాదసం
సేవాసక్తియె కాక జంతుతతికిన్ శ్రీకాళహస్తీశ్వరా! 1

'ఓ ఈశ్వరా! సాలెపురుగు ఏ వేదం చదివింది? పాము ఏ శాస్త్రం తెలుసుకొంది? ఏనుగు ఏ విద్య అభ్యసించింది? అడవి మనిషి చెంచువాడు

---

1. శ్రీకాళహస్తీశ్వర శతకం

ఏమంత్రిం ఉపదేశం పొందాడు? వారికి మోక్షం ఇచ్చావు కదా! దీనిని బట్టి మోక్షానికి ముఖ్యం నీ పాద సంసేవాకాంక్ష ఒక్కటే అనేది స్పష్టమవుతూంది.

గీతలో కూడ 'తస్యాహం సులభః పార్థ అన్నాడు' అన్నాడు భగవానుడు. భక్తికి భగవంతుడు సులభంగా వశుడవుతాడు.

జ్ఞాన కర్మ యోగాదులు నేరుగా ముక్తినీయవు. అవి కొంతవరకు మహాత్ముల సాంగత్య ప్రాప్తికి సహాయ పడతాయి. వాని వలన సాధకునికి కొన్ని సిద్ధులు ప్రాప్తిస్తాయి. ఒక్కోసారి ఆ సిద్ధుల వలన అహంకారం పెరిగి భక్తుడు పెడదారి పట్టే ప్రమాదంకూడా ఉంది. ఐహిక వాంఛల నుండి విముఖులు అగుటకు ఇంద్రియ నిగ్రహం అవసరం. కానీ అది దుస్సాధ్యం.

జ్ఞాన మార్గం కఠినాతికఠినం. నిస్సారం. అది పెద్ద ఉత్సాహం కలుగ జేయనిది. కర్మ మార్గం నియమ నిష్టా గరిష్ఠం. భక్తి మార్గం మధురం, మార్దవం, హృదయంగమం, శ్రమరహితం, ఉత్సాహ భరితం, రస పూరితం, అది ప్రేమ మందిరం! అది సత్యం, శివం, సుందరం!

గోవింద నామకీర్తన
గావించి భయంబు దక్కి ఖట్వాంగ ధరి
త్రీవిభుడు సూరగొనియె
కైవల్యము తొల్లి రెండు గడియల లోనన్ 1

59 సూ. ప్రమాణాంతరస్యా నపేక్షత్వాత్
స్వయం ప్రమాణత్వాత్

భక్తి స్వయం ప్రమాణ సిద్ధం. భక్తికి అన్య ప్రమాణాలు అవసరంలేదు. అంతరాత్మయే దానికి ప్రమాణం. అది అనుభవైక వేద్యం.

1. భాగవతం ద్వితీయ 10

ప్రేమ భక్తిలో మునిగిన వానికి ఆ సుఖం, ఆ అనుభూతి అతని అంతరాత్మకు మాత్రమే తెలుస్తుంది. వాడు స్వయంగా అనుభవిస్తాడు. దీనికి ఇతర సాక్ష్యాలు ఆధారాలు అక్కరలేదు. ఇది ఆత్మసంబంధి.

నవ వధువు వివాహం చేసుకొని ప్రియుని గృహం వెళ్ళింది. సుఖంగా కాపురం సాగుతున్నది. కొన్నాళ్ళకు తల్లి వెళ్ళి కూతురును చూచి వచ్చింది. సంతోషించింది. పెళ్ళికాని చెల్లెలు వెళ్ళింది అక్క దగ్గరకు. అక్క బావ వలన ఎలాంటి సుఖం పొందుతున్నదో తెలుసు కోవాలని ఆకాంక్ష. అక్క ఏమని చెప్పుతుంది? అన్ని ప్రశ్నలకు చిరునవ్వే సమాధానం. చెల్లికి ఆ సమాధానం తృప్తి నీయలేదు. అక్క పొందే ఆనందం అనిర్వచనీయం. అది చెప్పటానికి అలవికానిది. ఆ సుఖం అన్యులకు ఏమి తెలుస్తుంది?

భక్తిరసంలోగల ఆనందానుభూతి భక్తునికి మాత్రమే తెలుస్తుంది. నిష్కామ్యంగా భగవత్ సేవాసంస్మరణలో పులకించిన భక్తవరేణ్యుడే పరమానంద సుఖానుభవం పొందగలడు. దీనికి ఆత్మయే సాక్షి. కానీ మరే ప్రమాణాలు ఉండవు. భక్తుల హృదయాలు పరులకు అర్థంకావు.

రావణాసురుడు వైరభక్తితో స్వామిని చేరినవాడు. సముద్రుడు రావణునిదగ్గరకు పరుగు పరుగున వెళ్ళి 'నీ శత్రువు శ్రీరామచంద్రుడు యుద్ధానికి వస్తున్నాడురా! రావణా!' అన్నాడు అపుడు రావణుడన్న మాటలివి- శ్రీరాముడు నా శత్రువుకాడు. నా శ్రేయోభిలాషి. నేనే వారికి మిక్కిలి ప్రీతిపాత్రుణ్ణి.

అగుదురు మిమ్మ బోంట్లు చరితార్థులు 'కా'దనగాని- మోము-ము
ద్దు గొనిన తండ్రికంటె-దయతో చనుగ్రోల్చిన తల్లి కంటె-పై
సగమగు సీతకంటె-పరిచర్యలొనర్చిన తమ్ముకంటె-ఈ
జగదభిఘాతి రక్కసుడె సామికి మిక్కిలి గూర్చు నెచ్చెలీ! 1

---

1. పౌలస్త్యహృదయం - కాటూరి వెంకటేశ్వరరావు

రామచంద్రునికి మోము ముద్దాడే తండ్రికంటే, పాలిచ్చి పెంచిన తల్లికంటే, అర్ధాంగి సీతకంటే, నిత్యం సేవించే తమ్ముడు లక్ష్మణస్వామి కంటే, ఈ జగత్కంటకుడైన రాక్షసుడే మిక్కిలి కూర్చువాడయ్యా! నా హృదయం ఆయనకు తెలుసు, ఆయన ప్రీతినాకు తెలుసు. నన్ను ఉద్ధరించి తన దగ్గరకు జేర్చుకోవటం కోసమే వస్తున్నాడు.

హామ్మ నెచ్చెలి! రామమూర్తికి నెదురేగి
పుష్పముత్తియముల మ్రుగ్గువెట్టి
అత్యున్నతమ్మును అతిభీకరమ్మైన
గర్భవీచి మతల్లి గద్దెవెట్టి
రమకంటె కౌస్తుభ రత్నమ్ముకంటె గా
రామైన మణుల దర్శన మొసంగి
లంకకు పంపు - పౌలస్త్యుండు సిరికొల్వ
చవికయా వక్షమ్ము చంద్రహాస

దారిత మొనర్చి ఆ గంటు దారి వెంట
హృదయమున్ జొచ్చి ఏకాంత మిచ్చగించి
స్వాగతముపల్కనని విన్నపమ్ము సలుపు
మచటనే పునర్దర్శన మగుత మనకు [1]

ఎన్నాళ్ళకు! ఎన్నాళ్ళకు! ఇంత భాగ్యం కలిగింది. వెళ్ళి స్వాగతం చెప్పు. ఎదురు వెళ్ళి నీదగ్గర మరి నా దగ్గర గల విలువైన ముత్యాలతో ముగ్గుల రంగవల్లికలు పెట్టు. పీచికాసింహాసనంపై కూర్చోపెట్టు. రమాదేవి కంటె కౌస్తుభం కంటె విలువైన మణులు కానుకలిచ్చి

1. పౌలస్త్యహృదయం కాటూరి వెంకటేశ్వరరావు

నా రామచంద్ర ప్రభువును లంకకు పంపు. అప్పుడు నేను హృదయం చీల్చి ఆదారివెంట స్వామిని ఏకాంతంలో కలుసుకొని స్వాగతం పల్కుతానని విన్నవించు.

రావణుని హృదయం అది. అతడు విష్ణువుని చేరిన విధం అది. భక్తి విధానం ఏదైనా భక్తుని హృదయం అలా స్వామి రాకకు తపించాలి.

60 సూ. శాంతిరూపాత్
పరమానంద రూపాచ్చ

భక్తి అనే మహాదేవిది శాంతస్వభావం. ఆ తల్లిది పరమానంద స్వరూపం. ఆమె ఆనందమయి.

భగవంతుడు పరమానందుడు. శాంతి సుందరుడు, ప్రేమ మయుడు, శాంతిశ్రీ శోభితుడు, శాంతిశ్రీవిరాజితుడు, శాంతి సత్యం ఆనందం భగవంతునికి ఇష్టమైన గుణాలు. భక్తుడు ఆ గుణాలు పొంది వాటిద్వారా ఆ శాంతిరూపుణ్ణి ఆనందమూర్తిని అందుకో కల్గుతాడు.

పరమేశ్వర దేహంనుండి ఆనందశ్రీలు, శాంతిశ్రీలు యోగ మాయ వలన నిత్యం ప్రకటితమవుతాయి. ఆత్మారాములూ జీవన్ముక్తులూ యోగీశ్వరులూ అయిన వ్యాస శుకాదులు భగవానుని గుణములను అనుభవించి పులకించి పోతారు. మాయా నిర్మిత గుణవికారాలు భగవంతుని ఆశ్రయించినప్పుడు అవి పూజనీయాలు పునీతాలు అవుతాయి.

అలాకాక మాయాగుణ వికారాలు మామూలుగానే భగవన్మూర్తిలో కూడా పనిచేస్తున్నట్లయితే ముక్త పురుషులైన జనక సనక సనందన వ్యాసాదులను అవి మోహా పెట్టజాలవు. ఆ గుణాదులు భగవదాశ్రితాలు కావుననే అవి ఈ మహర్షులను ఆకర్షించాయి.

మనం చూచే ఈ రవిప్రకాశం ఆయన రూప సంకాశం. ఈ మహా సముద్రం ఆయన ప్రేమరసం. మనం దర్శించేది ఆ మహానుభావునిలో సహస్రాంశంలో సహస్రాంశమాత్రమే. ఆ రూపం శాంతికి నిలయం, ఆనంద వలయం, మహిమామయం.

భక్తి శాంతిమయి, ప్రేమమయి, ఆనందమయి. భగవదాలయం లోనికి ఆ తల్లి చేయిపట్టుకు వెళ్ళితే ప్రవేశం కడు సులభం.

అట్టి భక్తిరస మగ్నుడైన భక్తుడు సర్వం మరచి మాధవ సేవలో పులకించి పునీతుడై పునర్జన్మ రహితుడౌతాడు. ఆ పరమానంద శాంత స్వరూపమైన భక్తినే నారద మహర్షి పదే పదే వర్ణిస్తున్నాడు. మహా భక్తుడు త్యాగరాజు ఇలా కీర్తించాడు-

శాంతము లేకా, సౌఖ్యము లేదూ
సారస దళ నయనా!
దాంతుని కైన - వేదాంతునికైన
శాంతము లేక సౌఖ్యము లేదు
దారసుతులు ధనధాన్యము కలిగిన
సారెకు జపతప సంపద కలిగిన
ఆగమశాస్త్రము లన్నియు చదివిన
బాగుగ సకలహృద్భావము తెలిసిన
యాగాది కర్మము లన్నియు జేసిన
భాగవతులనుచు బాగుగ పేరైన
రాజాధిరాజ! శ్రీరాఘవ! త్యాగ
రాజ వినుత! సాధురక్షక! తనకుప
శాంతము లేక సౌఖ్యము లేదు
సారస దళ నయన!

# సాధనావరోధిని

61 సూ. లోకహానౌ చింతా న కార్యా
నివేదితాత్మలోక వేద (శీల) త్వాత్

పరమానంద మూర్తి సేవాతత్పరుడైన భక్తుడు తనది అంటూ లేకుండా భగవంతునికి సర్వసమర్పణ గావిస్తాడు. అంతా శ్రీ/రామ మయంగా భావిస్తాడు. లాభం నష్టం సుఖం దుఖం అన్నీ విడిచి ద్వంద్వాలకు అతీతుడవుతాడు. తన మనస్సును భగవంతునిలో లయంచేసినపుడు, భగవంతుని చేతిలో తాను ఒక పాత్రను అని భావించినపుడు భగవన్నిర్మితమైన ప్రపంచంలోని మంచి చెడ్డలు వానికెందుకు? సేవా పరతంత్రుడైన వానికి స్వతంత్ర ఆలోచన ఏమిటి? కనుక ప్రపంచం ఏమైపోయినా భక్తుడు బాధపడడు. సాక్షీభూతంగా చూస్తుంటాడు. ఆ స్థితిలో ప్రాముఖ్యం లేని కర్మకాండల ప్రశ్నే లేదు.

భక్తుడు సర్వసంగ పరిత్యాగి. అతనికి కావలసింది ఏదీ లేదు. భగవంతుడొక్కడే అతనికి కావలసింది. పరాత్పరుని చింతనలో మునిగి ఉండుటే కాని, అతనికి అన్యచింతన లేదు. ఆ భక్తుడు ఇది ఒక పరీక్షగా

భావించి సమాధిలో స్థిర మగ్నుడు అవుతాడు. భార్యాపుత్రులు ధనం ధాన్యం గౌరవం మర్యాదా ఉండనీ పోనీ అతనికేమీ పట్టదు. ప్రపంచం తలక్రిందులు కానీ, నక్షత్రాలు రాలనీ, సముద్రం ఇంకనీ అతడు తొణకడు. పైగా ప్రతి కదలికలోనూ భగవంతుని లీలావిలాసాలు దర్శిస్తుంటాడు. స్థితప్రజ్ఞుడై ఆత్మావలోకనారూఢుడై నిలిచిపోతాడు. ఆతనికి సంకల్పమే ఉండదు. ఆతడు సంకల్పరహితుడు, పరమేశ్వర రూపసందర్శనాతత్పరుడు, ఆత్మజ్ఞాన విలోకనాభిలాషుడు, విష్ణుదేవుని విశ్వవిరాడ్రూపదర్శనుడు. అట్టి భక్తుడు భగవంతుని ఇలా ప్రార్థిస్తాడు.

> నిను సేవింపగ నా పదల్పొడమనీ. నిత్యోత్సవంబబ్బనీ,
> జనమాత్రుండననీ, మహాత్ముడననీ, సంసార మోహంబు పై
> కొననీ, జ్ఞానము కల్గనీ, గ్రహగతుల్ కుందింపనీ, మేలు వ
> చినరానీ అవి నాకు భూషణములో! శ్రీకాళహస్తీశ్వరా! 1

62 సూ. న తదసిద్ధౌ లోక వ్యవహారో హేయః
కింతు ఫల త్యాగ స్తత్సాధనంచ కార్యమేవ

"భక్తులకు కర్మకాండ ఆవశ్యకత లేదు" అనుకుంటారేమో, ఆ భక్తులు భక్తి తపస్సులో పరిపూర్ణ సిద్ధి పొందనంతవరకు లౌకిక వైదిక కర్మకాండ విడువరాదు. కర్మఫలం త్యాగంచేసి కర్మలు చేయవలసిందే అన్నారు విజ్ఞులు.

భగవత్ ప్రేమ లభించినచో కర్మజాలం విడిపోతుంది. భక్తుడు తెలిసి వాటిని త్యజించరాదు. సర్వ సమర్పణ అంటే ఆత్మ నివేదనం.

---

1. కాళహస్తీశ్వర శతకం - ధూర్జటి

అది ప్రేమ భక్తి యొక్క చరమదశ. ఆ దశ విధి నిషేధాలకు అతీతం. అపుడు కర్మకాండ అదే తొలగిపోతుంది. అపుడతడు ముక్త పురుషుడు.

భక్తుడు తెలిసి లోకధర్మాలు వేదాచారాలు త్యజించరాదు. కర్మ ఫలత్యాగం చేసి కర్మలు చేస్తుండాలి. నిష్కామ కర్మయోగి లోకం యొక్క సర్వ కార్యాలనుండి విముక్తి పొందుతాడు. నిష్కామంతో చేసే కార్యాలు ప్రేమప్రాప్తికి దోహదాలు. కనుక భక్తులు కర్మలను ఆచరించ వలసిందే. ఫలం భగవదర్పితం చేయవలసిందే. బ్రహ్మసూత్రాలుకూడా ఇదే బోధిస్తున్నాయి –

1. సహకారిత్వేన చ ఆశ్రమ కర్మఅనుష్ఠేయ మేవ.
2. ఆప్రాయణాత్తత్రాపి హి దృష్టం.
3. అగ్నిహోత్రాది తు తత్కార్యాయైవ తద్దర్శనాత్.

కర్మలు జ్ఞానార్జనకు సాధనాలు. జీవితాంతం నిత్యానుష్ఠానం చేయవలె. ఉపాసనా పూర్వకమైన జ్ఞానంచేతనే బ్రహ్మప్రాప్తి కలుగుతుంది. అట్టి ఉపాసన ఎడతెగక చేస్తుండాలి.

లోకం శిష్టులను అనుసరిస్తుంది. శిష్టులు కర్మలను ఆదర్శవంతంగా నిర్వర్తించాలి. బ్రహ్మభావనం చేయుటమే కర్మత్యాగం అవుతుంది. కర్మ ఫల త్యాగం పరమేశ్వరారాధనం. కర్మ ఫల త్యాగంచేసి భక్తుడు విశ్వ కల్యాణకర కార్యక్రమాలు చేస్తుండాలి.

× × × ×

ధర్మము సత్యము కీర్తియు
నిర్మల దయ విష్ణు భక్తి నిరుపమ ఘనసత్
కర్మ మహింసావ్రతమును
నర్మిలి గలవారె పుణ్యు లవనీనాథా! 1

---

1. భాగవతం ద్వాదశ 16

63 సూ. స్త్రీ ధన నాస్తిక వైరి
చరిత్రం న శ్రవణీయం.

భక్తుడు స్త్రీలకథలు, సంపద్వృత్తాంతాలు, నాస్తిక ప్రసంగాలు, శత్రువుల బోధలు, గాథలూ వినరాదు.

'లౌకిక కార్యకలాపాలు, వైదిక కృత్యాలు విడరాదు. ఫలత్యాగం చేసి విధ్యుక్త కర్మలు చేయాలి' అని బోధించిన నారద మహర్షి ఈ సూత్రంలో భక్తుడు ఏ ఏ కార్యకలాపాలకు దూరంగా ఉండాలో వివరించాడు.

స్త్రీ, ధనం, నాస్తిక, వైరి విషయాలకు దూరంగా ఉండడం మంచిది అన్నాడు. ఏలనంటే స్త్రీ వ్యసనం అన్ని వ్యసనాలకంటె ప్రమాదకరం. అందువల్ల ముందుగా స్త్రీని గురించి చెప్పాడు. ఈ వ్యసనం పురుషుణ్ణి త్వరితంగా పతితుణ్ణి చేస్తుంది.

ప్రథమంలో స్నేహంగా ప్రారంభమైనా క్రమక్రమంగా పరిస్థితుల పరిభావంచేత పరస్పర ఆకర్షణలవల్ల అనుబంధం బలపడిన ఈ కలయిక కామంగా మారుతుంది. స్త్రీనిగూర్చిన ఆలోచనలో కాముకత వృద్ధి అవుతుంది. అది భగవత్ భక్తికి వ్యతిరేక దిశలో పయనించి భక్తుణ్ణి పతనోన్ముఖుణ్ణి చేస్తుంది. గృహస్థులు ఈ విషయంలో వివేకంతో పరివర్తించాలి.

భక్తుడు స్త్రీ పాద పద్మాలపైనే దృష్టి సారించాలి. స్త్రీని మోహ దృష్టితో చూచి ఎందరు పతనమైనారో చరిత్ర సాక్ష్యమిస్తున్నది. కామం చేత రావణకీచకాదులు నాశనమైనారు, భక్తుడు స్త్రీని పరదేవతా రూపంగా మనస్సులో ఆరాధించాలి. లక్ష్మణస్వామి సీతామాత ముఖ కమలమే చూడలేదట. సేవలు చేశాడు. వందనంచేశాడు. "అన్నా నేను

వదినగారి పాదాలు, పాదాభరణాలు మాత్రం ఎరుగుదును. కానీ కంఠాభరణాలు, హస్తాభరణాలు, శ్రవణాభరణాలు ఎరుగను" అంటాడు, రామునితో లక్ష్మణస్వామి :-

"నాహం జానామి కేయూరే
నాహం జానామి కుండలే
నూపురే త్వభి జానామి
నిత్యం పాదాభి వందనాత్" 1

ఇటువంటి లక్ష్మణస్వామిని గృహస్థులు ఆదర్శంగా తీసుకోవాలి.

తరువాత ధన వ్యామోహం కడుచెడ్డది. ధనలోభం మనిషిని పతనం చేస్తుంది. మనిషి ధనాశలోపడి శీలం పోగొట్టుకుంటాడు. న్యాయాన్యాయాలు ధర్మా ధర్మాలు పాపపుణ్యాలు వాడు లెక్కింపలేడు, అక్రమంగా పోగు చేసిన ధనాన్ని సక్రమార్జనగా నిరూపించడానికి మానవుడు ఎన్ని అవస్థలో పడతాడు. కనుక భక్తుడు ధనికుల ప్రసంగాలు, ప్రశంసలు వినరాదు. తాను చేయరాదు. కామినీకాంచనాలు భక్తులకు పూర్తి నిషేధాలు. వాటికి ఎంతదూరంగా ఉండగలిగితే భక్తుడు అంత ఉత్తమ స్థితికి చేరుకుంటాడు. ధనదాహం పిశాచంవలె మానవుణ్ణి పట్టి నాశనం చేస్తుంది.

నాస్తిక సాంగత్యం మూడవది. నాస్తికులతో వాదమునకు దిగుట భక్తునకు కూడదు. వారు ప్రత్యక్ష హేతువులూ, ప్రమాణాలూ, చూపమని వాదిస్తారు. భక్తి లౌకిక ప్రమాణాలకు అందునది కాదు. కనుక నాస్తికులతో వాదించి లాభములేదు. వారిని సంస్కరిద్దాము అనుకోవటం భ్రమ. వారి మాటలలో పడి ఈ భక్తుడే పతనమైపోతే

1. రామాయణం

ప్రమాదాలు ఎక్కువగా ఉన్నాయి. మనస్సును కలుషితంచేసే నాస్తికుల స్నేహం, భాషణం ఎన్నటికీ పనికిరాదు. భగవంతుణ్ణి గూర్చి కువిమర్శలు చేసేవారినుండి దూరంగా ఉండాలి. లేనిచో ఈశ్వరునిపై అవిశ్వాసం కలుగుతుంది. శ్రద్ధ తరుగుతుంది. పతనం ప్రారంభమవుతుంది. కనుక నాస్తిక స్నేహం వర్జనీయం.

పరిపూర్ణత అందని భక్తుడు క్షణం క్షణం మరీ జాగ్రత్త పడాలి. అకారణ ద్వేషం వహించే ఖలులు లోకంలో కొల్లలు. వారు భక్తులను మిత్రులుగా ఉండే పరిహాసం చేస్తారు. అవహేళన చేస్తారు. వారు భక్తునకు పరమ శత్రువులు. వారు ఎదుటపడినా వారి మాటలు వినరాదు. వారి భాషణ వలన భక్తుని మనస్సులో క్రోధం, అసహిష్ణుత మొలకెత్తుతాయి. అంతటితో అంతశ్శత్రువులు ప్రకోపిస్తారు. కనుక భక్తుడు వైరుల నీడ సోకనంత దూరంగా ఉండాలి. భక్తుడు ఏకాంత సేవనం చేయాలి అన్నారు.

ఏకాంతవాసం అంటే విషయలంపటులతో ఉండరాదు అనే భావం. బొత్తిగా ఎవరూ లేనిచోట కూర్చున్నప్పుడు మనస్సులో అనేక పిచ్చి ఆలోచనలు బయలుదేరతాయి. ఆ సమయంలో అక్కడికి ఒక పరమార్థ సాధకుడు వస్తే ఆ ఆలోచనలు వెళ్ళిపోతాయి. మనస్సు సిగ్గుపడుతుంది. కనుక సాధకుడు అవకాశం కల్పించుకొని అయినా సరే పరమార్థ సాధకులతో సర్వదా కలిసి ఉండాలి. 1

కాంత వలన కామం, ధనం వలన లోభం, నాస్తికుల వలన భగవంతునిపై అవిశ్వాసం, వైరి వలన క్రోధం, మొదలైన అంతశ్శత్రువులు మనస్సుపై దురాక్రమణ చేస్తాయి. కనుక భక్తుడు అంతశ్శత్రువులనుండి తనను తాను రక్షించుకోవాలి అని నారద మహర్షి స్త్రీ ధన నాస్తికాదుల తోడి సంబంధాలను నిషేధించాడు.

---

1. మహాపూర్ణ యతీంద్రులు - మహాపూర్ణవాణి - ౧ - 27

కాశిపై వ్యాసుడు కోపించి చిందులు త్రొక్కుతున్నపుడు కోపం పాపహేతువు అని అన్నపూర్ణ ఇలా మందలిస్తుంది –

క్రోధంబు ఫలమె నిర్మల
బోధమునకు - తీర్థవాసమున కర్హంబే
క్రోధముః వారాణసిపై
క్రోధించిన విశ్వ భర్త కోపింపడొకో! 1

64 సూ. అభిమాన దంభాదికం త్యాజ్యమ్

భక్తుడు అభిమానం, గర్వం, దంభం మొదలైన దుర్గుణాలు విడిచి పెట్టాలి.

"స్త్రీ సాంగత్యం లేదు. ధనంపై లోభంలేదు, నాస్తిక ప్రసంగం వీనుల పడటం లేదు. శత్రువులవైపే చూడటంలేదు. కామినీ కాంచనాలు జయించాను. నేను గొప్ప ఆస్తికుణ్ణి. అజాత శత్రువుణ్ణి" అని భక్తుడు ఎన్నడూ పలుక కూడదు. మానసంలో అనుకోకూడదు. కించిత్తు కూడా గర్వించ కూడదు. ఈ గర్వం భక్తుణ్ణి ఉన్నత శిఖరాల నుండి క్రిందికి తోస్తుంది. గర్వం- అభిమానం- అహంకారం భక్తునికి పతన హేతువులు.

ధన గర్వం, విద్యాగర్వం, బలగర్వం, సౌందర్య గర్వం, మేధా గర్వం, కులగర్వం, ఆశ్రమ గర్వం తపో గర్వం అనేవి అనేక రకాలు. ఇందులో ఏ ఒక్కటీ పనికిరాదు భక్తునికి

సద్గుణం లభించినా, సాధన సక్రమంగా సాగుతున్నా, ఉన్నతి చెందుతున్నా, అది అంతా పరమేశ్వర కరుణా కటాక్షం వల్లనే అనుకోవాలి. కానీ తన తెలివితేటలు అని ఏ పరిస్థితులలోనూ తలంచరాదు.

1. శ్రీనాథుడు కాశీఖండం సప్తమ 194

భక్తుడు ఈ గర్వం నుంచి దూరంగా ఉండాలి. అంటే సతతము వినయం, నమ్రత, దీనభావం, భగవత్ దాస్యభావం, అభ్యాసం చేసుకోవాలి. దాస్య భక్తిలోగల వినమ్ర భావంతో ఈ గర్వం కొంతదూరం అవుతుంది.

ఆడంబరం మంచిదికాదు. బాహ్యవేషాలు వేసుకొని ధర్మాత్ముని వలె భక్తుని వలె త్యాగివలె డాంబికంగా ఇతరుల ఎదుట కనిపించరాదు. కపటం,వేషం వల్ల తన ఆధ్యాత్మిక సంపత్తులు నష్టం అవుతాయి. సరళ స్వభావం నిరాడంబరత ఇవే భక్తునికి ఆత్మ కవచాలు. భక్తుడు సుగుణాలు వృద్ధి చేసుకుంటూ దుర్గుణాలూ విడనాడాలి. ఆసురీ సంపదలైన దుర్గుణాలేవీ కూడా దరికి రానీయతగదు.

ఆసుర స్వభావులు ధర్మం వైపు నడువలేరు. వారికి సత్య శౌచాదులుండవు. వేదాలను పురాణాలను ప్రమాణాలుగా వారంగీకరించరు. ఈశ్వరుడొకడున్నాడని కూడా వారంగీకరించరు. స్త్రీ పురుష సంయోగం మాత్రమే ప్రపంచానికి మూలం అని వారి విశ్వాసం. వారు క్రూర కర్ములై లోకాపకారులై అల్ప బుద్ధులై లోక వినాశనానికి జన్మిస్తుంటారు. వారు దురభిమాన మదయుక్తులై కాముకులై అవివేకంతో క్షుద్ర దేవతారాధనలు చేస్తూ అపవిత్ర వ్రతాలూ హింసలూ చేస్తుంటారు. అపకారం అహంకారం పరపీడనం వారి గుణాలు. సన్మార్గులను బాధించటం దుర్మార్గులను భూషించటం వారి అలవాటు. వారు ఆసురీ ప్రవృత్తులు గలవారు. వారు ఆసుర జన్మలెత్తుతుంటారు.

కనుక భక్తుడు ఇటువంటి ఆసుర గుణాలను దరికి జేరనీయరాదు. చేరనిస్తే పతనం తథ్యం.

మనసు కామక్రోధ మదలోభ ములకిచ్చి
సడలింతు రన్వయాచార సరణి
అన్వయా చారంబు లట్లు మాసి చనంగ
వర్తింతు రన్యాయ వర్తనమున
అన్యాయవర్తనంబది కారణము కాగ
పడి మునుంగుదు రగ్రి భవ పయోధి
భవ పయోనిధిలోన పడియుండి కాంతురు
నరకకూపమున ఉన్మజ్జనంబు
నిరయమున పెద్దకాలంబు నిశ్కృతి పొంది
ఇలకు వచ్చిజనింతురు హీనజాతి
హీన జాతి జనించి పాపానువృత్తి
పాపులగుచుందురట అధః పాతమునను 1

65 సూ. తదర్పి తాఖిలా చారః సన్
కామ క్రోధాభిమా నాదికం
తస్మిన్నేవ కరణీయమ్.

ఇంద్రియ విలాసాలు వికారాలు జయించటం మనిషికి అలవికాని పని. అందుచే అన్ని సంపదలతో బాటు ఈ కామక్రోధాభిమానాలు, గుణవికారాలు అన్నీ భగవంతునికే సమర్పించు. ఇది అవశ్యం చేయ దగిన పని-అని నారద మహర్షి అంటాడు.

ఆత్మ సమర్పణ చేసిన భక్తునకు కామక్రోధాలు ఉండవు. ఒక వేళ ఉంటే అన్నీ స్వీకరించిన మురళీలోలుడు ఇవి మాత్రం ఎందుకు స్వీకరించడు? లాభాలు నష్టాలు అన్నీ ఆయనవే.

---

1. శ్రీనాదుడు భీమేశ్వర పురాణము పంచమ 173

ఈ కామక్రోధాలు ఆ భగవంతునిపైన చూపకల్గితే ఆ భక్తుడు పునీతుడు. ప్రేమకు పాత్రుడైన భగవంతుడు భక్తుని క్రోధానికి కూడా పాత్రుడే. భక్తునికి ప్రపంచంలో భగవానుడు దక్క మరొకరులేరు. అసలు భక్తిలో ఆసురగుణాలుండవు. భక్తుల పరమోద్దేశ్యం పరమేశ్వర ప్రీతి ఒక్కటే. ఆ సచ్చిదానంద మూర్తికి 'సుఖం కలుగజేయాలి' అనేదే వారి తపన.

అట్టి భగవంతుని కలుసుకోవాలని భక్తునికి కామం. తన ప్రాణ నాథుడు కనిపించకపోతే క్రోధం. ఆ ప్రియుడు తనను ఉపేక్ష చేసి మరొకరిని చేరదీస్తే అసూయ. ఇవి మధుర భక్తిలోని లీలలు.

ఒక భక్తురాలు –

కామ జనక! నిన్ను తలచుకొనగానె కలిగె కామమ్ము
స్వామి! నీరాక జాగైన నీపైన వచ్చు క్రోధమ్ము
నీమోము కనుగొన్నయంత మోహమ్ము నిలువునా ముంచు
మామనః పతి! ప్రేమ వేరొకరిదైన మాత్సర్యమొదవు
స్వామి! నేబలహీనురాల, జయసత్యసాయీ! నమోస్తు!

నిను పొందితినటన్న మదము గుండెలోనిండి పోయినది
నిను పట్టిలో దాచుకొనెడి లోభమ్ము నిలిచిపోయినది
గుణములు నన్నంటి యుండె విడిపించుకోలేక యుంటి
నను ముద్దరాలుగా తలచి బ్రోవవే నా ప్రాణనాథ!
జన మనో హార! దేవ! స్వామి! జయసత్యసాయీ! నమోస్తు! 1

— 'జయసత్యసాయీనమోస్తు' శతకంనుండి

ఇలా భక్తురాలు తన గుణాలకు భగవంతునే కేంద్రం చేసుకొని పరి తపిస్తుంది.

'కృష్ణసుఖైక తాత్పర్య గోపీభావ వర్య'

కృష్ణప్రేమతో పరమ పునీతమైన దివ్య ప్రేమోన్మాదుల కామ క్రోధాదులు పరమపవిత్రాలు అవి పాపలతాలవిత్రాలు. అందువల్లనే విరాగులు జీవన్ముక్తులు, మహాయోగులు కూడా ప్రేమూర్తి స్వరూపులైన గోపీ జనుల విరహ వేదనలూ క్రీడలూ చూడటానికి వినటానికి ఉత్కంఠితు లవుతారు.

శ్రీ రుక్మిణీదేవి కృష్ణుని ఇలా ప్రార్థించింది –

ఓ కమలలోచనా! సనాతనులైన ఉమామహేశ్వరాది దేవతలు నీ పాదధూళి శిరమున ధరించాలని వాంఛిస్తారుకదా! అటువంటి నీ పాద ధూళి నాకు ఇసుమంత ప్రసాదించండి. అలా నను కృపదలచి స్వీకరించక పోతే అనశన వ్రతం పట్టి ప్రాణాలు వదులుతాను. నన్ను స్వీకరించు స్వామీ! నిన్ను నే కోరటంలో తప్పేముంది!

ధన్యున్ లోకమనోభిరాము కులవిద్యారూపతారుణ్య సౌ
జన్యశ్రీబల దాన శౌర్య కరుణా సంశోభితున్ నిన్ను ఏ
కన్యల్ కోరరు కోరదే మును రమాకాంతాలలామంబు రా
జన్యానేకపసింహ! నావలననే జన్మించెనే మోహముల్ 1

ఇక్కడ "మోహము" కృష్ణునిపై కలిగి చరితార్థమైంది.

కృష్ణ దేవుని పట్టపు రాణులు ద్రౌపదీ దేవితో తమ కోరిక ఇలా తెల్పుకుంటారు –

1. ఆంధ్రభాగవతం దశమ స్కంధం 1701

"ఓ ద్రౌపదీ! మాకు పృథ్విలో ఏ సంపదలూ భోగాలూ అక్కర లేదు. రాజ్యాలేకాదు బ్రహ్మపదంపై కూడా కోరిక లేదు. కమలాకుచ గంధంతో కూడిన శ్రీవారి చరణధూళి మా తలపై ధరిస్తుండాలి అనేదే మా కోరిక. ముక్తికంటె శక్తిగలది ఈధూళి."

ఈవిధంగా నారద మహర్షి ఈ సూత్రంలో కామక్రోధ అభిమానాదులు భగవంతుని విషయంలో కరణీయములే అన్నాడు. వాటి వలన భక్తునికి భగవంతునికి అవినాభావ సంబంధం ఏర్పడి గాఢానురాగం కల్గుతుంది. ఆత్మీయత ఆప్యాయత మరింత గట్టిపడుతుంది. స్వామికి భక్తుడు ఆప్తబంధువు అవుతాడు. భగవంతునిపై భక్తుడు అనురాగ పూర్వకమైన అధికారం చెలాయిస్తాడు. మధుర భక్తిలోని మాధుర్యం ఇదే.

ప్రాణేశ! నీ మంజుభాషలు వినలేని
కర్ణరంధ్రంబుల కలిమి యేల!
పురుషరత్నమ! నీవు భోగింపగాలేని
తనులత వలని సౌందర్యమేల!
భువన మోహన! నిన్ను పొడగానగా లేని
చక్షురింద్రియముల సత్త్వమేల!
దయిత! నీ అధరామృతంబానగా లేని
జిహ్వకు ఫలరస సిద్ధియేల!
నీరజాత నయన! నీవన మాలికా
గంధ మబ్బలేని ఘ్రాణమేల!
ధన్య చరిత! నీకు దాస్యంబు సేయని
జన్మమేల ఎన్ని జన్మములకు 1

# పరమ ప్రేమ

౬౬ సూ. త్రిరూప భంగ పూర్వకం
నిత్యదాస నిత్యకాంతా భజనాత్మకం వా
ప్రేమైవ కార్యం ప్రేమైవకార్యమ్

మధుర భక్తిలో ప్రేమ-ప్రియుడు-ప్రియురాలు, దాస్య భక్తిలో దాస్యము-స్వామి-దాసుడు ముఖ్యపాత్రలు.

పతివ్రత భర్తను సేవించినట్లూ దాసుడు స్వామిని సేవించినట్లూ, అంతకంటె అధికతరంగా భక్తుడు భగవతుని ఆరాధించాలి, ప్రేమించాలి.

ఈ స్థితిలో స్వామి-సేవకుడు అనిగాని, పతి-సతి అనిగాని హద్దులుంచకుండా అనంత అభేద భావంతో స్వామి సేవలో లీనం కావాలి. మధుర, దాస్య, భక్తి మార్గాలవల్ల తాదాత్మ్యం పొందుతాడు భక్తుడు. నిష్కామ భావంతో మనోవాక్కాయ కర్మలు సర్వేశ్వర సమర్పణం అవుతాయి. భక్తునికి సర్వావస్థలలోను సర్వేశ్వరుడే దర్శనం ఇస్తాడు.

దాస్య భక్తి ఆదర్శము అటువంటిది. దాసునికి మతి, గతి, ప్రాణం, త్రాణం, ధర్మం, కర్మం, భుక్తి, ముక్తి, రక్తి, శక్తి సర్వం స్వామియే. భక్తునికి ఇంతకంటె విలువైన పదార్థం బ్రహ్మాండంలో మరొకటి లేదు. మధుర భక్తిలో కూడా ఇదే స్థితి.

స్త్రీకి నాథుని ధనమే తన ధనం. ఆయన మనస్సే తన మనస్సు. ఆయన సేవే సేవ. ఆయనే పురుషుడు. ఆయన కీర్తియే తనయొక్క నిజమైన కీర్తి. ఈ విధమైన సేవా కార్యంలో పవిత్ర ప్రేమ కార్యంలో మగ్నమై ఉండటమే భక్తుని పనికూడ.

భార్య కాగానే స్త్రీ తన తల్లినీ, తండ్రినీ, కులమూ, గోత్రమూ పుట్టింటిలోని భోగమూ భాగ్యమూ అన్ని త్యాగం చేస్తుంది. తనవి అనేవి అన్నీ తన పతికిచ్చి వేస్తుంది. అవి పతివిగానే భావించబడతాయి. ఈ మమేక భావం భక్తుని చరమాకాంక్ష. దాసుని స్థితికూడా ఇంతే. దాసుడు తనది అనేది కోల్పోయి స్వామి మనిషి అవుతాడు. రాధాదేవి ఉద్ధవునితో ఇలా అంటుంది-

"కృష్ణ భక్తిః కృష్ణదాస్యం వరేషుచ వరం వరమ్
శ్రేష్ఠా పంచవిధా ముక్తే ర్హరి భక్తిః గరీయసి
బ్రహ్మత్వాదపి దేవత్వా దింద్రత్వా దమరాదపి
అమృతాత్ సిద్ధి లాభా చ్చ హరిదాస్యం సుదుర్లభమ్" 1

అన్ని వరాల కంటె శ్రేష్ఠమైన వరం కృష్ణభక్తి, కృష్ణదాస్యం. పంచవిధ ముక్తులకంటె శ్రేష్ఠం హరిభక్తి. బ్రహ్మత్వం దేవత్వం ఇంద్రత్వం అమరత్వం కంటె అమృత సిద్ధులకంటె హరిభక్తి లభించటం చాలా దుర్లభం సుమా!

---

1. బ్రహ్మ వైవర్త కృ. 97/89

ఈ విధంగా లభించిన హరి భక్తిని దాస్యభావంతో కాంతా తత్త్వంతో ఉపాసించటమే ప్రేమ కార్యం. ఇలాగే భగవంతుని ఆరాధించి జన్మ చరితార్థం చేసుకోవాలి.

లోకంలో స్వామిదే ప్రేమ కార్యం! అదే ప్రేమ కార్యం! అంతా ప్రేమ మయం! లోకం ప్రేమ సూత్రంపైనే నడుస్తోంది. అని నారద మహర్షి నొక్కి వక్కాణించాడు.

ఏ ప్రేమ మహిమచే ఈధారుణీ చక్ర
మిరుసు లేకుండనే తిరుగు చుండ
ఏ ప్రేమ మహిమచే ఎల్ల నక్షత్రాలు
నేల రాలక మింట నిలచియుండు
ఏ ప్రేమ మహిమచే పృథివిపై పడకుండ
కడలిరాయడు కాళ్ళు ముడుచుకొనును
ఏ ప్రేమ మహిమచే ఈరేడు భువనాల
గాలి దేవుడు సురటీలు విసరు.

ఆ మహాప్రేమ - శాశ్వతమైన ప్రేమ
అద్భుత మఖండ మవ్యక్తమైన ప్రేమ
నిండి యున్నది బ్రహ్మాండ భాండ మెల్ల
ప్రేయసీ! సృష్టి యంతయు ప్రేమమయము 1

67 సూ. భక్తా ఏకాంతినో ముఖ్యాః

ఏకాంత భక్తుడు అంటే అనన్య భక్తుడు. అతడు ఏకేశ్వరోపాసనా పరుడు-ఆతడు ఇతర భక్తులందరిలోనూ సర్వశ్రేష్ఠుడు. పూర్వ సూత్రంలో వివరించినట్లే భక్తుడు తన్మయుడై ఏకైక ధ్యేయంతో ఈశ్వర ధ్యానం చేయవలసిందే.

1. కరుణశ్రీ ఉదయశ్రీ ప్రథమ భాగం

సాలోక్య సార్ష్టి సామీప్యసారూప్యైకత మప్యుత
దీయమానం న గృహ్ణంతి వినా మత్సేవనం జనాః
స ఏవ భక్తి యోగాఖ్య ఆత్యంతిక ఉదాహృతః
యేనాతి వ్రజ్య త్రిగుణం మద్భావా యోపపద్యతే 1

భాగవతంలో ఇలా అంటాడు వాసుదేవుడు - నా భక్తుడు ఏ ముక్తులను అపేక్షించడు. పరమాత్ముని చేతిలో యంత్రంవలె భక్తుడు పని చేస్తుంటాడు. వాని ఆత్మ పరమాత్మలో లీనమై పోతుంది.

నా రాముడు నా హృదయంలో నిండి ఉన్నపుడు మరొకడు ఎలా లోపలికి ప్రవేశించగలడు? అని అద్వైత భావాన్ని ఏకేశ్వరో పాసనను బలపరచాడు కబీరు.

జ్ఞానవాశిష్ఠంలో 'ఉద్దాలకుడు గంధమాదన పర్వతగుహలో ఏకాంతంగా అనేక వత్సరాలు తదేకధ్యానంలో సమాధి మగ్నుడైనాడు. దహరాకాశంలో చైతన్య జ్యోతిని దర్శించి బ్రహ్మైక్యం పొందినాడు' అని ఉంది. ఇతర రఘువంశాది గ్రంథాలలో కూడా రాజులు రాజ్యాలు వదలి వానప్రస్థంలో ఏకాంత స్థలాలలో జప తపాదులద్వారా ఆత్మ జ్ఞానాన్ని అందుకొన్నారు, అని వివరించారు. అందువల్ల భక్తులు ఏకాంతంగా ఆత్మవిచారం చేయాలని నారదమహర్షి ఆశయం.

శ్రీనాథుడు, జానకీనాథుడు ఒక్కరే. రెండూ పరమ పురుషుని అవతారాలే. అయినా నా రాముడు నా సర్వస్వం. నాకు రామదర్శనమే కావాలి అంటాడు అనన్య భక్తుడైన హనుమంతుడు.

శ్రీనాథే జానకీనాథే అభేదః పరమాత్మని
తథాపి మమ సర్వస్వం రామః కమలలోచనః 2

1. శ్రీమద్భాగవతం
2. శ్రీమద్రామాయణం

68 సూ. కంఠావరోధ రోమాశ్రుభిః
పరస్పరం లపమానాః
పావయంతి కులాని పృధ్వీంచ

మహా భక్తులు గద్గద కంఠంతో పులకాంకురాలతో ఆనంద బాష్పాలతో భగవదనుభూతులతో గూడిన అనుభవ ప్రసంగాలు ఎక్కడ చేస్తుంటారో ఆ ప్రదేశం దివ్య ప్రకాశం విరమ్మ్మతుంది. అట్టి మహాత్ములు జన్మించిన కులం గోపాలదేవుని గోకులం అవుతుంది.

భక్త వర్యులు భగవచ్చర్చ చేస్తుంటే ప్రేమామృతం చిందుతుంది. వారు భగవల్లీలలను తాదాత్మ్యం పొంది వివరిస్తూంటే వారి కంఠం గాద్గదికం చెందుతుంది. వారి శరీరం పులకాంకురాలతో గగుర్పొడుస్తూంటుంది. నేత్రాల నుండి ఆనంద బాష్పాలు పొంగి పొరలి వస్తుంటాయి. వారు ప్రసంగాలు చేస్తూ చేస్తూనే భగవంతునితో తాదాత్మ్యంజెంది బాహ్యం మరచి సమాధిలో లీనం అవుతూంటారు. వారి శరీరంలోని రోమరోమం నుండి పవిత్రప్రేమ కాంతులు వెలుగుతూంటాయి. వారు ఎక్కడ ఉంటే అక్కడి వాతావరణం పరమ పవిత్రం, ప్రేమ ప్రవాహ సంభరితం. వారి జననీ, జన్మభూమీ కూడా చరితార్థాలు.

"నా భక్తుడు ఆత్మానుభవం వివరించే సమయంలో గద్గదమైన వాక్కులతో ఆర్ద్ర చిత్తంతో ఆనందంతో విరహ విలాపంతో అనుభూతి పొందుతూంటాడు. ఒక్కసారి ఉచ్చస్వరంతో పాడతాడు. నృత్యం చేస్తాడు. అట్టి నా భక్తుడు మూడు లోకాలను పావనం చేస్తాడు"

మచ్చిత్తా మద్గత ప్రాణా బోధయంతః పరస్పరమ్
కథయంతశ్చ మాం నిత్యం తుష్యతి చ రమంతి చ

మహామునుల భక్తి రసగోష్ఠులతోనే వనాలు పావనాలు అయినాయి. అరణ్యాలలోనే విజ్ఞానం వెల్లి విరిసింది. బృహదరణ్యకాలు అక్కడే భక్తిరసం పీల్చుకొని పెరిగి పరిపుష్టి చెందాయి. భక్తుల సంగం వల్లనే వన్యజీవులు ధన్యములయినాయి. జంతు సంతానాలు కూడా జాతి వైరం మరచి స్నేహంగా బ్రతకసాగాయి. మాతంగ మహర్షి స్నేహదృష్టి వలన శబరి జీవనం పరమ పావనమయింది హనుమంతుని చూడండి. రామనామం చెవిలో పడగానే ఎంతగానో పులకించి పోతాడు.

యత్ర యత్ర రఘు నాథకీర్తనం
తత్ర తత్ర కృత మస్తకాంజలిం
బాష్పవారి పరిపూర్ణ లోచనం
మారుతిం నమత రాక్షసాంతకమ్

భక్తుని హృదయం అట్టిది. భగవన్నామంతో భక్తుని హృదయం పొంగిపోతుంది. ఆతని కనులవెంట ఆనందాశ్రువులు జాలువారుతాయి.

అట్టి భక్తుల వలన భువనం పరమ పావనం అవుతుంది. హనుమంతునివలన కపికులం గజేంద్రునివలన గజ సంతతి, శబరివలన శబరులు గుహునివలన ఓడవారూ అభినందనీయులైనారు.

69 సూ. తీర్థం కుర్వంతి తీర్థాని
సుకర్మీ కుర్వంతి కర్మాణి
సచ్ఛాస్త్రీ కుర్వంతి శాస్త్రాణి

మహా భక్తులు సాధారణ తీర్థాలను మహా తీర్థం చేస్తారు. వారి మహిమ వలన సాధారణ కర్మలు పుణ్యకర్మలు అవుతాయి. వారు ప్రమాణంగా పలుకుటచేత శాస్త్రాలు సచ్ఛాస్త్రాలు అవుతాయి.

కనుక రా తల్లీ! గంగామాతా! కరుణా సమేతా! పరమ పునీతా! అని బ్రతిమలాడితే దివినుంచి భువికి వచ్చింది గంగామతల్లి.

ప్రచేతగణం భగవంతుణ్ణి ఇలా స్తుతించింది—

తేషాం విచారతాం పద్భ్యాం
తీర్థానాం పావనేచ్ఛయా
భీతస్య కిం నరోచేత
తావకానాం సమాగమః 1

'హే భగవాన్! నీ భక్తగణం తీర్థాలను పునీతం పావనం చేయటంకొరకే భూమిపై అవతరిస్తుంటుంది. వారి ఆగమనం సంసార భీతులైన వారికి ప్రీతి ఎందుకుకాదు! సర్వులకు ప్రీతి పాత్రమేకదా లోకం పరమ పావనం అవుతుంది, ధర్మం నిలబడుతుం హరింపబడుతుంది.'

ధర్మరాజు విదురునితో ఇలా అన్నాడు —

భవద్విధా భాగవతాస్తీర్థ భూతాః స్వయం విభో
తీర్థీ కుర్వంతి తీర్థాని స్వాంతః స్థేన గదా భృతా

ఓ ప్రభూ! తమవంటి భక్తవరేణ్యులు స్వయంగా తీర్థం శ్రీవిష్ణు నామ మహిమచే మీరు కల్మష జలానికి తీర్థత్వం ప్రసాదిః దానిని పవిత్రీభూతం చేస్తారు.

---

1. భాగవతం 4/30/37
2. శ్రీభాగవతం 1/13/10

70 సూ. తన్మయాః

ఆ మహా భక్తశిరోమణులు తన్మయులు. ఆ ప్రేమ మయులు మహిమా మయులు, భగవత్ప్రభావమయులు. వారు భగవద్గుణవంతులు, భగవంతులు!

నదులు ప్రవహించి సముద్రంలో కలుస్తాయి. అపుడు అది నది కాదు సముద్రం. నదియొక్క అస్తిత్వం పోయి సముద్రమయింది. అలానే భక్తులు భగవదుపాసనలో పండి భగవంతునిలో లీనమయినారు. ఇపుడు వారు భగవత్స్వరూపులే.

వారున్నచోట స్థూల సూక్ష్మ వాతావరణం పరమ పరిశుద్ధం అవుతుంది. వారి సమాగమం వలన క్షేత్రం, పాత్రం, తీర్థం, సార్థకం అవుతాయి. వారిద్వారా భగవన్నామం భగవద్భక్తి భగవచ్ఛక్తి ప్రవృద్ధ మవుతాయి. పాపులు-పుణ్యాత్ములు, మహాత్ములు అవుతారు. వారు ఎంతో లోకసేవ చేస్తారు. కానీ వారు తాము అలా గొప్పగా చేస్తున్నాము అనికూడా అనుకోరు. వారికి ఈ లౌకిక స్పృహే ఉండదు. వారు భగవంతునిలో తాదాత్మ్యం చెంది ఉంటారు. వారు తన్మయులై ఉంటారు. వారికి "సర్వం విష్ణు మయంజగత్". అంతటా అణువణువునా విష్ణువే దర్శనమిస్తాడు. విష్ణువులోనే వారు యుగాలు క్షణాల వలె గడుపుతుంటారు.

జీవాత్మ పరమాత్మలో లీనమయినపుడు శరీరం పరవశమవుతుంది. బాహ్యస్మృతి వారికి ఉండదు బాహ్యాకర్మలు చేస్తున్నా చిత్తం పరమేశ్వరాయత్తం అయినందువల్ల ఇవి వారేమీ ఎరుగరు. ఒకసారి ఇలాంటి అనుభవం దృఢంగా జరిగినా ఇక వారు ఎప్పుడూ ఆ సమాధి స్థితిలోనే ఉండిపోతారు. చివరకు జీవాత్మ పరమాత్మ అవుతుంది.

తన ప్రేమ తపస్సు యొక్క వికాసాభివృద్ధులను అనుసరించి మానవుని పరిపూర్ణత వికసిస్తుంది.

మానసము విష్ణు వందున
లీనమగుచు నించుకయు చలింపక యుండన్
బూనుట సమాధి యగు వి
ద్యానిరతా! ఏకరూప మది భావింపన్ 1

71 సూ. మోదంతే పితరో
నృత్యంతి దేవతాః
సనాథా చేయం భూర్భవతి

ఆ మహా భక్తులను తిలకించి పితృ దేవతలు ఎంతో ఆనందిస్తారు. వారిని చూచి దేవతలు మహోత్సాహ సంతోషాలతో నాట్యం చేస్తారు. అనాథ అనుకున్న భూమి సనాథ అయినట్లుగా మహా సంతృప్తిని సుఖాన్ని పొందుతుంది.

ఇలాంటి భక్తులు అవతరించిన ఆ వంశం హర్షిస్తుంది. 'మా వంశంలో ఎంతటి మహా పురుషుడు పుట్టాడు! మాకు మంచిగతులు ఉత్తరోత్తరా లభిస్తాయి. మా వంశం పరమ పావనం అయింది నేటికి కదా' అని పట్టరాని సంతోషం పొందుతారు ఆ వంశ పురుషులు.

'శ్రీ విష్ణ్వంశ సంజాతుడు పుట్టాడు. దేవతలకు తృప్తిగా జనులు సత్కర్మలు యజ్ఞాలు చేస్తారు. మహా పురుషులు లోక కల్యాణ కార్యాలు నిర్వహిస్తారు. సదాశయాలు నెరవేరుతాయి. దైవ గుణాలకు భూలోకంలో విజయం లభిస్తుంది. ఇక ఫరవాలేదు. ఈ మహా భక్తుడు మానవులనేకాదు దేవతలనుకూడా ఉద్ధరిస్తాడు' అని అమితానందంతో నృత్యం చేస్తారు దేవతలు.

---

1. కళాపూర్ణోదయం - పంచమ 181. పింగళిసూరన

ఒక మహా భక్తుడు అవతరించాడు. అనగానే భూదేవి సుఖంగా కాస్త విశ్రాంతి తీసుకొంటుంది. 'నేను ఇంతవరకు లోకంలో అనాథను అనుకున్నాను కానీ ఈ భక్తుడు తన మహిమామయ ప్రభావంతో ధర్మాన్ని ఉద్ధరించి నాపైగల పాప భారాన్ని దూరం చేస్తాడు అని సంతోషిస్తుంది. దూడ వెంట వచ్చు ఆవువలె భక్తుని వెంట విష్ణుమూర్తి దిగి వస్తాడు. ధర్మోద్ధరణ జరుగుతుంది అని తగిన వరుని పొందిన వధువువలె భూమి సంతోషిస్తుంది.

ఆ స్ఫోట యంతి పితరో
నృత్యంతి చ పితామహాః
మద్వంశే వైష్ణవో జాతః
స న స్త్రాతా భవిష్యతి 1

72 నాస్తి తేషు జాతి విద్యా
రూప కుల ధన క్రియాది భేదః

భక్తులకు జాతిభేదం లేదు, విద్యావశ్యకత లేదు, రూపానికి ప్రాముఖ్యం లేదు, కులం అక్కరలేదు. ధనం ఉన్నవాడు లేనివాడు అనేది లేదు. వృత్తులను బట్టి ఆదర, అనాదర భావాలు లేవు. భక్తికి కావలసింది జాతి, విద్య, రూపం, కులం, ధనం, ఉద్యోగం కాదు. కావలసినవి- విశ్వాసం, ఆత్మజ్ఞానం, జిజ్ఞాస, అభ్యాసం, సమాధి నిష్ఠ, విష్ణు భజనం మాత్రమే.

భక్తిని ఎవరైనా ఎప్పుడైనా ఏజాతివారైనా అభ్యాసం చేసుకోవచ్చు. తిన్నడు నిషాదుడు. గుహుడు పడవవాడు. శబరి అడవిలోని శబర కాంత. ధ్రువుడు ఏ విద్యలు నేర్వని బాలుడు. ప్రహ్లాదుడు ఐదేళ్ళ వాడు. విభీషణుడు రాక్షస కులస్థుడు. హనుమంతుడు వానరుడు.

---

1. పద్మపురాణము

విదురుడు శూద్రుడు. గోపికలు గొల్లపడుచులు. వీరందరు భగవత్ ప్రీతికి పాత్రులైన మహా భక్తులు.

భక్తునకు కులముకన్న మతము ప్రధానమని రామదాసు ఇలాగ అంటాడు –

ఎంతటి పుణ్యమో శబరి ఎంగిలి గొంటివి వింతగాదె–నీ
మంతన మెట్టిదో ఉడుతమైని కరాగ్ర నఖాంకురంబులన్
సంతసమంద జేసితివి - సత్కుల జన్మము లేమిలెక్క? వే
దాంతముగాదె నీమహిమ దాశరథీ! కరుణా పయోనిధీ! 1

73 సూ. యత స్తదీయాః

భక్తులందరు భగవంతునికి ఆత్మీయులే. భక్తులు భక్తియొక్క ప్రభావంచేత భగవదవతార మూర్తులే అవుతారు. ఇందువల్ల భక్తులలో భేదంలేదు. భక్తులందరూ పూజనీయులు. ఎవరూ ఒకరికంటె మరొకరు ఎక్కువకాదు. అలా భావించటం పెద్ద అపచారం అవుతుంది. అలా భావించేవాడు సరియైన భక్తుడుకాదు.

తిన్నని గాథ ఇందుకు చక్కని ఉదాహరణం. తిన్నడు బోయ వాడు. ఒకనాడు అతడు వేటకు వెళ్ళి అలసి సొలసి ఒక చెట్టుక్రింద నిద్రపోయాడు. తిన్నడికి కలలో చంద్రశేఖరుడు కనిపించి అదృశ్య మయ్యాడు. నిద్రలేచిచూచి తిన్నడు ఇది కలా! నిజమా! అని పరిసరాల్ని పరికించాడు. ఆశ్చర్యంగా అతనికి అక్కడ ఒక శివలింగం కనిపించింది. అతని మనస్సులో భక్తి కుదిరింది. "నాతో మాయూరు రా! సామీ! ఇక్కడేముంది?" అన్నాడు తిన్నడు. పరమేశ్వరుడూరకున్నాడు.

---

1. దాశరథీ శతకం

"నీవు రాకపోతే నేనూ పోను. నీతోడిదే లోకం. నాకు ఈ లోకంతో పనే ముంది?" అని అక్కడే ఉండి పరమేశ్వరుని అర్చిస్తున్నాడు తిన్నడు. ఆతడు స్వామికి అర్చన ఇలా చేయసాగాడు-

విల్లొక చంక-అంపపొది వీపున-దొప్పలు కేలుదోయి-పు
క్కిళ్ళ పవిత్ర కాంచనము ఖీ జల-మొప్పగ వచ్చి భక్తి రా
జిల్ల తదంబు మజ్జనము సేయుచు దొప్పల నంజు-డ్రదిశా
జల్లుని నారగింపుమన ఆ పరమేశ్వరుడూర కుండినన్ 1

తిన్నడు విల్లు చంకలో పెట్టుకొన్నాడు. చేతులలో మాంసపు దొప్పలు పట్టుకొన్నాడు. అభిషేకానికి జలం నోటినిండా పట్టాడు. భక్తితో వచ్చి నోటితోనే శివలింగంమీద ఎంగిలినీరు పోసి మాంసం దొప్పలు ముందు పెట్టి భుజించండి స్వామీ అన్నాడు. శివుడు ముందు భుజించలేదు. తిన్నడు 'నీవు తినకపోతే నా ప్రాణం తీసుకుంటా' అన్నాడు. అపుడు ఆరగించాడు ఈశ్వరుడు.

ఇది అంతా శివబ్రాహ్మణుడు చాటునుంచి చూచి అసహ్యించు కొని శివునితో అన్నాడు- "ఇదేమి స్వామీ! ఆచారహీనుడు, కుల హీనుడు. చదువు సంధ్య లేని మూర్ఖుడు. ఎంగిలి నీటితో నీకభిషేకం చేయటం, మాసం నీకు నైవేద్యం పెట్టటం బాగాలేదు"

"ఓ బ్రాహ్మణోత్తమా! కన్నప్ప వచ్చేవేళయింది. వాని భక్తి చూడు" అని శివుడు బ్రాహ్మణుని చాటుగా ఉంచాడు.

తిన్నడు అర్చనకు వచ్చాడు. శివునికంటి వెంటనెత్తురు కార సాగింది. తిన్నని గుండె దడ దడ లాడింది. తిన్నడు ఎన్నో మూలికల పసరులు పోశాడు. శివుని కంటి నెత్తురు తగ్గలేదు. 'కంటికి కన్నే మందని'

---

1. శ్రీకాళహస్తి మహాత్మ్యం

తన కన్ను తీసి అమర్చాడు. శివుని కన్ను బాగయింది. ఇంతలో శివుని రెండవ కంటినుండి నెత్తురు వచ్చింది. తిన్నడు బాణంతో తన రెండవ కన్ను తీసి పెట్టబోతున్నాడు. శివుడు సంతోషించి ప్రత్యక్ష్యమై తిన్నని కటాక్షించాడు.

శివబ్రాహ్మణుడు ఇది అంతా చూచాడు. అతనికి గల జాత్యహంకారం, విద్యాగర్వం దూరమయ్యాయి. శివబ్రాహ్మణుడు తిన్నని భక్తిని తెలుసుకొని ఆతనికి నమస్కరించాడు. మానవులేకాదు జంతువులైనా ఆర్తితో అరిస్తే ఆదుకొంటాడు. భగవంతుడు. అందుకనే ఆయనకు ఆర్తత్రాణ పరాయణుడని బిరుదు.

గజేంద్రుడు శ్రీమహావిష్ణు తత్వాన్ని ఇలా భావించి పార్థించాడు-

ఎవ్వనిచే జనించు జగ-మెవ్వని లోపలనుండు-లీనమై
ఎవ్వనియందుడిందు-పరమేశ్వరు డెవ్వడు-మూలకారణం
బెవ్వ-డనాది మధ్యలయు డెవ్వడు-సర్వము దానయైనవా
డెవ్వడు-వాని-నాత్మభవు-నీశ్వరు నే-శరణంబు వేడెదన్ 1

అని వేవిధాల స్తుతించాడు. అహంకారం పూర్తిగా పోయింది. ఆత్మలో ఈశ్వరుడు కనిపించసాగాడు. అప్పుడన్నాడు—

లావొక్కింతయు లేదు-ధైర్యము విలోలంబయ్యె-ప్రాణంబులున్
ఠావుల్ తప్పెను-మూర్ఛవచ్చె-తనువున్ డస్సెన్-శ్రమంబయ్యెడిని
నీవేతప్ప-ఇతః పరంబెరుగ-మన్నింపందగున్ దీనునిన్-
రావే! ఈశ్వర! కావవే! వరద! సంరక్షింపు భద్రాత్మకా! 2

1-2 ఆంధ్రభాగవతం అష్టమ 73-90

నీవేతప్ప దిక్కులేదు. అని భక్తుడు శరణాగతి కోరగానే పరమేశ్వరుడు పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఆ సమయంలో విష్ణుమూర్తి ఏకాంతంలో రమావినోదియై ఉన్నాడట–

అలవైకుంఠపురంబులో-నగరిలో-ఆ మూల సౌధంబు దా
పల-మందార వనాంత రామృతసరః ప్రాంతేందుకాంతోపలో
త్పల పర్యంక రమావినోదియగు ఆపన్నప్రసన్నుండు వి
హ్వాలనాగేంద్రము పాహిపాహియన కుయ్యాలించి సంరంభియై 1

సిరికిన్ చెప్పడు-శంఖచక్ర యుగమున్ చేదోయి సంధింప-డే
పరివారంబును జీర-డభ్రగ పతిన్ పన్నింప-డాకర్ణి కాం
తరధమ్మిల్లము చక్కనొత్తడు-వివాదప్రోత్థిత శ్రీకుచో
పరి చేలాంచలమైన వీడడు గజప్రాణావనోత్సాహియై 2

శ్రీమహావిష్ణుమూర్తికి పట్టమహిషి. లక్ష్మీదేవి కంటే భక్తుడంటేనే మిక్కిలి ఇష్టం. ఆపదలోనున్న తన భక్తుని ఆర్తనాదం వినగానే ఉన్నవాడున్నట్లుగా ఎవరితో ఏమీ చెప్పకుండా పరుగెత్తుకొని పోతున్నాడట. భార్యతోనూ చెప్పలేదు. శంఖచక్రాలు పట్టలేదు. మొగం మీద పడిన జుట్టుకూడా సరిచేసుకోలేదు. చివరకు తన చేతిలో చిక్కుకొన్న శ్రీ లక్ష్మీదేవి పైట చెంగును కూడా విడిచిపెట్టటం కూడా మరచిపోయినారడు. ఎంత ఖంగారుగా పరుగెత్తుతున్నాడంటే ఆ చీర చెంగుతోపాటు లక్ష్మీదేవి ఆయన వెంటపడి పరుగెత్తటమే కానీ ఆమెకు "ఎందుకు ఎక్కడికి" అనే ధైర్యం లేకపోయిందట.

---

1. ఆంధ్రభాగవతం అష్టమ 95-96

ఈయన ఖంగారుచూచి ఆమె కూడా విస్తుబోయింది. ఆ దేవుడు కన్నకొడుకు ఆర్తి విన్న కన్నతండ్రివలె భక్త రక్షణకు పరువెత్తుతాడు. అదీ భక్తునియెడల భగవంతుని మానసికస్థితి.

కనుక నిష్కల్మష హృదయంతో భజించే ప్రతి భక్తుడూ భగవంతునికి ఆత్మీయుడే. వాడు జనుడు కానీ, జంతువుకానీ, ధన కుల రూపవంతుడు కానీ. అన్నివిధాల హీనుడు కానీ. ఆయనకు కావలసింది పరమ భక్తితో నిండిన పవిత్ర హృదయం. అట్టి హృదయంగల భక్తుల కొరకు భగవంతుడు ఎన్ని బాధలైనా భరిస్తాడు.

ఒకసారి బ్రహ్మదేవుడు గోగోప బృందాన్ని మాయంచేశాడు. భగవానుడు గోకులానికి కష్టం కలిగించటం ఇష్టంలేక తానే గోపాలురై గోవులై గోవత్సకములై నానారూపాలు ధరించాడు అనేక కష్టాలు అనుభవించాడు—

వేదాంత వీథుల విహరించు విజ్ఞాని
విహరించు కాంతార వీథులందు
ఫణిరాజ శయ్యపై పవళించు సుఖభోగి
పల్లవ శయ్యల పవ్వళించు
గురుయోగి మానస గుహల గ్రుమ్మరుమేటి
గ్రుమ్మరు అద్రీంద్ర గుహాలలోన
కమలతోడ బెనంగి కడుడయ్య చతురుడా
భీరజనులతోడ బెనగి డయ్యు

అఖిల లోకములకు నాశ్రయుండగు ధీరు
డలసి తరుల నీడ నాశ్రయించు
యాగభాగచయము లాహరించు మహాత్ము
డడవిలోని ఫలము లాహరించు [1]

---

1. ఆంధ్రభాగవతం - దశమ పూర్వ 607

# వాదవేదన

74 సూ. వాదో నావలంబ్యః

భక్తులు భక్తినిగూర్చి వాద వివాదాలలో దిగరాదు. భక్తి అనేది అంతరంగికమైన విషయం. అది భక్తులకు అనుభవైక వేద్యం. భక్తి బాహ్య హేతువులకు అందేదికాదు.

భక్తులకు ఈ సూత్రం చాలా అవసరం. భక్తుడు అనుక్షణం భగవత్సేవలో లీనమై ఉంటాడు. అతనికి అన్యవిషయాలను ఆలోచించే సమయం ఉండదు. అతనికి ఇక వాదం ఎవరితోనైనా ఎందుకూ! అతడు అందరిలోనూ భగవంతుణ్ణే చూస్తుంటాడుకదా!

సృష్టిగూర్చి కానీ, సృష్టి పరిణామంగూర్చి కానీ, విచారించవలసిన అవసరం లేదతనికి. అతనికి తెలుసు. దీనికి మూలం పరమేశ్వరుడు. విశేషాలు అవసరమైతే భగవంతుడే తెలియచెప్పుతాడు. తర్కంవల్ల వాదంవల్ల తత్త్వం ఉపలబ్ధికాదు.

విష్ణుచిత్తుడు మహాభక్తుడు. శ్రీరంగనాథుడు విష్ణుచిత్తునితో "రాజసభలో వాదం జరుగుతోంది. నీవు వెళ్ళి హరి పరతత్వం ప్రతి పాదన చేసి వాదంలో పండితులను ఓడించి రమ్మంటాడు" అపుడు భక్తుడైన విష్ణుచిత్తుడు –

"నరహరీ! నేను చదువుకోని వాణ్ణి. శాస్త్రాలు వాదాలు అసలు తెలియనివాణ్ణి. దేవాలయంలో తుడిచి ముగ్గులు పెట్టటమో, ఆరామంలో మొక్కలకు పాదులు చేయుటమో. నీపల్లకి మోయుటమో! అటువంటివి తప్ప నాకు అన్యము తెలియదు కదా! నీ లీలకు పాత్రులు ఇతరులు లేరా! స్వామీ! వాదాలు నాకేల?" అంటాడు వినయంగా. విష్ణుదేవుని సన్నిధిలో చేతులు కట్టుకొని–

'స్వామీ! నన్ను ఇతః పురాపఠితశాస్త్ర గ్రంథ జాత్యంధు–నా
రామక్ష్మాఖననక్రియా ఖర ఖనిత్ర గ్రాహి తో ద్యత్కిణ
స్తోమాస్నిగ్ధకరున్ భవద్భవన దాసున్ వాదిగా పంపుచో
భూమీ భృత్సభ నోటమైన అయశంబున్ నీకు రాకుండునే! 1

'గృహ సమ్మార్జనమో! జలాహరణమో! శృంగార పల్యంకికా
వహనంబో! వనమాలికా కరణమో! వాల్లభ్య లభ్యధ్వజ
గ్రహణంబో! వ్యజనాత పత్రధృతియో! ప్రాగ్దీపికారోపమో!
నృహరీ! వాదము లేల! లేరె ఇతరుల్ నీ లీలకున్ పాత్రముల్' 2

బ్రహ్మసూత్రం– 'తర్కా ప్రతిష్ఠానాత్' అని. తర్కం ఆధారహీనం.

కఠోపనిషత్తు "నైషా తర్కేణ మతిరాప నేయా ...... ... ... ... ... ... ...
అస్తీతి బ్రువతో౽న్యత్ర కథం తదుపలభ్యతే"

---

1, 2 ఆముక్తమాల్యద – శ్రీకృష్ణదేవరాయలు

బుద్ధి బలంతో చేసే తర్కం వలన తత్త్వప్రాప్తి కల్గదు. పరిశుద్ధ సత్యతత్త్వం శుద్ధ సాత్త్విక పురుషులకే సహజంగా లభ్యమవుతుంది.

అయితే మరొకచోట — 'వాదే వాదే జాయతే తత్త్వబోధః' అన్నారు పెద్దలు. ఇక్కడ ధర్మసూక్ష్మం తెలుసుకోవాలి. ఏమంటే శ్రద్ధాళువైన శిష్యుడు తత్త్వ జిజ్ఞాసతో తన సందేహాలు వ్యక్తంచేస్తూ తర్కంలోకి దిగితే, అపుడు శిష్యునికి గురువు తర్కంద్వారానే ప్రబల ప్రమాణాలు చూపి వానిని సమాధానపరచాలి. అది తగనిది కాదు. అది అవసరమైనది కూడా.

'జిగీషతో ఎదుట వానిని ఓడించుకోవనిగా అహంకారం ప్రదర్శించటం' అయితే అది త్యాజ్యం. దానివలన చాలా ప్రమాదాలు ఉత్పన్నమవుతాయి. అపుడు అసలు తత్త్వ విషయాలు మరుగునపడి మదమాత్సర్యాలు వ్యక్తిగత ద్వేషాలు పరస్పర నిందలు ఆరోపణలు దూషణలు ప్రారంభమవుతాయి. వివేకం భ్రష్టమై వివాదం పెరిగి క్రోధం జనిస్తుంది. అందుకే అన్నారు.

'వాదే వాదే వర్ధతే వైర వహ్నిః.' అని వాదాలవల్ల వైరాగ్ని ప్రజ్వలిస్తుందట. కనుక భక్తుడు వాదాలకు అవకాశం ఈయకూడదు. తప్పనిసరి అయితే ఎదిరి వాదం విని మౌనం వహించటం మంచిది. మాటకు మాట తెగులు నీటికి నాచు తెగులు కదా!

"అతృణే పతితో వహ్నిః
స్వయ మేవోపశామ్యతి"

అగ్నిలో సమిధులు వేస్తే మంట వస్తుంది. లేకపోతే అదే ఆరిపోతుంది. ఎదుట వ్యక్తికి బదులు చెప్పకపోతే వాడే వాగి వాగి నోరు నొప్పి పుట్టి ఊరుకొంటాడు. "మౌనం సర్వార్థ సాధనమ్"

75 సూ. బాహుల్యావకాశా దనియ తత్వాచ్చ

తర్కం అంతులేనిది. ఇందు అనేక వివాదగ్రస్త విషయాలు రావటానికి అవకాశం ఎక్కువగా ఉంటుంది.

దీనివలన తత్త్వప్రయోజనం శూన్యం. వాదం వాది ప్రతివాదుల ఉత్తర ప్రత్యుత్తరాలతో క్రమ క్రమంగా పెరుగుతుంది. సమర్థనీయ సూక్తులకోసం, సూత్రాలకోసం మేధాశక్తి విపరీత పద్ధతులలో పని చేస్తుంది. ఇందు పాండితీ ప్రకర్ష ప్రదర్శించబడటమేకాని, దీనివలన బ్రహ్మ జ్ఞానం అణుమాత్రంకూడా లభించదు.

భగవంతుడిచ్చిన అమూల్య సమయాన్ని వాదాలతో వ్యయ పరచటం తెలివితక్కువ పని. ఆ సమయం భగవన్నామ సంసేవలో గడపటం మంచిది. ఇతరులతో వితండవాదం వ్యర్థం. వైతండికులగూర్చి శ్రీనాథవాణి –

బోధ మల్పంబు గర్వ మభ్యున్నతంబు
శాంతి సప్పచ్చరంబు మచ్చరము ఘనము
కూప మండూకములుబోలె గొంచె మెరిగి
పండి తమ్మన్యులైన వైతండికులకు 1

భక్త రామదాసు ఇలా అన్నాడు –

కొంజక తర్కవాద మను గుద్దలిచే పరతత్వ భూస్థలిన్
రంజిలద్రవ్వి కన్గొనని రామనిధానము-నేడు భక్తి సి
ద్ధాంజన మందు హస్తగతమయ్యె బళీ! అనగా మదీయ హృ
త్కంజమునన్ వసింపుమిక దాశరథీ! కరుణాపయోనిధీ! 1

---

1. భీమేశ్వర పురాణం ప్రథమ 13
2 దాశరధీ శతకం - 23 "రామదాసు కంచెకచర్ల గోపన్న"

వృద్ధి పరచే కార్యాలు తప్పక ఆచరిస్తూ ఇతరులకు తాను ఆదర్శంగా ఉండాలి. ఇందువలన భక్తునికి మనస్సు పరిశుద్ధమై ప్రకాశిస్తుంది. నాస్తిక గ్రంథాలు ఎప్పుడూ చదువరాదు.

యస్మిన్ శాస్త్రే పురాణేవా హరిభక్తిర్నదృశ్యతే
శ్రోతవ్యం నైవ తచ్ఛాస్త్రం యది బ్రహ్మాస్వయం వదేత్

హరిభక్తిలేని పురాణ శాస్త్రాలు స్వయంగా బ్రహ్మదేవుడు చెప్పినా వినరాదు. సద్బుద్ధిని సద్భక్తిని వృద్ధిపరచేవే చదవాలి. ఈవిధంగా ప్రతివాడు వర్ణాశ్రమ ధర్మాలు నిర్వర్తించాలి. పరమేశ్వర ప్రీత్యర్థం పూజలూ, మాతృ పితృసేవలూ చేస్తుండాలి. భార్యా పుత్ర పరిజన పోషణ తోపాటు అతిథి అభ్యాగతులను ఆదరించాలి. న్యాయార్జనతోనే జీవిక గడపాలి. దానధర్మాలు జపతపాదులు నిర్వహించాలి. సతతం సత్కార్యాలు చేస్తుండాలి.

సదాచార పరిపాలనం, శీలసంరక్షణం, సత్సంగం, భగవద్గుణ కీర్తనం సాధు పురుషుల సంసేవనం, తీర్థసేవనం, దీనమానవసేవ, సర్వకార్య ఫల సమర్పణం, జీవాత్మలో పరమాత్మ సందర్శనం, ఈ మొదలైన సుగుణాలు ప్రతివాడూ అలవరచుకోవాలి.

భాగవతంలో ఉద్ధవునితో భక్తి అలవడటానికి కృష్ణ భగవానుడు ఇలా చెప్పాడు—

శ్రద్ధామృత కథాయాం మే శశ్వన్మ దనుకీర్తనం
పరినిష్ఠాచ పూజాయాం ....................
... ... ... ... ...
ఏవం ధర్మై ర్మనుష్యాణా ముద్ధవాత్మ నివేదనం
మయి సంజాయతే భక్తిః కోఽన్యోఽర్థోఽస్యావశిష్యతే 1

1. భాగవతం 11/19/20-24

ఓ ఉద్ధవా! నా కల్యాణగాథలందు శ్రద్ధ, నా నామ పూజాదులందు నిష్ఠ, నా సేవలో ఆదరభావం ప్రాణికోటిలో నన్ను దర్శించటం, నా లీలాభిభాషణం, మానస పుష్పసమర్పణం, ఆత్మనివేదనం మున్నగు సుగుణాలు అలవరచుకొన్న వానికి హరిభక్తి లభ్యమవుతుంది.

ప్రబుద్ధ యోగీశ్వరుడు నిమి మహారాజుతో భక్తి సాధనాలను ఇలా ప్రబోధించాడు—

తస్మాద్గురుం ప్రపద్యేత జిజ్ఞాసుః శ్రేయ ఉత్తమం
శాబ్దే పరేచ నిష్ణాతం బ్రహ్మణ్యుపశమాశ్రయమ్
తత్ర భాగవతాన్ ధర్మాన్ ... .... ... ...
... ... ... ...
స్మరంతః స్మారయంతశ్చ మిథోఽఘౌఘ హరం హరిం
భక్త్యా సంజాతయా భక్త్యా బిభ్ర త్యుత్పులకాం తనుమ్ 1

ఓ మహారాజా! పరమ ప్రేమభక్తి కోరేవాడు బ్రహ్మనిష్ఠగలవాడై, శాంత పావన సచ్చిదానంద గురువరేణ్యుల చరణ కమలాలను ఆశ్రయించాలి. గురువును ఇష్టదైవంగా భావనచేసి భాగవత ధర్మాలు క్షుణ్ణంగా నేర్చుకోవాలి. అప్పుడు హరి ప్రసన్నుడవుతాడు. భక్తులకు గురు సేవవలన విషయ వాసనలపై వైముఖ్యం, సాధు పురుష సాంగత్యంపై ప్రాముఖ్యం హెచ్చుతుంది. ఈవిధంగా గురువు వద్ద సదభ్యాసంతో వర్తించే భక్త హృదయంలో సాధనారూపమైన భక్తిద్వారా పరమ ప్రేమ ఉద్భవిస్తుంది. భక్తుడు అపుడు ఇదే ప్రార్థిస్తాడు-

నీ పద్యావళులాలకించు చెవులున్ నిన్నాడు వాక్యంబులున్
నీ పేరంబనిసేయు హస్తయుగమున్ నీ మూర్తిపై చూపులున్
నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరమున్ నీసేవపై చిత్తమున్
నీ పైబుద్ధులు నాకు నిమ్ము కరుణన్ నీరేజ పత్రేక్షణా! 2

1. భాగవతం 11/3/29-3 2. ఆంధ్రభాగవతం - దశమ 408.

77 సూ. సుఖ దుఃఖేచ్ఛా లాభాది త్యక్తే
కాలే ప్రతీక్ష్యమాణే
క్షణార్ధమపి వ్యర్థం న నేయమ్

భక్తుడు సుఖదుఃఖాలు లాభనష్టాలు మున్నగు ద్వంద్వాలకు అతీతంగా ఉండే తన్మయత్వ స్థితి కొరకై ఎదురు చూస్తుండాలి. పరమేశ్వర ధ్యానం చేస్తూండాలి. క్షణకాలం కూడా వ్యర్థంచేయకుండ ఆ శ్రీహరి పాదారవిందాలనే ఆత్మలో అనుసంధానం చేసుకొని భక్తుడు భక్తి తత్పరుడై ఉండాలి.

భక్తి సిద్ధించిన వానికి సుఖదుఃఖాలు మానావమానాలు లాభనష్టాలు శీతోష్ణాలు మున్నగు ద్వంద్వాలు ఉండవు. ఏపదార్థంపై వాంఛ ఉండదు. ఆభక్త శేఖరుని కర్తవ్యం భగవంతుని సాక్షాత్కారం కొరకై ప్రతీక్షించటమే.

ఆ ప్రతీక్షా కాలంలో నిరంతరం హరినామ స్మరణం చేస్తుండమన్నారు. మృత్యువు ఏ రూపంలో వచ్చి కబళిస్తుందో! భగవంతుడు ఏ రూపంలో కబురు పంపుతాడో! ఎవరికీ తెలియదుకదా!

పుణ్యం సంపాదించుకో వలసిన ఈ మానవ జన్మకాలంలోని క్షణంలోని అర్ధభాగంకూడా వ్యర్థంచేయక ముక్తిదాయకమైన హరి స్మరణం చేయుము అన్నాడు నారదమహర్షి.

ఒక తుమ్మెద వికసించిన కమలంలోకి వెళ్ళి మకరందాన్ని ఆస్వాదిస్తోంది. ఇంతలో సంధ్యాసమయం అయింది. సూర్యుడు అస్తమిస్తున్నాడు. కమలం ముడుచుకు పోసాగింది. మధుపాన మైకంలో తుమ్మెదకేమీ తెలియటంలేదు. కమలం పూర్తిగా ముడుచుకుపోయింది. ఆ పుష్ప మందిరంలో తుమ్మెద బందీ అయింది. అపుడు అనుకొంటుంది-

రాత్రి ర్గమిష్యతి భవిష్యతి సుప్రభాతం
భాస్వానుదేష్యతి హసిష్యతి పంకజశ్రీః
ఇత్థం విచింత యతి కోశగతే ద్విరేఫే
హా హంత! హంత నలినీంగజ ఉజ్జహార

"రాత్రి అయిపోయింది. పోనీలే, ఇదీ బాగానే ఉంది. మధుపానంతోనే గడపవచ్చు. రాత్రి మెల్లగా గడుస్తుంది. సుప్రభాతమవుతుంది. అప్పుడు సూర్యకిరణ స్పర్శకు కమలం విచ్చుకొంటుంది. అప్పుడు పైకి ఎగిరిపోయి బంధువులను కలుసుకోవచ్చు" అనుకొంది తుమ్మెద. ఇంతలో ఒక ఏనుగు సరస్సులో దిగింది. కమలాన్ని పెకలించి వేసింది. కమలంతో పాటు భ్రమర జీవితం కూడా చిందరవందర అయింది. నశించింది.

కనుక భగవదారాధనా విషయంలో భక్తిని తర్వాత అభ్యాసం చేయాలనీ, భగవద్గీతా భాగవతాదులు పెద్దవారమైన తరువాత చద వాలనీ అనుకోవటం ఏమాత్రం మంచిదికాదు. కామనలు తీరిన తరువాత అని వాయిదా వేయకుండా ఆత్మజ్ఞానం కోసం ప్రయత్నించు- ధూర్జటి మహాకవి ఈ భావమునే ఇలా వ్యక్తరించాడు -

దంతంబుల్ పడనప్పుడే-తనువునం దారూఢి యున్నప్పుడే-
కాంతాసంఘము రోయ నప్పుడె-జరాక్రాంతంబు కానప్పుడే-
వింతల్ మేన జనించనప్పుడె-కురుల్ వెల్లెల్ల కానప్పుడే-
చింతింపంవలె నీ పదాంబుజ ॥ లన్ శ్రీకాళహస్తీశ్వరా! 1

78 సూ. అహింసా సత్య శౌచ దయాస్తిక్యాది
చారిత్య్రాణి పరిపాల నీయాని

భక్తుడు నిరంతరం సత్ప్రవర్తనతో అహింస సత్యం శౌచం దయ ఆస్తికత మొదలైనవి ఆచరించాలి.

1. కాళహస్తీశ్వర శతకము

హింసకు దూరంగా ఉండటమే అహింస అన్నారు–

హింస సేయని వాడు లేడిజ్జగమున
ఒక్కడైనను- తను తను రోపినట్లు
హింస తెరువున కెడగల్గి యేగవలయు
అదియసూవె! అహింస నా నతిశయిల్లు 1

సత్యం- సత్యం అంటే ఉన్నదున్నట్లుగా చూచింది చూచినట్లుగా విన్నది విన్నట్లుగా పలుకుట అనేది సర్వజన విదితం. సత్యం గొప్పదనాన్ని శకుంతలచేత ఇలా చెప్పిస్తాడు నన్నయభట్టారకుడు

నుత జల పూరితంబులగు నూతులు నూరిటి కంటె సూనృత
వ్రత! ఒక బావిమేలు-మరి బావులు నూరిటి కంటె ఒక్క-సత్
క్రతువది మేలు-తత్క్రతుశతకంబున కంటె సుతుండు మేలు-త
త్సుత శతకంబుకంటె ఒక సూనృత వాక్యము మేలు-సూడగన్

వెలయంగ అశ్వమేధం
బులు వేయును నొక్క సత్యమును నిరుగడలన్
తులనిడి తూపగ సత్యము
వలనను ములు సూపు గౌరవంబున పేర్మిన్

నూరు నూతులను త్రవ్వించటం కంటె ఒక పెద్ద దిగుడు బావి మేలనీ, అటు వంటినూరు బావుల కంటె ఒక యజ్ఞం మేలనీ, అట్టి యజ్ఞాలు నూరుకంటె ఒక సుతుడు మేలనీ, అట్టి సుతులు నూర్గురు కంటె ఒక సత్యవాక్యం మేలనీ ఇందు విదితమయింది. వేయి అశ్వమేధ యాగాల ఫలితంకంటె ఒక సత్యవాక్య బలం గొప్పది- అంటుందీ శకుంతల నిండు సభలో దుష్యంత మహారాజుతో.

1. మహాభారతం అరణ్య 6-60
2. మహాభారతం ఆది 4/92-93

సత్యం గొప్పదే. అది ద్వేషరోషాసూయాలకు అతీతంగా కల్యాణకరంగా పలకాలి. అది హితంగా ఉండాలి. కటువైన సత్యం పలకవద్దు అన్నారు కొందరు మునీంద్రులు.

ధర్మ వ్యాధుడు కౌశికునికి ధర్మ రహస్యాలు చెప్తూ ఇలా అన్నాడు-

భూతహితంబుగాఁ బలుకు బొంకును సత్యఫలంబునిచ్చు న
ద్భూత భయాస్పదంబగు ప్రభూతపు సత్యము బొంకునట్ల; ప్రా
ణాతురుడైనచో, పరిణయంబున యందును,బల్కు బొంకు స
త్యాతిశయంబయంద్రు; మహితాత్మక! యిట్టివి ధర్మసూక్ష్మముల్ 1

సారాంశం-భూతకోటికి హితంగా పలకాలి. భూతకోటికి హితంగాని సత్యం పలుకవద్దు. హితం కలిగేటప్పుడు అబద్ధం ఆడినా తప్పులేదు. పుణ్యం వస్తుంది అని.

శుక్రనీతి ఇంకా ఇలా ఉంది –

వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణ విత్త మాన భంగమందు
చకిత గోకులాగ్రజన్మ రక్షణమందు
బొంకవచ్చు అఘము పొందదధిప! 2

అయినా బలి చక్రవర్తి "తిరుగన్ నేరదు నాదు జిహ్వ" "నిరయంబైన నిబద్ధమైన" ఏది వచ్చినా పలికి బొంకరాదు అని ఆత్మ నివేదనం చేసుకున్నాడు. తనకు హాని కలిగినా పరులకు హాని కలుగకుండ సత్యం పలకాలి అనేది తాత్పర్యం.

ధర్మసందేహాలు కలిగినపుడు పండిత వచనాలేకాక ఆత్మ జ్ఞానంతో సదసద్వివేకంతో ప్రవర్తించాలి అని బోధించే ఒక కథ ఉంది.

---

1. నన్నయ భారతం అరణ్యం 5-62 2. పోతన భాగవతం

ఒక అడవిలో ఒక మునీశ్వరుడు ఆశ్రమం ముందు కూర్చొని జపం చేసుకుంటున్నాడు. ఇంతలో ఒక లేడి ప్రాణాతురమై అటువైపు ముని ముందుగా ఆశ్రమం వెనుకకు వెళ్ళింది. ఇంక కొంచెం సేపటికి ఒక వేటగాడు వచ్చి లేడి కనిపించక పోయేసరికి మునిని చూచి 'అయ్యా! ఇటు లేడి వచ్చింది. చూచారా! ఎటు వెళ్ళింది?' అని అడిగాడు.

మునికి ఇప్పుడు ధర్మ సందేహం వచ్చింది. లేడి వచ్చింది తాను చూచాడు. తాను చూడలేదంటే అసత్య దోషం తగులుతుంది. 'నేను చూచాను. లేడి ఆశ్రమం వెనుక ఉంది' అంటే పాపం! లేడి పిల్ల ప్రాణం పోతుంది.

ముని ఆలోచించాడు- కన్ను చూచింది పలుకలేదు. నాలుక పలుకుతుంది కానీ అది చూడలేదు. ముని సూక్ష్మంగా యుక్తిగా ఇలా అన్నాడు.

"కిరాతకా! చూచినదానికి మాట్లాడే శక్తి లేదు. మాట్లాడే శక్తి గల దానికి చూచే శక్తి లేదు. చూచినది చెప్పాలి. ఈ సగం సగం తెలివిగల వానివల్ల సత్యం తెలుసుకోలేవు" పొమ్మన్నాడు.

మునితో వాదించే శక్తి లేక వాడు వెళ్ళిపోయినాడు. లేడి బ్రతికి పోయింది. మునికి అసత్య దోషం తొలిగింది. భక్తుడైన వాడు ఇలా ఆలోచించి జీవనయానం చేయాలి.

శౌచం- శౌచం అంటే శారీరకంగాను మానసికంగాను, భక్తుడు శుచిగా ఉండాలి. జలంతోను ఓషధులతోను శరీరాన్ని పరిశుభ్రం చేసుకోవాలి. శుభ్రవస్త్రాలు ధరించాలి. భుజించే పదార్థం సక్రమ సంపాదనతో ప్రాప్తించినదై అన్యాక్రాంతం, అన్యాయార్జనం కానిదై ఉండాలి. పవిత్ర హృదయంతో హరికి నైవేద్యమైనవే భుజించాలి.

సాత్త్విక ఆహారం వలన మనస్సు నిర్మలమవుతుంది. భక్తుడు అతిథి సత్కారాలతో భగవద్భజనలతో గృహం పవిత్రం చేసుకోవాలి. ప్రశాంత వాతావరణం ఏర్పాటు చేసుకోవాలి.

మానసికశుచి- భక్తుడు కామక్రోధాదులు మనస్సులోనికి రానీయరాదు. విషయవాసనలకు దంభ వైరాదులకు మనస్సును దూరంగా ఉంచాలి. ప్రేమ, క్షమ, సంతోషం, సచ్చింతనం, వినయం, ప్రసన్నత, వైరాగ్యం, ఆరోగ్యం, అలవరచుకొని మనస్సును పవిత్రంగా ఉంచుకోవాలి. మంత్ర ప్రాయశ్చిత్తం అవసరం అయినప్పుడు జరుపుకోవాలి.

శుచి లేనివానికి పవిత్ర వస్తువులు కనిపించవు. ఉదంకుడు అభక్ష్య భక్షణం చేసి శుచిమంతుడు కాలేకపోయాడు. అశుచిగా రాజాంతఃపురంలోనికి వెళ్ళటం వల్ల మహాపతివ్రతయైన రాణిని చూడలేకపోయాడు. ఉదంకుడు మరల వెనుకకు వెళ్ళి రాజుతో 'రాజా! నీవు వెళ్ళి రాణిగారిని అడిగి రత్నకుండలాలు తెచ్చుకోమన్నావు. అక్కడ రాణిగారే లేరే! అబద్ధం ఆడతావా' అన్నాడు. రాజు ఆలోచించి నీవు అశుచివై ఉన్నావు. శుచిర్భూతులకే మహారాణి దర్శనం అవుతుంది అంటాడు. అపుడు ఉదంకుడు పవిత్ర జలాలతో ఆచమించి మంత్రం జపించి శుచియై వెళ్ళి రాణిని అడిగి కుండలాలు తెచ్చుకొని గురుపత్నికి గురుదక్షిణగా సమర్పించుకొంటాడు.

శౌచం ప్రభావం ఇలా ఉంటుంది. కలి శుచి కానివానిని ఆవహిస్తాడు, ఎట్టివానినైన ధర్మచ్యుతుని చేస్తాడు.

నల చక్రవర్తి దమయంతిని వివాహమాడి ధర్మం నాల్గు పాదాల నడిచేలా గా రాజ్యం చేస్తున్నాడు. ఒకనాడు పొరపాటున రాజు అశుచి కాగాఆతనిని కలి ఆవహించాడు. ఫలితంగా కష్టాలు చుట్టు ముట్టాయి. జూదంలో ఓటమి, రాజ్యంపోవటం, అడవిలో అగచాట్లు, ఆకలికై అలమటించటం, ఉత్తరీయం కూడా పక్షులెత్తుకపోవటం, వస్త్రహీనుడై భార్య

చీర కొంత చించుకొని ధరించి తాను భార్యను విడిచిపోవటం, పాము వాతపడి వికృత రూపుడు కావటం, మరోరాజువద్ద వంటవాడై ఊడిగం చేయటం, వంటి అనేక కష్టాలు అతనికి సంభవించాయి. శుచి కాని దోషం ఎంతపని చేస్తుందో చూచారా! కావున భక్తుడు ఎల్లపుడు శౌచాన్ని జాగరూకుడై పాటించాలి.

దయ- దయ హృదయ సంబంధి. సహృదయులకు దయ, కరుణ ప్రేమ సహజగుణాలు. ఇవి రత్నభూషణాలు. ప్రేమ భావంతో నిస్వార్థ భావంతో మాధవసేవా భావంతో దీనులను దుఃఖితులను స్వపర భేదం లేకుండా మిత్రు శత్రుభావం వీడి సకల ప్రాణులను ఆదుకోవాలి.

రంతి దేవుడు అతిథి పూజకు దయాగుణానికి పెట్టింది పేరు. మితి మీరిన దానధర్మాలతో, దీన మానవ సేవతో అతడు దరిద్రుడై పోయాడు. నలుబదిరోజుల తరువాత ఒకరోజు లభించిన భోజనం చేయ బోయేసరికి ఒక బ్రాహ్మణుడు ఆకలితో ఆహారాన్ని అర్థించగా వానికి రాజు తనకున్నదానిలో సగం పెట్టాడు. ఇంతలో మరొకడు వచ్చి ఆకలి అన్నాడు. రాజు మిలిగిన దానిలో సగం అతనికి పెట్టాడు. ఆ కాస్త తిందాము అనుకొనే సమయంలో కుక్కలను తోలుకొని మరొకడు వచ్చి ఆకలి ప్రభో! అన్నాడు. ఉన్న అన్నం అంతా పెట్టి వాని ఆకలి బాపి పంపాడు రంతిదేవుడు.

ఇక రాజకుటుంబానికి మిలిగినవి మంచినీళ్ళు. పోనీ నీళ్ళతో కడుపు నింపుకుందాము అనుకొనేటంతలో ఒకచండాలుడు వచ్చి మంచితీర్థమైనా పోసి ప్రాణం నిలపండి అన్నాడు. దయతో రాజు హృదయం కరిగి పోయింది. ఆ రంతిదేవుని మాటలివి-

అన్నము లేదు కొన్ని మధురాంబువు లున్నవి త్రావుమన్న! రా
వన్న శరీర ధారులకు నాపదవచ్చిన వారి యాపదల్
గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు సేయుటకన్న నొండు మే
లున్నదె నాకు దిక్కు పురుషోత్తముడొక్కడె చుమ్ముపుల్కసా! 1

1. ఆంధ్రభాగవతం నవమ 647

బలవంతం బగునీరుపట్టున నిజప్రాణాంతమైయున్నచో
నలయుండేమియు వీనివ్రాజ్జ్వరము నాయాసంబు ఖేదంబు నా
జలదానంబున నేడు మాను ననుచున్ సర్వేశ్వరాధీను డై
జలమున్ బోసెను రంతి దేవుడు దయన్ జండాల ప్రాత్రంబునన్ 1

ఆపదలు వచ్చినపుడు వారిని ఆదుకొన్నవాడే మహాభక్తుడు. సర్వేశ్వరాధీనుడై భక్తితో కులమత భేదం పాటించకుండ ఆపన్నులకు ప్రాణదానం చేయాలి. రంతి దేవుడు తన యోగక్షేమం భగవంతునిపై వదలి దయతో ఆకలి గొన్నవారిని ఆదుకొన్నాడు.

చేతులారంగ శివుని పూజింపదేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువ దేని
దయయు సత్యంబు లోనుగా తలప దేని
కలుగ నేటికి తల్లుల కడుపు చేటు 2

అని మానవులు హరి భక్తితో పాటు, దయకలిగి ఉండాలి అని పోతనామాత్యుడు నొక్కి వక్కాణించాడు.

ఆస్తిక్యం— భక్తుడు భగవంతుణ్ణి పూర్తిగా విశ్వసించాలి భగవంతుడు సర్వశక్తిమయుడు, సర్వస్వామి, సర్వాంతర్యామి. ఆయన పరమ కారుణ్యమూర్తి, దీన బాంధవుడు. అందరినీ ఆపదలలో ఆదుకుంటాడు. పాపపంకిలాన్ని తన దయామృతంతో కడిగి వేస్తాడు. అనే విశ్వాసం భక్తుడైన వానికి ఉండాలి. భగవంతుడు ప్రపంచ సృష్టి స్థితి లయకారుడు, అనంతుడు, అనంత రూపుడు, సహస్రాక్షుడు సహస్ర శీర్షుడు, సహస్రపాదుడు, విశ్వమయుడు- అని ప్రహ్లాదుని వలె విశ్వసించాలి.

---

1. ఆంధ్రభారతం నవమ 649 2. ఆంధ్రభాగవతం అష్టమ

ప్రహ్లాదుణ్ణి హిరణ్యకశిపుడు ఎంతగానో బాధించాడు. దుర్బాధలు గావించాడు. పాములచేత కరిపించినా కొండలనుండి త్రోయించినా ప్రహ్లాదునిలో భక్తి ప్రవృద్ధమైందే కాని సడలలేదు. ప్రహ్లాదుడు తండ్రితో అంటాడు –

విష్ణుః శస్త్రేషు యుష్మాసు
మయి చాసౌ వ్యవస్థితః
దైతేయాస్తేన సత్యేన
మాక్రమంత్వాయుధాని చ 1

తండ్రీ! విష్ణుమూర్తి శస్త్రాలలో నీలో నాలో సర్వత్ర ఉన్నాడు. అందువల్ల నీశస్త్రాలు నాపైబడికూడా హానిచేయటంలేదు. నామాటపై నమ్మకముంచి వింటే చక్రి సర్వప్రదేశాలలోను, సకల ప్రాణులలోను, సమస్త వస్తువులలోను నిండి ఉంటాడు. అని అంటాడు ప్రహ్లాదుడు. ఆ బాల భక్తుడు హిరణ్యకశిపునికి సర్వేశ్వరుణ్ణి స్తంభంలో చూపించాడు. నరసింహస్వామిని అర్థించి తండ్రికి అపవర్గ సౌఖ్యం కల్గించాడు. ప్రహ్లాదుడు భగవంతునిపై చూపిన భక్తి విశ్వాసాలే భక్తులకు ఆదర్శ ప్రాయం.

కల డంభోధి గలండుగాలి గలడాకాశంబునన్ కుంభినిన్
గల డగ్నిన్ దిశలన్ పగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాత్మలన్
గల డోంకారమునన్ త్రిమూర్తుల త్రిలింగవ్యక్తులం దంతటన్
గల డీశుండు గలండు తండ్రి! వెదకంగా నేల! ఈయాయెడన్ 2

---

1. విష్ణుపురాణం 1-17-33
2. ఆంధ్రభాగవతం నవమ 274

79 సూ. సర్వదా సర్వ భావేన
నిశ్చింతైర్భగవానేవ భజనీయః

సర్వవేళల అన్నివిధాల సర్వ సమర్పణ భావంతో నిశ్చింతగా భగవంతుని భజించుము.

యస్మిన్ ద్యౌ పృథివీ చాంతరిక్ష మోతం మనః
సహ ప్రాణైశ్చ సర్వైః తమేవైకం జానథ ఆత్మానం
అన్యావాచో విముంచథ అమృత స్యైష సేతుః 1

భగవంతుని దివ్య విభూతులు తెలిసి విశ్వసించిన భక్తుడు భగవన్నామ ధ్యాన స్మరణాదులు తప్పించి మరో కార్యం చేయజాలడు.
శంకరుడు ఉమాదేవితో ఇదే అంటాడు.

రామచంద్రుని స్వభావ ప్రాభవాలు తెలిసినవాడు రామనామ ధ్యానం విడిచి మరొక కార్యం చేయలేదు. అట్టి వాడు మనోవాక్కాయ కర్మలద్వారా రామ వశం అయిపోతాడు. అతనికి మరో ఆలోచన అనేది రాదు. దరిద్రునికి అందుబాటులో బంగారం మూట లభిస్తుంటే వాని దృష్టి మరోవైపు ఎలా ప్రసరింప కల్గుతుంది?

భగవంతుడు సర్వాధారుడు, పరతత్వ ప్రకాశమానుడు, ఆనంద మూర్తి, ప్రేమ మయుడు, సౌందర్య మాధుర్య మూర్తి, సచ్చిదానంద ప్రదాత. అందుబాటులో నిలిచి చేతులు చాచి భగవంతుడు "రా! బాబూ! రా!" అని మాతృశ్రీ వలె పిలుస్తుంటే మధుర మంద హాసం చిందిస్తూంటే కాదని మరొకచోటికి ఎక్కడికి వెళ్ళతాడు భక్తుడు?

"నీవు చూడకపోయినా విన్నావుకదా, నమ్మి భక్తి నిధిని పొందుము. భక్తుడు కావటానికి నీవేమీ కష్టపడనవసరంలేదు. విశ్వాసంతో విశ్వమయుణ్ణి వినుతించు. మనస్సులో చింతలు మానుకో. శిశువు

1. ముండకోపనిషత్తు

తల్లి ఒడిలో నిశ్చింతగా ఆడుకున్నట్లు స్వామి పాదసన్నిధిలో ఉండిపో. రాముడుండు వరకు భయము లేదు మనకు - సర్వాత్మనా సార సాక్షుని స్మరించు. అంతే అంటాడు నారదుడు. గీతలో -

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యతి సత్యంతే ప్రతిజానే ప్రియోఽసిమే
సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపే భ్యో మోక్షయిష్యామి మాశుచ 1

ఓ అర్జునా! నాపై మనస్సు నిలిపి, నా భక్తుడివి కమ్ము. నన్ను పూజించు, నమస్కరించు, విశ్వసించు. నన్ను పొందుతావు. అన్ని ధర్మాలు మతాలు వ్రతాలు అభిమతాలు వదులుకో.

నన్నే శరణు వేడుకో. నేను నిన్ను సర్వపాపాలనుండి బంధాల నుండి కష్టాలనుండి కాపాడతాను. మోక్షం ఇస్తాను నీవు కోరింది ప్రసాదిస్తాను. అని కృష్ణ భగవానుడు చెప్పాడు.

శ్రీశుకుల వారు ఇలా అన్నారు-

కామోత్కంఠత గోపికల్-భయమున్ కంసుండు-వైరక్రియా
సామాగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్-సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు భక్తినేము నిదె చక్రింగంటి మెట్లైన ఉ
ద్దామ ధ్యాన గరిష్ఠుడైన హరి జెందన్ వచ్చు ధాత్రీశ్వరా! 2

× × × ×

ధర్మము సత్యము కీర్తియు
నిర్మల దయ విష్ణుభక్తి నిరుపమ ఘన స
త్కర్మ మహింసా వ్రతమును
నర్మిలిగలవారె పుణ్యులవనీ నాథా! 3

1. భగవద్గీత 18-65, 66
2. భారతం
3. భాగవతం ద్వాదశ స్కంధం 16

# భక్తి రేవ గరీయసి

80 సూ. సంకీర్త్యమానః శీఘ్రమేవావిర్భవతి
అనుభావయతి చ భక్తాన్

ఈశ్వరుడు కీర్తనీయుడు, స్తవనీయుడు. అతడు సంకీర్తనకు సంతోషించి సత్వరం సాక్షాత్కరిస్తాడు. భక్తులకు భవ్యమైన దివ్యానుభవం ప్రసాదిస్తాడు.

ఆ దయామయుణ్ణి భక్తులు ఏ రూపంలో ధ్యానిస్తే ఆ రూపంలో ఆ దివ్య విభూతులతో అతి శీఘ్రంగా ఆ స్వామి ప్రత్యక్షమై భక్తుల కోరిక తీరుస్తాడు. ఆవు వెంట లేగదూడవలె భక్తి వెంట భగవంతుడు పరువెత్తుకొని వస్తాడు. ఆస్వామి దేవకీ వసుదేవులకు, అదితి కశ్యపులకు, యశోదానందులకు పుత్రరూపంలో వచ్చి అనుగ్రహించాడు. గోపాలురకు సుదామ అక్రూర ఉద్ధవ అర్జునాదులకు మిత్రరూపంలో వారి ఈప్సితం నెరవేర్చాడు. రాధా గోపికలకు అష్ట మహిషులకు భర్త రూపంలో విలాసం చూపించాడు. ప్రహ్లాదునికి నృసింహ రూపంలో ప్రత్యక్షమైనాడు.

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోర్జున
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప!
మత్కర్మ కృన్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః
నిర్వైర స్సర్వ భూతేషు యస్సమామేతి పాండవ! 2

అర్జునా! నా భక్తుడు నన్ను తెలుసుకోగలడు, చూడగలడు, నాలోనికి జేరగలడు. వాడు సంగవర్జితుడు, అజాత శత్రువు, తత్త్వజ్ఞుడు, సర్వభూతహితుడు. కాడంటే నాకు చాల ఇష్టం. నేను వానికి ఇష్టమైన రూపంలో ఇష్టమైనప్పుడల్లా ఇష్టమైన చోటల్లా దర్శనం ఇచ్చి వాని కోరిక తీరుస్తుంటాను- అంటాడు శ్రీకృష్ణుడు.

ఇక్కడ సగుణ నిర్గుణ సాకార నిరాకారాది భేదాలు లేవు. భక్తుడు ఎలా ఉపాసిస్తే భగవంతుడు అలా అవతరిస్తాడు.

ఆ విశ్వమయునికి ఎవరి సహాయసహకారాలు అక్కరలేదు. సర్వ శక్తులు ఆ దేవుని వశంలో ఉంటాయి. ఆతడు మూల కారణభూతుడు, సర్వసృష్టికి బీజప్రాయుడు. విశ్వవిరాట్ రూపం అతనిదే. ఇతరులను మోహపెట్టగలడు, మోక్షం ప్రసాదించగలడు. ఆ స్వామి గుణాలకు అతీతంగా ఉంటాడు, గుణాత్మకంగానూ ఉంటాడు.

ఆ భువన మోహనమూర్తిని చూచినపుడు ఎట్టి వారైన, ఎంతటి యోగీంద్రులైన పరవశులు కావలసిందే. ఆ దివ్య దర్శనాన్ని మహా భాగ్యంగా భావించి రసానందం అనుభవిస్తుంటారు. ధన్యజీవులు. లౌకిక వస్తు మోహం దూష్యంకాని, పరమాత్మునిపైగల మోహం పూజ నీయం, స్తవనీయం.

ఈ భక్తియోగానికి అందరూ అర్హులే. స్త్రీ పురుష వయోభేదం లేదు.

పుంస్త్వే స్త్రీత్వే విశేషోవా
జాతినామాశ్ర మాదయః
న కారణం మద్భజనే
భక్తిరేవ హి కారణమ్ 1

81 సూ. త్రిసత్యస్య భక్తిరేవ గరీయసి భక్తిరేవ గరీయసి

త్రిసత్యాలు - దైహికమైనది వాచికమైనది మానసికమైనది. ఈ మూడువిధాల ముమ్మాటికి భక్తి యోగం ఇతర జ్ఞాన కర్మాది యోగాలకంటే సర్వశ్రేష్టమైనది.

భూత భవిష్యద్వర్తమానలలో త్రికరణశుద్ధిగా భక్తి మాత్రమే శ్రేష్టం. సాంఘిక ధార్మిక నైతిక ప్రమాణాలు మారవచ్చు కానీ భక్తి నిత్యం. భక్తి ప్రేమస్వరూపిణి. ఇది పరమాత్మవలె సత్యమయింది, నిత్యమయింది. భక్తి గొప్పదనం ఎప్పటికీ తరుగనిది, సర్వత్ర మాన్యమయింది.

ఉపనిషత్తులు ఇలా ఘోషిస్తున్నాయి -

సర్వోపాయాన్ పరిత్యజ్య భక్తిమాశ్రయ
భక్తి నిష్టోభవన - భక్తి నిష్ఠోభవ -
భక్త్యా సర్వ సిద్ధయః సిధ్యంతి
భక్త్యా సాధ్యం న కించిదస్తి 2

1. అధ్యాత్మ రామాయణం
2. త్రిపాద విభూతి నారాయణోపనిషత్

అన్ని ఉపాయాలు మానుకో. భక్తిని మాత్రం ఆశ్రయించు. భక్తి పరుడవుకమ్మ. భక్తి నిష్ఠ పొందుము. భక్తి వలన అన్ని సిద్ధులు సిద్ధిస్తాయి. భక్తి సాధించలేనిది అంటూ ఏదీ లేదు. భక్తియే సాధ్యం. పొంద దగింది భక్తి మాత్రమే.

యథాగ్నిః సుసమృద్ధార్చిః
కరోత్యేధాంసి భస్మసాత్
తథా మద్విషయా భక్తి
రుద్ధ వైనాంశి కృత్స్నశః 1

ఉద్ధవా! అగ్ని ఎండు కట్టెలను కాల్చి వేసినట్లు నా భక్తి సర్వ పాప జాలాన్ని భస్మం చేస్తుంది.

భక్త జనుల సాధనలను కూడా దేవుడే సంరక్షించి వృద్ధి పరుస్తుంటుంటాడు. భగవత్ప్రీతి కూరుస్తాడు. ఈ భక్తి వ్రతానికి సర్వులు అధికారులే. రామాయణ భారత భాగవతాది గ్రంథాలలో భక్తినిగూర్చి విపుల ప్రశంస ఉంది. ఇది సత్యం. ఇందుకే చివరకు నారద మహర్షి నొక్కి చెప్తున్నాడు- మనసా వాచా కర్మణా ఆలోచించి నిర్ధారించాను భక్తి సర్వశ్రేష్ఠం భక్తి సర్వసులభం- అని,

శ్రేయములు కురియు భక్తిని
జేయక కేవలము బోధసిద్ధికి తపమున్
సేయుట విఫలము - పొల్లున
ఆయము సేకురునె తలప అధికంబైనన్ 2

---

1. శ్రీమద్భాగవతం - ఏకాదశ 14/19
2. ఆంధ్రమహాభాగవతం

# భక్తిదర్శనాచార్యులు

82 సూ. గుణ మాహాత్మ్యాసక్తి, రూపాసక్తి,
పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి,
సఖ్యాసక్తి, వాత్సల్యాసక్తి,
కాంతాసక్తి, ఆత్మనివేదనాసక్తి,
తన్మయతాసక్తి. పరమవిరహాసక్తి
రూపైకధా ప్యేకాదశధా భవతి

ఒకటే అయిన భక్తిని నారదమహర్షి పదకొండు ఆసక్తులుగా పేర్కొన్నాడు.

1. గుణమాహాత్మ్యాసక్తి 2. రూపాసక్తి 3. పూజాసక్తి
4. స్మరణాసక్తి 5. దాస్యాసక్తి 6. సఖ్యాసక్తి 7. వాత్సల్యాసక్తి
8. కాంతాసక్తి 9. ఆత్మనివేదనాసక్తి 10. తన్మయతాసక్తి
11. పరమవిరహాసక్తి.

పరిపూర్ణ భక్తులలో ఈ పదకొండు ఆసక్తులూ ఉంటాయి. గోపికలు ఇందుకు ఉదాహరణలు. వారిలో అన్ని ఆసక్తులు ఉన్నాయి. ప్రతి భక్తునిలోనూ అన్ని ఆసక్తులు ఉండాలని లేదు. వారి వారి అభిమతానుసారం రెండు మూడు కలిసి ఉండవచ్చు. లేదా ఏదైన ఒక ఆసక్తి మాత్రం ఉండవచ్చు, ఇందులో ఎక్కువ తక్కువలు లేవు. అన్నీ సమానములే. ఏ ఒక్కదానిలోనయినా భగవత్ ప్రేమ పొందవచ్చు

కొందరికి భగవంతుని కల్యాణ గుణ కీర్తనం చేయటంలో మక్కువ ఎక్కువ. కొందరికి స్వామి దివ్య సుందర ముగ్ధమోహనరూప సందర్శనంలో ఆకాంక్ష అధికం. కొందరికి స్వామిని సాకార రూపంలో చూచి పూజలుచేసి అర్చనలుచేసి పాదసేవ చేయటమంటే ప్రాణం. కొందరికి స్వామిని తన కుమారుడుగా తలంచి స్నానపానాదులు చేయిస్తూ జోల పాటలు పాడుతూ ఎత్తుకొని ముద్దాడాలని మమత. మరికొందరికి స్వామిని తన ప్రాణపతిగా ప్రియుడుగా శృంగారంచేసి తాను నాయిక వలె గారాలు పోవాలని ఎడబాటు అయితే మధురాతి మధురమైన విరహవేదన పొందాలని తీయని కోరిక. ఆత్మసమర్పణ చేసి ఆత్మ సాక్షాత్కారం పొందటం అందరి ఏకైక లక్ష్యం.

గుణమాహాత్మ్యాసక్తి - ఇందులో రెండు విధానాలున్నాయి. మొదటిది భగవంతుని గుణాలు వినుతించటం మహిమాసక్తి, దీనిని పాశ్చాత్యులు "సహజమతము" అంటారు. వారికి మాధవ మానవ సంబంధం వింతగా తోస్తుంది.

రెండవది భగవంతుని భువన మోహన రూప సౌందర్యం దర్శించి ప్రేమించటం. ఇది ప్రేమాసక్తి. ఈ రెండూ ఉన్నత భక్తికి వికాస దశలు.

రూపాసక్తి— మిథిలాపురి పౌరులు, గోపికలు, దండకంలోని ముని జనులు, రాధిక, ఆధునికులలో మీరాబాయి, తులసీదాసు. రామదాసు, త్యాగరాజు.

పూజాసక్తి— శ్రీలక్ష్మీదేవి, పృథుచక్రవర్తి, అంబరీషుడు, భరతుడు, వ్యాసమహర్షి.

స్మరణాసక్తి— ప్రహ్లాదుడు, నారదుడు. ధ్రువుడు, సనకాదులు, శబరి, చైతన్య ప్రభువు, పురందరదాసు, గాంధీ మహాత్ముడు.

దాస్యాసక్తి— హనుమంతుడు లక్ష్మణస్వామి, అక్రూరుడు, విదురుడు, గరుడుడు, శేషుడు, శబరి, గుహుడు.

సఖ్యాసక్తి— అర్జునుడు, ఉద్ధవుడు, సంజయుడు, సుదాముడు (కుచేలుడు) సూరదాసు.

వాత్సల్యాసక్తి— అతిది కశ్యపులు, సుతపాపృశ్నులు, శతరూపా మనువులు, కౌసల్యాదశరథులు, యశోదానందులు, దేవ వసుదేవులు.

ఆత్మనివేదనం— బలిచక్రవర్తి, అంబరీషుడు, ఆంజనేయుడు, విభీషణుడు, శిబి.

తన్మయాసక్తి— యాజ్ఞ్యవల్క్యుడు, శకుడు, సనకాది మునిగణం, కౌండిన్యుడు, సుతీక్ష్ణుడు.

పరమవిరహావస్థాసక్తి— ఉద్ధవుడు, గోపికలు, అర్జునుడు, రామ కృష్ణ పరమహంస.

× × × ×

"హరి" యను రెండక్షరములు
హరి యించును పాతకంబు, అంబుజనాభా!
హరి! నీ నామమహత్వము
హరి హరి! పొగడంగ వశమె హరిశ్రీకృష్ణా!

విష్ణుమూర్తి దగ్గరకు ప్రవేశం ఈయలేదు. సరికదా ఇంకా పైగా పరిహాసం చేశారు. దుర్భాషలాడారు. మహాత్ముల మనస్సు చివుక్కుమంది. ఎన్నడూ ఆగ్రహం ఎరుగనివారికి దురాగ్రహం వచ్చింది. వెంటనే ఆ మహాత్ములు ద్వారపాలకుల గర్వం అణచటంకోసం శపించారు.

"మీరు పదవీచ్యుతి పొంది రాక్షసులై జన్మింతురు గాక!" అప్పటికి జయవిజయుల గర్వం దిగింది. వారు విలవిలలాడారు. వారికి శాపప్రభావం తెలిసింది. శ్రీమహావిష్ణువుని మహామందిర ద్వారపాలకులైన జయవిజయులు మునీశ్వరుల కాళ్ళపైన పడ్డారు. సంయమీంద్రుల మాటలు కటువు. కానీ మానసములు నవ్యవనీత సమానములు. మునులు వీరి దుఃఖాన్ని చూడలేక శాపానికి కొంత ఉపశమనం కల్పించాలని ప్రశ్నించారు. "మీరు మూడు జన్మలలోనే క్రూర కర్మలు చేసి విష్ణువిరోధులై విముక్తి పొందుతారా! లేక మాన్యులై అనేక జన్మలెత్తి విష్ణు సాయుజ్యం పొందుతారా!"

అందుకు వారు "మూడు జన్మలలోనే ముక్తి అనుగ్రహించండి." అన్నారు. దయామయులు అనుగ్రహించారు.

ఆ జయవిజయులే మొదట హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగాను రెండవ జన్మలో రావణ కుంభకర్ణులుగాను మూడవ జన్మలో శిశుపాల దంతవక్త్రులుగా ఘోర రాక్షస జన్మలెత్తి విష్ణు విరోధులై జగత్కంటకులై జనార్దనుని చేతిలో మరణించి విష్ణులోకం పొందారు. సనత్కుమారుల మహిమ అట్టిది.

'హరిః శరణమ్' అనేది సనత్కుమారులకు నిత్య పారాయణ మంత్రం. ఈ మహాతపస్సంపన్నులు 'తన్మయాసక్తి స్మరణాసక్తి' గల భక్త శ్రేణిలో అగ్రగణ్యులు. వీరు నారదమహర్షికి 'పరమార్థం' ఉపదేశం చేశారు. వీరు వైష్ణవ భక్త వర్యులలో సర్వశ్రేష్ఠులు. 'సనత్సుజాతము' సనత్కుమారుల వేదాంతబోధ. వీరు దీనిని బోధించారు.

వీరి పేర 'సనత్కుమార సంహిత' అను సంహిత ఉంది, అందులో శ్రీచక్ర విద్యనుగూర్చి కూడా అనేక విషయాలు వివరించబడ్డాయి. ఉత్తములకు బాహ్యపూజ కర్తవ్యంకాదు- బ్రహ్మవాదులు అంతర పూజారతులు. తంత్రవాదులు బాహ్యజాతులు బాహ్యపూజారతులు. బాహ్యపూజ ఐహికఫలదాయి. అని వివరణ ఉంది.

వీరు భక్త్యాచార్యులలో సర్వప్రథములుగా పరిగణింపబడిన పూజనీయులు. వీరు నారద మహర్షికి గురువులు. కనుకనే ప్రథమతాంబూలం వారికిచ్చారు నారద మహర్షి.

× × × ×

నిరహంకారము నిర్మమత్వమును తండ్రీ! నిత్యనైమిత్తికా
చరణస్ఫూర్తియు శాంతి దాంతియు యదృచ్ఛాలాభ సంతుష్టి నీ
చరణ ధ్యాన సమాధులన్నవెకదా! సత్యం శివం సుందరం
పరమంబైన భవత్ పదంబునకు సోపానంబు లాత్మేరా! 1

వేదవ్యాసుడు- వేదవ్యాసుని తండ్రి పరాశరుడు. తల్లి సత్యవతి. ఈయన కృష్ణ ద్వీపంలో జన్మించాడు. ఈయన మహాతపోనిధి. అపార విజ్ఞానఖని, వేదవేదాంత మర్మజ్ఞుడు. ఈ మహర్షి పురాణ ఇతిహాస సకల శాస్త్రాదులు తెలిసినవాడు. నారదమహర్షికి శిష్యుడు.

ఏకరాశిగాఉన్న వేద వాఙ్మయాన్ని "ఋగ్వేదం" "యజుర్వేదం" "సామవేదం" "అధర్వణవేదం"గా నాల్గు విభాగాలుగా చేశాడు. కనుక వేదవ్యాసుడనే పేరు ఈ మహానుభావునికి వచ్చింది. ఈయన అష్టాదశ పురాణాలు వెలయించాడు. పంచమ వేదంగా 'జయ' అనే పేరుతో మహాభారతం రచించాడు, అందు అంతర్భాగంగా "భగవద్గీత" బోధించాడు.

---

1. మాధవపెద్ది బుచ్చిసుందర శాస్త్రి - బృందావనం పుట 8

ఆ మహాభారతం ధర్మశాస్త్రంగాను నీతి శాస్త్రంగాను పురాణంగాను మహాకావ్యంగాను పండిత ప్రశంసలు పొందింది. అందులో ఈయన చెప్పని ధర్మంలేదు. పరిష్కారం చేయని సమస్యలేదు. ఈయన భరత వంశీయులకు మూలపురుషుడు. ధర్మజాదులు స్మరించినమాత్రాన వచ్చి అనేక సందేహాలు తీర్చి వారికి అభ్యుదయ మార్గాన్ని ఉపదేశించేవాడు.

అయినా ఈయనకు మనశ్శాంతి కలుగలేదు. కారణం ఆలోచనకు అందలేదు. అపుడు ఆయన నారద మహర్షిని అడిగాడు. నారద మహర్షి ఆలోచించి 'నీవు ఇన్ని రచించావు. కానీ విష్ణు భక్తినిగూర్చి మహత్తర గ్రంథం ఒక్కటీ వ్రాయలేదు. ఇతర గ్రంథాలు ఎన్ని వ్రాసినా అవి కాకతీర్థాల వంటివేకాని పరమహంసల ప్రశంసకు పాత్రమైనవికావు. భాగవతం రచించు. నీకు మనశ్శాంతి కల్గుతుంది' అని హితోపదేశం చేశాడు. అప్పుడు వ్యాసుడు విష్ణుభక్తి ప్రాశస్త్యం వివరించే మహాభాగవతం వ్రాసి చరితార్థుడై విష్ణుప్రీతి పొందాడు.

ఈయన గుణ మహాత్మ్య సక్తి రీతిలో అగ్రేసరుడు. ఈయన శుకమహర్షికి సాక్షాత్తు జనకుడు. ఈయన నాల్గు ముఖాలు కాక ఏక ముఖంగల బ్రహ్మదేవుని అంతటివాడు. నాల్గు చేతులు కాక రెండు చేతులు మాత్రమేగల శ్రీమహావిష్ణువే. నొసట కన్ను లేని మహాదేవుడు ఈ వేదవ్యాస మునీశ్వరుడు. విద్వన్ముఖ్యుడు. వేదమూర్తి, త్రిజగద్విఖ్యాత తేజో విరాజితుడు. వివిధకవి శ్రేష్ఠులచేసంస్తవనీయుడు. భవ్య కవితావేశంగల విజ్ఞాన సంపదగల మహామహుడు. మహామునీశ్వరులచే ప్రశంసింపబడిన ఉత్తమోత్తముడు. ఈయనభారతీయ సంస్కృతికి మూలపురుషుడు.

విద్వత్సం స్తవనీయ భవ్యకవితా వేశుండు—విజ్ఞాన సం
పద్విఖ్యాతుడు-సంయమిప్రకర సంభావ్యాను భావ్యుండు-కృ
ష్ణద్వైపాయనుడర్థి లోకహిత నిష్ఠంబూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యమ్నాయమున్ ।

ఈయన భారతీయ సంస్కృతి ప్రియులకెల్లరకు నిత్య సంస్మరణీయుడు. - వందనీయుడు -

శుకమహర్షి - ఈయన వ్యాసమహర్షి కుమారుడు. శుకమహర్షి తండ్రివద్ద సకల విద్యాతత్త్వ సారం గ్రహించాడు. విదేహ నగరంలో మహాతత్త్వజ్ఞాని అయిన జనక మహారాజు వద్ద ఆత్మ విద్య అభ్యసించాడు. ఈయన సకల ఆగమార్థసారగాత్రుడు. అకలంక చంద్రుడు. పరమ పవిత్రుడు. దేవతా స్తవనీయుడు. ఈ మహాభక్తుడు శ్రీహరి యెడల పరమ విరహాసక్తి కలిగి విష్ణుగుణ మహాత్మ్యాసక్తిలో పరితపించే భక్త్యాచార్యులలో ప్రధానుడు.

ఈయన ఎక్కడా ఎక్కువసేపు నిలవడు. ప్రశ్నకు సమాధాన మీయకుండా వెళ్ళడు. అది ఈయన స్వభావం. వ్యాసుడు భారత భాగవతాదులు రచించి శుకుడికి శిష్యులకు బోధించి ధర్మప్రచారంచేయ వలసింది అన్నాడు. తండ్రి ఆజ్ఞ తలదాల్చి ధర్మబోధ చేశాడు.

పరీక్షిన్మహారాజు ఒకసారి వేటకు వెళ్ళి వేటాడి వేసారి దప్పిక గొన్నాడు. మంచితీర్థం లభించే దారే కనిపించలేదు. ఆరాజు ఒక మునిని అడిగాడు. ముని తపస్సమాధిలో ఉన్నాడు. ఆతడు సమాధాన మీయలేదు. రాజు చికాకు పడ్డాడు. శమీక మహామునీంద్రుడని తలంచక మత్తుడెవరో అనుకొని విసుగుతో మృత సర్పాన్ని అటువిసిరి వెళ్ళిపోయాడు. ఆ పాము ముని మెడపై పడింది.

---

1. ఆంధ్రభాగవతం విరాట పర్వం ప్రారంభం

ఇంతలో ఆ మునికుమారుడైన శృంగి వచ్చి ఇది చూచి ఆగ్రహించాడు. "మృతసర్పాన్ని నా జనకునిపై విసరినవాడు సప్తదివసాలలో సర్పంచేతనే మరణిస్తాడు" అని శపించాడు. మునికిది తెలిసి రాజును శపించినందుకు బాధపడ్డాడు. రాజుకు ఈ సంగతి తెలియపరచాడు.

పరీక్షిన్మహారాజు తానుచేసిన పాపకృత్యానికి పరితపించి ముక్తి మార్గం "ఏమటి" అని మహా విద్వాంసులతో పర్యాలోచన చేశాడు. వారు శుకమహర్షిచే భాగవతం వింటే ముక్తి లభిస్తుందని విన్నవించారు.

అదృష్టవశాత్తు ఆక్షణంలో అచటికి శుకమహర్షి వచ్చాడు. రాజు వచ్చిన మహర్షిని పూజించి భాగవతం చెప్పి ముక్తి ప్రసాదించవలసినదిగా ప్రార్థేయపడినాడు. ప్రశ్న వెంట ప్రశ్న వేసి ఏడు దినములు భాగవతం చెప్పించుకొన్నాడు. ప్రశ్నకు సమాధానమీయక వెళ్ళలేదు కనుక శుక మహర్షి ఏడురోజులు అలానే ఉండి విష్ణు కథలుచెప్పి మహారాజుకు మాధవలోక సౌభాగ్యం ప్రసాదించాడు.

ఈ శుకమహర్షి నారదునిద్వారా బ్రహ్మవిద్య పొంది గగన మార్గాన పరమాత్మలో సంధానం కావటానికి వెళ్ళుతున్నాడు. ఇది చూచి వ్యాసమహర్షి పుత్రప్రేమకు లోనయి 'హా! పుత్రా! పుత్రా! అని విలపిస్తూ విపినాలవెంట పుత్రుని వెంబడించాడు. అదే సమయంలో ఆ ప్రాంతంలోని ఒక సరోవరంలో దేవతాస్త్రీలు జలకాలాడుతున్నారు. శుకమహర్షి అటువైపు పయనించాడు' శుకుణ్ణిచూచి కూడా ఆ దేవతా స్త్రీలు యథా తథంగానే వివస్త్రలై జలక్రీడలాడుతూనే ఉన్నారు. అటు తర్వాత వేదవ్యాసులవారు పుత్రుని పిలుస్తూ అటే వస్తున్నారు. అది గమనించిన అప్సరసలు అమితంగా సిగ్గుపడి వస్త్రాలు సర్దుకొన్నారు. ఇది చూచిన వ్యాసునికి సందేహం వచ్చి ఆ స్త్రీలను అడిగాడు. వారు ఇలా అన్నారు—

"మహార్షి చంద్రా! మీ పుత్రుడు యుక్తవయస్కుడే. మహా మునీంద్రుడే. కానీ ఆయన నిర్మమత నిరహంకారం నిర్గుణం గలవాడు. ఆయన ముఖంలో పసిపాపలోని అమాయకత ఆప్యాయత లేకానీ కామ మోహ గుణాలు మచ్చుకుకూడా లేవు. వాసనాదులంటని పద్మం ఆయన ముఖం. అందువలన మేము ఆయనను చూచినా మమ్ము ఆయన చూచినా మనస్సులు మాతా శిశుప్రేమలోనే నిండాయి. కానీ అన్యం కాలేదు. తమరు పెద్దవారైనా తమను చూడగానే మనోవికారాలు కలుగుతున్నాయి. తమలో ఆ పరబ్రహ్మ నిర్వికార గుణం కనిపించలేదు. అందువల్ల మేము తమరినిచూచి స్త్రీ సహజమైన సిగ్గును పొందాము" వ్యాసుడు సిగ్గుపొందాడు పుత్రుని ఉన్నత స్థితికి పొంగిపోయాడు. తండ్రికి కావలసింది అదేకదా!

శుకుడు అలా కొంతదూరమేగి పంచభూతాత్మకమైన ప్రకృతిలో లీనమై పరమాత్మను జేరుకొన్నాడు.

సముడై యెవ్వడు ముక్తకర్మచయుడై సన్యాసియై యొంటి పో
వ-మహాభీతి "ఓహో! కుమార!" అనుచున్ వ్యాసుండుపీరంగ-వృ
క్షములున్ తన్మయతన్ ప్రతిధ్వనులు సక్కంజేసె మున్నట్టి భూ
త మయున్ మ్రొక్కెద బాదరాయణి తపోధన్యాగ్రణిన్ ధీమణిన్ ।

శాండిల్యుడు- ఈయన భక్త్యాచార్యులలో సుప్రసిద్ధుడు. నారద భక్తి సూత్రములవలె శాండిల్య భక్తి సూత్రాలు లోకప్రసిద్ధిని పొందాయి. నిర్గుణోపాసనా పద్ధతి ఈయన కత్యంతప్రీతి. ఈయన "ఆత్మరతి" యే నిజమైన పరతత్త్వ భక్తి అని ప్రబోధించాడు. ఈతత్త్వ జ్ఞుడు మహాత్మ్యాసక్తిగల భక్త వర్యులలో అగ్రేసరుడు.

1. ఆంధ్రభాగవతం ప్రథమం ౭౦

ఒకసారి ఈమహర్షి ధాన్యమాలినిపై మనసు పడ్డాడు. ఆ దివ్యాంగన సుస్నాతయై మునిచంద్రుని సమీపించాలని గడువుకోరింది. అందుకు ముని సమ్మతించాడు. ఇంతలో రావణుడు ఆ దివ్యస్త్రీని బలాత్కరించాడు, ఆమె విలపిస్తూ మునీంద్రునకీ సంగతి విన్నవించుకొన్నది. అపుడు మునికి ఆగ్రహంవచ్చి "రావణా! నీవు రామకారణంగా నరుని చేతిలో నశిస్తావు. అంగనా! నీవు మొసలివై ఈ మడుగులో పడిఉంటావు" అని శపించాడు.

ఆ దివ్యాంగన మునిపాదాలపై వ్రాలి 'నాకు శాపవిముక్తి ఎప్పుడు స్వామీ!, అని విలపించింది.

దయాళువైన మహాత్ముడు ఇలా అన్నాడు–

శ్రీరామ కార్యార్థమై హనుమంతుడు ఈమడుగు వద్దకు వస్తాడు అపుడు ఆ మహాత్ముని స్పర్శతో నీకు శాపవిముక్తి లభిస్తుంది.

రావణుడు రామచంద్రుని చేతిలో సంహారింపబడటానికి ఈ ముని శాపంకూడా ఒక కారణం.

ఈ భక్త్యాచార్యుడైన శాండిల్యుడు ఇంత మహిమాన్వితుడు. మహాశక్తి సంపన్నుడు.

గర్గఋషి-

ఈయన మన్యువు కుమారుడు. గర్గఋషికి శని, కాలయవనులని ఇద్దరు కుమారులు.

గర్గఋషి హైహయరాజవంశ పురోహితుడు. హైహయరాజులు జమదగ్ని హోమ ధేనువును పట్టనున్నప్పుడు గర్గుడు వారికి 'కూడనిపని' అని హితం చెప్పాడు ఈయన హితంవినిన కారణంచేతనే రాజవంశం నాశనమయింది. ముచికుందునికి 'నారాయణుడు ఇరువది ఎనిమిదవ మహాయుగంలో అవతరిస్తాడు' అని ఈయన భవిష్యత్తును వచించాడు.

గర్గుడు విష్ణుభక్తుడు. గర్గ సంహితను వెలయించిన విజ్ఞాని. "కథాదిష్వితి గర్గః" అని చెప్పిన భక్తి సూత్రకారుడు గర్గుడు. వరగోవింద కల్యాణ గాథలు శ్రద్ధగా శ్రవణం చేయటమే భక్తి అని కథా శ్రవణానికి ప్రాధాన్యం ఇచ్చిన భక్తి తత్త్వాచార్యుడు ఈయన.

ఈయన అయోధ్యలో శ్రీరామ దర్శనం చేసుకున్నాడు. సరస్వతీ నదీతీరంలో నివసించి ఖగోళ శాస్త్రంపై అంతరిక్ష పరిశోధన చేశాడు. ఈయన శ్రీకృష్ణస్వామికి నామకరణోత్సవ క్రతువు నిర్వహించిన నంద పురోహితుడు కూడ. ఈయన నివసించిన ప్రాంతమందు గర్గ స్రోత ప్రవహిస్తోంది. ఈయన యుధిష్ఠిరునికి "విశ్వతత్త్వం" వివరించిన వేదాంత తత్త్వజ్ఞుడు. ఈయన జ్యోతిశ్శాస్త్ర విశారదుడు.

ఈయన తనసంహితలో కృష్ణః శబ్దాన్ని ఇలా వ్యాఖ్యానించాడు-

కకారః కమలాకాంతః ఋకారో రామ ఇత్యపి
షకారః షడ్గుణపతిః శ్వేతద్వీప నివాసకృత్
ణకారో నారసింహోఽయం అకారోఽక్షరోఽగ్నిభుక్
విసర్గౌచ తథా హ్యేతౌ నర నారాయణా వృషీ
సంప్రవీనాశ్చ షట్పూర్ణః యస్మిన్ శబ్దే మహాత్మని
పరిపూర్ణతమో సాక్షాత్తేన కృష్ణః కీర్తితః 1

'కృష్ణః' శబ్దంలోని క కారం కమలాకాంతుడు, ఋకారం శ్రీరాముడు. షకారం శ్వేతద్వీపంలో ఉండే షడ్గుణైశ్వర్యపతి శ్రీమహావిష్ణువు, ణకారం నరసింహస్వామి, అకారం అగ్నిని మ్రింగిన అక్షర స్వరూపుడు. విసర్గలు నరనారాయణులు - పూర్ణులైన ఈ ఆర్గురు కృష్ణునిలో కలరు. గాన కృష్ణుడు పరిపూర్ణతముడైన అవతారపురుషుడు.

---

1. వంశీధర భక్తిరస వ్యాఖ్య శ్రీ సచ్చిదానందేంద్ర సరస్వతి

కృష్ణుడు, రాముడు, నరసింహుడు, శ్రీవిష్ణువు, నరుడు, నారాయణుడు ఈ ఆర్గురు పూర్ణావతార పురుషులు. ఈ ఆరుగురి సమ్మేళన స్వరూపుడు కృష్ణుడు, కనుక కృష్ణుడు పరిపూర్ణ అవతార పురుషుడని తాత్పర్యం.

ఈ గర్గఋషికి వాచ్నకవి అను పుత్రిక ఉండేది. ఆమె మహా తపస్విని. ఆమె బ్రహ్మవాదిని.

జ్యోతిశ్శాస్త్రులకెల్ల మేటరివి—తేజోమూర్తి-వాశాంత వి
ఖ్యాత స్ఫూర్తివి—బ్రహ్మబోధనుడ-వాకర్ణింపు నాపల్కు—ని
ర్ణీతుండైన గురుండు మానవులకున్ విప్రోత్తముండంద్రు—నీ
చాతుర్యంబున ఈ కుమారులకు సంస్కారంబు గావింపవే! 1

విష్ణు- విష్ణు శ్రీమహావిష్ణువే. దశావతారాలు దాల్చి లోకధర్మ సంరక్షణార్థమై భక్తి ప్రబోధం చేశాడు. దశావతారాలేకాక హయగ్రీవ దత్తాత్రేయాది అనేకానేక అవతారాలు దాల్చాడు. లక్ష్మీపతియై వైకుంఠవాసుడై కూడా గజేంద్రాది భక్తులను ఆపదలోవచ్చి ఆదుకొన్నాడు. నారదునికి తాతగా దాతగా జగన్నిర్మాతగా దేవదానవ గణవిజేతగా జగన్నాటక సూత్రధారిగా సకలజీవ పాత్రాధారిగా మహావిష్ణువు ప్రసిద్ధుడు. అనేక సందర్భాలలో విష్ణుభక్తిని ప్రబోధం చేశాడు.

ఆ విష్ణువే విష్ణు మునిగా అవతరించినాడు. స్మృతి వెలయించాడు విష్ణు స్వామిభక్తి సంప్రదాయం ఒకటి నడిపించాడు.

---

1. భాగవతం దశమ

శ్రీమహావిష్ణువు రామావతారమెత్తి రావణవధ చేయసాగితే శేషుడు లక్ష్మణస్వామిగా అవతరించి రాముని సేవించాడు. పతంజలి మహర్షి ఆదిశేషుని అంశఅని మహావిద్వాంసుల విశ్వాసం. పతంజలి భాష్యకారులలో అగ్రేసరుడు. యోగశాస్త్రంలో అద్వితీయుడు.

'జ్ఞానం కల్గటానికి మంచి అవకాశంగల మనుష్యజన్మమెత్తి ఆత్మ విద్య తెలుసుకొని శ్రీమహావిష్ణువైన కృష్ణ పరమాత్మను సేవించనివారు క్షేమంగా ఉండనూలేరు. మోక్షం పొందనూలేరు, అవి ఆదిశేషుడు అందించిన ప్రబోధం-ఈ శేషుని అంశలే సంకర్షణుడు రామానుజాచార్యులు.

బహువన పాదపాదాబ్ధి కులపర్వత పూర్ణ సరస్సరస్వతీ
సహిత మహామహీభర మజస్ర సహస్రఫణాళిదాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిసాయికి బాయకశయ్యయైన అ
య్యహిపతి దుష్కృతాంతకు డనంతుడు నాకు ప్రసన్నుడయ్యెడున్

ఉద్ధవుడు :- ఈయన దేవభాగుని కుమారుడు; వృష్ణి వంశీయుడు; శ్రీకృష్ణదేవునకు ఆప్తసుఖుడు, పరమభక్తుడు, అయిదేళ్ళ వయసునందే ఒకబాలునిలోకృష్ణదేవుని మధుర మూర్తిని దర్శించి తన్మయుడై పూజించి పరిచర్య చేసి భక్తిలో పరవశమైనాడు. సఖ్యాసక్తి, పరమవిరహాసక్తికీ ఇతడు మేటి,

కృష్ణుడు ఇతనిద్వారా గోపికలకు జ్ఞానసందేశం పంపాడు. గోపికలే ఇతనికి మాధవస్వామి మధుర భక్తిని వెల్లడించారు. గోపికల అచంలభక్తికి ఉద్ధవుడు అత్యాశ్చర్యపడి వారి మధురభక్తిని కృష్ణునకు వెల్లడించాడు. ఈయన జ్ఞానసారం ఎరిగిన పండితుడు అయినా జ్ఞానయోగం కంటె భక్తియోగం గొప్పదనీ, సులభసాధ్యమనీ, ప్రబోధించాడు. శ్రీకృష్ణపరమాత్మకు సంతోషంగా ఆత్మనివేదనం చేసుకొన్నాడు.

బుద్ధికి బృహస్పతి ఈ ఉద్ధవుడు. యదు వృష్ణి వంశాలు నశించినా లోకంలో జ్ఞాన ప్రసారం కొరకు ఉద్ధవుడు చిరంజీవిగా ఉన్నాడు. జ్ఞానం బోధించుడు అని విదురుడు ఉద్ధవుని అర్థించాడు. 'నన్నుకాదు. మైత్రేయుణ్ణి అడిగి తెలుసు కోండి' అన్నాడు ఉద్ధవుడు.

సిద్ధ వి చారు గభీరున్
వృద్ధవచో వర్ణనీయు వృష్ణి ప్రవరున్
బుద్ధినిధి అమరగురుసము
నుద్ధవునిన్ జూచి కృష్ణు డొయ్యన పలికెన్

అని భాగవతంలో ఈయన గుణాలు పేర్కొనబడినాయి.

ఆరుణి:- ఆరుణి బ్రహ్మవేత్త. అయోదధౌమ్యుని శిష్యులలో ప్రథముడు. ఈయనను ఉద్దాలకి ఆరుణి అని కూడా అంటారు. ఈయన వైదిక సద్ధర్మ ప్రవక్త.

ఈయనే నింబార్కుడుగా అవతరించాడని ప్రజల విశ్వాసం. రాధాకృష్ణుల యుగళ సంప్రదాయానికి మూలపురుషుడు ఈయన, ఈయన భాగవతానికి వ్యాఖ్యానం వ్రాశాడు.

త్రిమతాచార్యుల తరువరి అంతటిపేరుగొన్నవాడు ఇతడే అని కొందరి భక్తపండితుల అభిప్రాయం.

బలిచక్రవర్తి:- ఈ చక్రవర్తి మహాభక్తుడైన ప్రహ్లాదుని మనుమడు. ఈయన తండ్రి విరోచనుడు. బలి బలవంతుడేకాదు, మహా ధీరుడు. యజ్ఞయాగాలు చేసి ముల్లోకాలు జయించి మహా ర్తి పొం దాడు. ఇంద్రవైభవం హరించి త్రిలోక చక్రవర్తి అయినాడు. క్రమంగా ఆయనకు అధికార గర్వం ఎక్కువైంది.

శ్రీమహావిష్ణువు వామనావతారంతాల్చి బలిచక్రవర్తి యజ్ఞానికి వెళ్ళాడు. వామనమూర్తిలోని వర్చస్సు వేదపాండిత్యానికి ముగ్ధుడై బలి 'ఏమి కావాలో అడుగు' అన్నాడు. 'మూడు అడుగులనేల చాలు' అన్నాడు వామనుడు. 'ఇంతచిన్ని కోరిక కోరతగునా! మడులు మాన్యాలు కానీ, మణులు కాంతా మణులుగానీ, రత్నహారాలు కానీ, అగ్రహారాలు కానీ కోరుకో' అన్నాడు చక్రవర్తి. 'నా పాలికిదే బ్రహ్మాండం ఇయ్యిబాబూ' అన్నాడు వామనుడు.

శుక్రాచార్యుడిది గమనించి ఈవటువు మామూలు బ్రాహ్మణ వటువుకాదు. వామనావతారమెత్తి వచ్చిన విష్ణువులాగున్నాడు. అనుకొని "రాక్షసరాజా! ఇతడు రాక్షసాంతకుడైన శ్రీమహావిష్ణువు. ఏ దానము ఈయవద్దు" అన్నాడు.

సత్యసంధుడైన బలిచక్రవర్తి ఆలోచించి శుక్రనీతి వినక "విష్ణువే స్వయంగా దానం గ్రహించడానికి రావటం నా భాగ్యంకదా! విష్ణుమూర్తి చేయి క్రిందై నాచేయిపైనుండటం నా అదృష్టంకదా! ఇందులో నిరయంబైన నిబద్ధమైన ధరణీనిర్మూలనంబైన తిరుగన్ నేరదు నాదు జిహ్వ" అని శ్రీహరికి కాళ్ళుకడిగి దానంచేశాడు.

వామనుడు త్రివిక్రముడైనాడు. ఒక అడుగుతో భూమిని రెండవ అడుగుతో ఆకాశాన్ని కొలిచి " మూడవ అడుగు స్థలం ఎక్కడ " అన్నాడు "నా శిరంపై పెట్టు" మన్నాడు మహాభక్తుడైన బలిచక్రవర్తి.

మహా విష్ణువు మూడవ అడుగు బలి శిరముపై మోపాడు. మాధవుడు బలి హృదయంలోని పరమ భక్తి గ్రహించాడు. ఆ భక్తికి వశుడైనాడు. బలి గృహద్వారానికి తానే గదాధరుడై కావలికాయసాగాడు. భగవంతుడు భక్త పరాధీనుడు కదా!

ఈబలి చిరంజీవి. భక్త్యాచార్యులలో ఈయన గణ్యమానుడు. ఆత్మనివేదనం జరిపిన భక్తవర్యులు కొద్దిమందిలో యీాయన అగ్రగణ్యుడు.

బద్ధుండై గురు శాప తప్తుడయి తా బంధు వ్రజత్యక్తుడై
సిద్ధైశ్వర్యము కోలుపోయి విభవక్షీణుండునై పేదయై
శుద్ధత్వంబును సత్యమున్ కరుణయున్ సొంపేమియున్ తప్పడు
వృద్ధుండై యజయాఖ్యమాయ గెలిచెన్ పుణ్యుండితండల్పుడే

హనుమంతుడు – ఈయన తండ్రి కేసరి. తల్లి అంజనాదేవి. అంజనాదేవి సంతానార్థమై రుద్ర వాయువు అగ్నిదేవాదులను ధ్యానించింది. పెక్కేండ్లు తపస్సుచేసింది. కేసరికూడా ఘోర తపస్సు చేశాడు. వారి తపస్సు ఫలించింది. రుద్రవాయువు అగ్నిదేవాదులు కటాక్షించారు. మహాతేజస్వియైన బాలుడు జన్మించాడు. ఆదేవతలు బాలుని తమ బిడ్డగానే భావించి వరాలు ప్రసాదించారు. ఆ బాలుడే ఆంజనేయుడు.

ఒకసారి తూర్పు కొండపై పెద్ద పండువలె ఉదయిస్తున్న ఉదయ భాను బింబాన్ని చూచి ముచ్చటపడి పట్టుకొందాము అనుకొన్నాడు ఇంతలో రాహువు సూర్యుని మింగబోతున్నాడు. అది చూచి ఆంజనేయుడు రాహువును ఒక్క గుద్దుగుద్దాడు రాహువు వెళ్ళి ఇంద్రుని కాళ్ళపై పడ్డాడు. ఇంద్రుడు వచ్చి ఆంజనేయుడెవరో అనుకొని వజ్రాయుధం విసిరాడు. అది వచ్చి ఆంజనేయుని హనువుకు తగిలింది. అందరు హనుమా అని అన్నారు. హనుమంతుడు మూర్ఛపోయినాడు. వాయుదేవుడిందుకు కోపించి వాయువును లోకంలో ప్రసరింప కుండ స్తంభింప జేశాడు. గాలి ఎక్కడా లేదు. ఇది గ్రహించి ఇంద్రాదులు దిగి

వచ్చి వాయుదేవుని ఇష్టప్రకారం హనుమంతునికి ప్రాణం పోయటమే కాక అనేక వరాలు ప్రసాదించారు. ఆ వర బలంచేత హనుమంతుడు మహా తేజస్సంపన్నుడైనాడు. సూర్యదేవుని దగ్గర విద్యలు నేర్చుకొన్నాడు. సంగీత శాస్త్రం రచించాడు. సుగ్రీవుని మంత్రీశ్వరుడైనాడు.

శ్రీరామలక్ష్మణులు సీతావియోగం పొంది తిరుగుతూ ఋష్యమూక పర్వతం చేరువకు వచ్చారు. అప్పుడు సుగ్రీవునికి ధైర్యం చెప్పి తన రాజుకు శ్రీరామదర్శనం శ్రీరామ సఖ్య సౌభాగ్యం చేకూర్చాడు ఈ మంత్రీశ్వరుడు. రామదర్శనం అయినప్పటినుండి హనుమంతుడు శ్రీరామునికి నమ్మినబంటు అయినాడు.

సీతాన్వేషణకై వెడలు వానరులలో హనుమంతునికే తన అంగుళీయకం ఇచ్చాడు శ్రీరామప్రభువు. శతయోజనాల దూరంగల సముద్రాన్ని గోష్పాదంవలె తేలికగా దాటి లంకలో సీతను దర్శించాడు. రాక్షసదమనం మాత్రం కాక లంకాదహనంచేసి తిరిగివచ్చాడు. రామనామ మహిమతో వారిధిపై వారధి కట్టి లంకపై దండు నడిపాడు. లక్ష్మణస్వామికి ప్రాణదానం చేసిన మహాత్ముడు ఈమారుత తనయుడు. విభీషణునికి రామసాయుజ్య భాగ్యం కలిగించినవాడు ఈతడే. రావణ వధకు తోడ్పడి రామఆగమన శుభవార్త గుహునికి భరతునికి అందించిన శుభచరితుడు.

రామపట్టాభిషేకం అయిన తదుపరి సీరామాంజనేయ సంవాదం జరిపి వేదాంత తత్వగ్రంథానికి మూలకారణభూతుడు అయినాడు. ఈమహాభక్తుడు.

దాస్య భక్తికి పసిద్ధుడైన వీనిలో అన్ని భక్తి విధానాలు సమ్మిళితమై వెలుగుతుంటాయి.

నారద ప్రోక్తములైన ఈ మంగళకరసూత్రాలు శివుడు అనుశాసించినవే. మానవుడు వీనిపై ప్రగాఢమైన విశ్వాసం ఉంచి శ్రద్ధగా అభ్యసించినచో ప్రాణ ప్రియమైన భగవంతుని పొందగలడు.

ఏ శాస్త్రానికైనా నాలుగు ముఖ్యాంగాలుంటాయి. అర్హత- విషయం- సంబంధం- ప్రయోజనం -

ఈభక్తి శాస్త్రాభ్యాసానికి మానవజన్మ పొందటమే అర్హత. ఇది ఎన్ని జన్మల సుకృత ఫలంవల్లనో కానీ లభించదు. పశుపక్ష్యాదులు కూడా సత్కర్మలు చేయాలి. అనుకోకుండానే మంచి పనులకు అవి ఉపయోగపడి పుణ్యం సంపాదిస్తాయి. మానవ జన్మను పొందుతాయి. మానవులై పుట్టి శాస్త్రజ్ఞానం కలిగి సంకల్పించి భగవత్కృపకు పాత్రులవుతాయి.

విషయం అనగా శివానుశాసనం పాలించడమే. ఆత్మకళ్యాణంతో లోక కల్యాణ కార్యక్రమమే ఈ శాస్త్రానికిగల ముఖ్యవిషయం.

శాంతి సత్యాహింసాది సుగుణాలు అన్నీ ఒక గొలుసులోని కడియాలవంటివి. ఇవి అన్నీ పరస్పర సంబంధితాలు. వీనిని మెదడుతో తెలుసుకొని హృదయంతో భావనంచేసి సంబంధంకలపాలి జీవాత్మ పరమాత్మల సంబంధమే ఈ సంబంధం.

ఈ శాస్త్రప్రయోజనం జీవాత్మ పరమాత్మతో ఐక్యమై బ్రహ్మానందానుభవం పొందటమే.

ఇది ఫలశ్రుతి. ఈ నారద సూత్ర సూక్తులు శివానుశాసనంగా పార్వతీదేవ్యాది సురవర్యులు ఆచరించి ఇష్టకామ్యాలు పొంది శాశ్వతులైనారు. విశ్వాసం, శ్రద్ధ, అభ్యాసం, భక్తునికి సాధనోపాయాలు. ఈ పరమ భక్తిని పొందటయే చరమ పురుషార్థం. ధర్మార్థ కామ

మోక్షాలు నాలుగూ కాక ఈ పరమ భక్తి పంచమ పురుషార్థం. ఇది మోక్షం కంటె అధికమైనది. ఇది అందుకోవటమే మానవ జీవన పరమ ప్రయోజనం.

శివుడు పార్వతీ దేవికి కాశీమహాత్మ్యం చెప్పి భక్తి లేనివానికిది వినిపించకు అంటాడు-

ఈ రహస్యంబు చెప్పకు మెవ్వరికిని
శంభు భక్తున కత్యంత శాంతమతికి
శ్రద్ధధానున కధిక విశ్వాసమతికి
అనఘు మానసునకు ముముక్షునకు దక్క-

ఇతి శివమ్



1. శ్రీనాథుడు కాశీఖండం 6-12

# అభిజ్ఞుల ఆశీస్సులు

మహాయోగీశ్వరులు-గీతావాణి సంపాదకులు

శ్రీశ్రీశ్రీ శ్రీరామకృష్ణానందస్వామి — నాఉల్లాసలాస్యం

ఋషీకేశ శివానందాశ్రమవాసులు

శ్రీశ్రీ స్వామిదేవానంద-చినస్వామి — ఆనందవాణి

పుంభావశారదామూర్తులు

ఆచార్య శ్రీ దివాకర్ల వేంకటావధాని — శుభాశంసనం

ఉభయవేదాంత ప్రవర్తకులు

శ్రీ శ్రీభాష్యం అప్పలాచార్యులు — మధుర దర్శనం

అవధాన సరస్వతి

శ్రీ పేరాల భరతశర్మ — మహతీశ్రుతి

కళాప్రపూర్ణ

శ్రీ పసల సూర్యచంద్రరావు — నాయెరుక

# నా ఉల్లాస లాస్యము



శ్రీరామకృష్ణానందస్వామి
“గీతావాణి” సంపాదకులు

‘శాంతిశ్రీ’ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రిగారి ‘నారద భక్తి దర్శనం’లో ఎనభై పుటలవరకు సందర్శించాను. గ్రంథం శ్రద్ధతో పఠించాను. వీరిం సరస్వతి రసం వర్షించింది. ‘దేవో భూత్వా దేవం యజేత’ దేవుడవై దేవుని పూజించాలి అంటారు. ఈయన భక్తుడు కాబట్టే భక్తి దర్శనం రచించారు. భాషలో లాలిత్యం, భావంలో మాధుర్యం, బహు గ్రంథపరిచయం, నమ్ర కృతజ్ఞతా ప్రకటనం, చేతికి వచ్చిన ఈ గ్రంథాన్ని ‘అ’’ నుండి “క్ష” వరకు తల్లీనంగా చదివించాయి. ‘ఈ మధుర భావము లెచ్చటినుండి వచ్చెరా!’ అని జంధ్యాలవారు స్వగతప్రశ్న వేసుకొన్నారు. ఆ ప్రశ్నకు సమాధానం కూడా వారి అంతరంగమే. తెలుగులో దీనికి దేసాటి.

‘దొడ్ల’ వారి దొడ్డతనం వందనీయమే. వారినందుకొని ఈ గ్రంథం ముందుకు నడిచింది అనుకొంటాను. శాంతిశ్రీగారు దార్శనికులేకాదు కవీశ్వరులుకూడా. ఈ రెంటి సమ్మేళనం అపురూపం.

“నారద భక్తి సూత్రాలను” నేను వివిధ భాషలలో చదివాను. అఖండానంద సరస్వతీ స్వాములవారి హిందీ గ్రంథం అసదృశమైనదే. దానిలో దార్శనికపు లోతులు ఎక్కువ, అయినా మాధుర్యం తక్కువ లేదు అనుకోండి.

కానీ శాంతిశ్రీగారి ఈ నారద భక్తి దర్శనం అంతా మధురమే. “మధురాధిపతే రఖిలం మధురమ్” అన్నట్లు ఈ భక్తిదర్శనం ఆంధ్రి భక్తలోకంలో బహుళ ప్రచార ప్రసారాలను పొంది కలికల్మష నివారకమై ప్రకాశించుగాక !!!

‘శుభం భూయాత్’

# ఆనందవాణి



శ్రీ స్వామిదేవానంద
శివానందనగర్, ఋషీకేశ్,
హిమాలయాలు - ఉత్తరప్రదేశ్.

హరేరామ హరేరామ రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే

పరమ భక్తాగ్రేసరుడగు నారదమహర్షి రచించిన భక్తి సూత్రములు జగత్ప్రసిద్ధములు. అవి భక్తి మార్గములో నున్నవారికి భగవద్భక్తిని ప్రేరణమొనర్చి భగవత్సాన్నిధ్యము పొందుటకు మిక్కిలి సహాయ పడుచున్నవి. ఆసూత్రములు చిన్నవిగా ఉన్నప్పటికి సామాన్య జనులకు అర్థముకావు.

అట్టి నారద భక్తి సూత్రములకు 'నారద భక్తి దర్శనం' అని పేరు పెట్టి శ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రిగారు సామాన్యులకుకూడా అర్థమయ్యేలాగున సులభశైలిలో తెలుగులో వ్యాఖ్యానించి వివరణ చేసినారు. ఈగ్రంథము తెలుగు తెలిసిన భక్తులందరికి చాల ఉపయోగ పడునని భావించుచున్నాను.

శ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రికి కరుణానిధియైన పరమేశ్వరుడు దేవర్షియైన నారదమహర్షి సంపూర్ణ ఆయురారోగ్యములు అఖండ భక్తి జ్ఞానములు ఆధ్యాత్మిక బలసంపత్తులు అనంత శాంతిశ్రీలు ప్రసాదించి సదా సంరక్షించుగాక!

శ్రీ శాంతిశ్రీ ఆధ్యాత్మిక కృషి జయప్రదమగుగాక!

ఓం త్రయంబకం యజామహే సుగంధిం పుష్టి వర్ధనమ్
ఉర్వారుక మివ బంధనాత్ మృత్యోర్ముక్షీయమామృతాత్ ॥.

ఓం తత్సత్.

# శుభాశంసనం



కళాప్రపూర్ణ - ఆచార్య-డాక్టరు
దివాకర్ల వేంకటావధాని
M. A. (Hons) Ph. D.

'శాంతిశ్రీ' లేఖనీ నామధేయులైన మిత్రులు శ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రిగారు రచించిన "నారద భక్తిదర్శన"మను గ్రంథమును పఠించి అమందమైన ఆనందమును పొందితిని. ఇది నారద భక్తి సూత్రములకు సోదాహరణము, సర్వసుబోధమును నయిన సరళ వ్యాఖ్యానము.

మన లాక్షణికులు భక్తికి ప్రత్యేక రసత్వము నొసంగి యుండలేదు. అది ఒక భావమనియే వారి అభిప్రాయము. కాని మధుసూదన సరస్వతి మున్నగువారు అదియే ప్రకృతి రసమని భావించి దానికి విభావాను భావ సాత్త్విక వ్యభిచారి భావములను సూచించియుండిరి. నారదుడును, శాండిల్యుడును, భక్తి సూత్రములను రచించి దానికి ప్రపంచమున విశిష్టమైన స్థానమును కల్గించిరి. వారు మహాభక్తులై భక్తి మాధుర్య మనుభవించిన మహానుభావులు. జ్ఞానప్రధానవాదులైన జగద్గురు శ్రీ శంకరాచార్యులవారు కూడా భక్తిని నిరసించి యుండలేదనుటకు "మోక్ష సాధన సామగ్ర్యాం భక్తి రేవగరీయసీ" అను వివేక చూడా మణి యందలి వాక్యము తార్కాణము.

బ్రహ్మదేవుని సృష్టిలో మానవుడు త్తమోత్తముడుగా పరిగణింప బడుచున్నాడు. అందు కితరజంతువులకు లేని జ్ఞాన మతనికుండుటయే కారణము. భగవంతుడు కరుణాళువై ప్రసాదించిన ఈ జ్ఞానము నూతగా గొని మానవుడు తురీయ పురుషార్థమైన మోక్షమును పొందుటకు ప్రయత్నించవలెను. అట్లు ప్రయత్నించనిచో ఆహార భయనిద్రాదులచే కాలక్షేపము చేయు నితర జీవులకును, అతనికిని ఆకారమున తప్ప మరెందునను భేదముండదు. మన పూర్వులు మానవుడు మోక్షము పొందుటకు "జ్ఞానకర్మ భక్తి" మార్గములను మూడు మార్గములను

సూచించి యుండిరి. వీనిలో మొదటి రెండు మార్గములను అనుసరించుట మహనీయులకు తప్ప అన్యులకు సాధ్యముకాదు. ఇంక భక్తి యన్నచో స్త్రీలనక పురుషులనక, పండితులనక, పామరులనక, వృద్ధులనక, బాలురనక, అందఱును అనుసరించుట కనువైన సరళ మార్గము. కలియుగమున మానవులు తరించుటకు భక్తికన్న సులభతరమైన మార్గమింకొకటి లేదు. త్యాగరాజస్వామి "సంగీత జ్ఞానము భక్తి వినా" పరమాత్ముని చేరుటకు అవకాశము లేదని చెప్పియుండెను. అందఱును సంగీతమును అభ్యసించుట కవకాశముండదు. కాని భక్తి నవలంబించి భగవంతుని సన్నిధి చేరుటకు వీలుండును.

సంస్కృత పురాణములలో నారదపాత్ర కున్నంత ప్రచారము మఱియెవ్వరికిని ఉండదు. అతనిపేరు చెప్పినంతనే మహతిని చేతధరించి నారాయణ దివ్యనామము గానము చేయుచు ఆకాశమున సంచరించు భక్త పుంగవుడు మన కన్నులకు సాక్షాత్కరించును. అతనికి 'కలహాశను' డను పేరున్నది. అది నిజమే కావచ్చును. కాని అతడు కలిగించు కలహములన్నియు లోకమునకు నీతి బోధించుటకే కాని ఊరక యెవ్వరికో బాధ కల్గించుటకు కాదు. అతడు మహా భక్తుడు, విష్ణుభక్తుల పట్టికలో అతని నామము ప్రముఖముగా గోచరించును. లోకోపకారమునకై అతడు చేసిన ఘనకార్యము లెన్నియో పురాణము లందాయా సన్నివేశములందు గోచరించును. అతడు భక్తిసూత్రములను రచించెను. వానియందాతని సహజమైన భక్తి సంపద యెంతయో ప్రత్యక్షమగుచుండును. అనుభవ పూర్వకముగా నెవరేది రచించినను, సమగ్ర సుందరమై శోభిల్లు చుండును గదా!

నారదుని భక్తి సూత్రములలో "సాత్వస్మిన్పరమ ప్రేమరూపా" అని భక్తిని నిర్వచించి యుండెను. అనగా భగవంతుని యందు మానవుడు చూపు ఉత్కృష్టమైన యనురాగము అని అర్థము.

అవసరమని గ్రహించి పలువురట్టి యనువాదములను వ్రాసి ప్రచురించి యున్నారు. కాని కేవలానువాదము వలన నెక్కువ లాభముండదు. సూత్రములను వివరించి అందు నిక్షిప్తమైయున్న అర్థమును నిదర్శనములద్వారా ప్రపంచించినచో సామాన్యులుకూడా అందలి భావము నెఱింగి యట్లు ప్రవర్తించుట కవకాశముండును.

శ్రీ శాస్త్రిగారు ఆపనియే కావించియున్నారు. వారు సూత్రములకు ముందనువాదమును, తరువాత తాత్పర్యమును, పిమ్మట వివిధ గ్రంథములనుండి శ్లోకములను, పద్యములను ఉదహరించుచు, విస్తృతమైన వివరణమును వ్రాసియున్నారు. వారుదహరించిన శ్లోకములను పద్యములను చూచినచో వారి పఠనమెంత విస్తృతమైనదో, పాండిత్యమెంత ప్రకృష్టమైనదో తెలియవచ్చును. అచ్చటచ్చట భక్తినిగూర్చి చెప్పిన వాక్యములను చూడ వారుకూడా సహజముగా నెంత భక్తి భావ సంభరితులో వ్యక్తమగును. భగవద్భక్తి పూర్వజన్మ సుకృతముచే గానిలభింపదు. వారికట్టి సుకృత మపారముగా నున్నది. భాగవతము, భగవద్గీత, తులసీరామాయణము, ఉపనిషత్తులు, భజగోవిందాది స్తోత్రములు, జ్ఞాన వాశిష్ఠము, రామాయణము, భక్తి శతకములు, పద్మపురాణము, భారతము, నారద పాంచరాత్రము, మున్నగు గ్రంథములను మహానిర్వాణ తంత్రము, బ్రహ్మసూత్రభాష్యము మున్నగు సామాన్యుల కందుపాటులో లేని మహాగ్రంథములను వారవలోకించి తాము ప్రకటించిన భావములకు ప్రమాణములను చూపియున్నారు. వారాయాభాగముల కొసంగిన శీర్షికలర్థవంతములై అనుప్రాసయుక్తములై శ్రవణ పేయములుగా నున్నవి. శివుడు, విష్ణువు, శక్తి, మున్నగు నామభేదములు గోచరించినను, అవి యన్నియు పరమాత్మకుపర్యాయ పదములే. పాఠకులీవిషయమును గమనించినచో సంకుచిత భావములను విడిచి సర్వదేవతా సమత్వము పొందజాలుదురు.

శ్రీ శాంతిశ్రీగారు గ్రాంథిక భాషను వాడినచో సామాన్యుల కర్థము కాదేమో! అను భావముతోనే గ్రంథమున వ్యవహారిక భాషనే వాడియున్నారు. పాండిత్య ప్రకర్ష కాక భావప్రకటనమే యిందు ప్రధానము. వారి భాష సరళమై, సుందరమై, మధురమై, ధారాళమై పాఠక మనోరంజకముగా నున్నది. వారీ గ్రంథమును రచించుటలో పడిన శ్రమ అపారమైనది. ప్రకటించిన శ్రద్ధ అమేయమైనది. వ్యక్తీక రించిన భక్తి నానృతో దర్శనీయమైనది. పఠించిన గ్రంథములనే కములు. భక్తికి సంబంధించిన గ్రంథములందలి భావములను వారొక్క చోట చేర్చి జిజ్ఞాసువులకును భక్తులకును మహోపకారము గావించి యున్నారు. వారిదివరకే పెక్కు పద్య గద్య గ్రంథములను రచించి యున్నారు. ఇంకను రసవన్మనోజ్ఞములైన ఉత్తమ గ్రంథములను రచించి ఆంధ్ర భాషా యోషకు అభినవాలంకృతులను చేకూర్తురని ఆశించుచున్నాను



# మధుర దర్శనం



"ఉభయ వేదాంత ప్రవర్తకులు"
శ్రీ భాష్యం అప్పలాచార్యులు

'శాంతిశ్రీ' జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి గారిచే రచింపబడిన "నారద భక్తి దర్శనం" అనే నారద భక్తి సూత్రవ్యాఖ్యానం చదివి అమిత ఆనందాన్ని అనుభవించాను.. నారదులవారు మహానుభావుల కృపచే తాము పొందిన పరమ భక్తిని అష్టాదశ పురాణ ప్రణేతయై వేదాంతజ్ఞుడై శాంతిని పొందలేని వ్యాసమహర్షికి ఉపదేశించి మనశ్శాంతిని కలిగిస్తారు. 'శాంతికి సాధనం భగవంతుని రూపగుణాదులందలి ప్రీతి. అనుసంధానము' అని నిరూపిస్తారు

భక్తికి పూర్వరంగంగా జ్ఞానముంటుంది. కానీ జ్ఞానము వలన శాంతి కలుగదు. భక్తియే మోక్షసాధనలలో గరీయసి అని పెద్దలు వివరించారు. నారదులవారు ఉపదేశించి నటువంటి భక్తి కర్మజ్ఞానాంగకమైన అష్టాంగ యోగయుతమైన సాధన భక్తి మాత్రంకాదు. ఇది ప్రేమస్వరూపమైన స్వతః పురుషార్థమైన గోపికల భక్తి. ఇది సాధనముకాదు. సాధ్యము. ఇదే పురుషార్థము. ఈ భక్తియే ఇందు వివరింప బడినది. శాంతిశ్రీ ఈ విషయం ఈ దర్శనంలోని 'భక్తి ఫల స్వరూపిణి' అను ప్రకరణలో అనేక ఉపపత్తులతో వివరించారు.

'ప్రేమస్వరూపం' అను ప్రకరణంలో భక్తి సాధ్యము కానీ, సాధనము కాదని ఉదాత్తముగా తెలియజేశారు. ఈ భక్తి సత్సంగము చేతనే లభించవలసినది. అది ఎట్లుండునో దాని స్వరూప స్వభావాలు ఉచితరీతిలో ఉల్లేఖించారు. వాదము దానికి ప్రతిబంధకము. సాధకుని ప్రయత్న ధారను అది నిరోధిస్తుంది. ఇట్టి సాధ్యభక్తిని హరిగురు పరమకృపా భాగ్యం వలననే దర్శించినవారు అనుభవించగలరు.

అట్టి ఉదాహరణ ప్రాయులు గోపికలు. అందుచేత నారదులవారులక్ష్యమును బట్టి లక్షణ నిర్మాణముజేసినారు. ఇది పరమ ప్రేమ రూప.

ప్రేమ-పరప్రేమ- పరమప్రేమ అని త్రివిధము. ప్రేమ ప్రయోజనాపేక్షతో సాగునది. పరప్రేమ సాత్వికియై వివాహితమై ప్రకాశించునది. పరమప్రేమ రాగాత్మిక. స్వతః ప్రయోజనకారి. అనగా సాధనచే లభించునదికాదు. ఒక ఫలమును కోరునదికాదు. ఆపరమప్రేమ భక్తి స్వరూపమును తెలియకయే అనుభవించి ఆనందించిన వారు గోపికలు. ఆ తత్వం తెలిసికొని అనుభవించినవారు నారదుల వారు. వారు దర్శించిన భక్తిని ఈ నారద భక్తిదర్శనం మనకు సందర్శింప జేస్తున్నది.

సాంఖ్యయోగాదులు దర్శనములైనట్లే భక్తికూడా ఒక దర్శనం. దీనికి ప్రథమాచార్యులవారు నారదులవారు. అందుచే శాంతిశ్రీగారు అందంగా ఈ గ్రంథానికి "నారద భక్తి దర్శనం" అని నామధేయం సార్థకంగా తీర్చిదిద్దారు. "దర్శన"మనగానే అందుబాటులో లేని శాస్త్ర గ్రంథం ఏదో అని సామాన్యులకు భయం కలుగుతుంది. "నారద భక్తి దర్శనం" అంటే అట్టి భయం కలుగదు. శాంతిశ్రీగారు దీనిని సుగమంగా సుమధురంగా తెలుగువారికి భక్తిరూపం బోధపడేలాగా రచించారు.

శాంతిశ్రీగారి సరళమైన భాష, హృదయంగమమైన వివరణ, మధ్య మధ్య పోతనాదుల భక్తి సంభరితములైన పద్యాలు, ప్రాచీన కవుల శ్లోకాలు రచనకు నిండుదనం తెచ్చాయి. వివరణలు విస్తారములుకాక సంకుచితములు కాక ఉచితముగా నున్నవి. ప్రాచీన భాష్య ప్రక్రియలో తెలుగులో తీయగా సాగిన దార్శనిక గ్రంథమిది.

ప్రాచీనములగు భాష్యములు ఇట్టి శైలిలోనే సాగినవి. కానీ తెలుగువారికి వానిని సేవించు భాగ్యములేదు. అందుకై ఇంతవరకు నారద భక్తి సూత్రములకు సరళమైన ఆంధ్ర వివరణము లేదు.

ఆ లోపమును తీర్చుటకై శ్రీశాంతిశ్రీగారిద్వారా శ్రీకృష్ణభగవానుడు ఈ ప్రయత్నమును సంకల్పించినాడు. ఆ భగవత్సంకల్పము నెరవేరి లోకమునకు ప్రసాదింపబడినది.

ఇందు సూత్ర వివరణములు మాత్రమేకాక భక్త్యాచార్యుల సంక్షిప్త పరిచయాలు, మునుముందుగా ప్రథమ భక్త్యాచార్యులైన నారదులవారి చరిత్రము సందర్భోచితముగా పొందు పరచబడినాయి. దీనితో సమగ్రత సంతరించుకొనిన ఈ 'దర్శనం' ఆంధ్ర లోకానికి సందర్శనమై భక్తి ప్రసాదకం కాగలదు.

మిత్రులు శాంతిశ్రీ మధుర కవులు. అందుకు వారి జ్యోతిర్మయి-త్యాగమయి-ఉదాహరణత్రయి-సుందర మందారాదులు నిదర్శనములు. వారి హృదయంలోగల పరిపాకమునకు మూలం తాదాత్మ్యము ను కలిగించు తీయని భక్తియే. అది నిరూపించుటకు ఈ నారద భక్తి దర్శనం సాయపడుచున్నది.

ఈ "నారద భక్తి దర్శనము" దర్శించి ముందుగా ఈ రెండు మాటలు వ్రాయుటకు అవకాశము సగి నాకు చారితార్థ్యము కల్పించినారు శాంతిశ్రీగారు. ఇతోధికముగా భక్తిరస పోషకములైన గ్రంథములు పెక్కు వెలువరించి దేశమున కుపకరించునట్లు శ్రీ సీతా రామచంద్రప్రభువు శాంతిశ్రీ గారిని అనవరతము అనుగ్రహించుగాక!!!



# మహతీ శ్రుతి

శ్రీ పేరాల భరతశర్మ
విశ్వనాథ పీఠం

"సాతు కర్మజ్ఞాన యోగేభ్యోఽధికతరా" ఈశ్వర సాక్షాత్కారంలో కర్మజ్ఞాన యోగమార్గాలెన్ని ఉన్నా భక్తిని మించిన మార్గం మరొకటి లేదు అని ఈ గ్రంథం చాటుతుంది. నారద ప్రోక్తమైన భక్తి సూత్రాలకు సుందర సులభతర సుకుమార వ్యాఖ్యానమే ఈ గ్రంథం.

కర్మజ్ఞాన యోగాదులకంటె భక్తిమార్గం అత్యంత సులభం అనే భ్రాంతి లోకంలో ఒకటుంది. భక్తి మార్గం అంతంత మాత్రంచేత అలవడేదికాదు. ఒక నారదుడు ఒక ప్రహ్లాదుడు ఒక రాజేంద్రుడు ఒక గజేంద్రుడు ఒక త్యాగరాజు ఒక గోపరాజు ఒక పురందరదాసు ఒక రామదాసు భక్తి యోగంలో ఆత్మ సాక్షాత్కారం పొందారు అంటే వారి భక్తి నేడు సామాన్యులు భావించే వట్టి తేలికైన భక్తి మాత్రం కాదు. వారిది నిష్ఠాగరిష్ఠమైన పరమ భక్తి.

అట్టి భక్తి ఎలా అనుష్ఠించాలి అనేది ఈ భక్తి దర్శనం పఠిస్తే తెలుస్తుంది. ఈ గ్రంథ పఠనం వలన భక్తునికి సదసద్వివేకం కల్గుతుంది. భక్తి మార్గంపై అత్యంత శ్రద్ధకూడా లభిస్తుంది. ఈ భక్తి మార్గ పద్ధతిని అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు అందించేది ఈ నారద భక్తి దర్శనం

శ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రిగారు 'శాంతిశ్రీ' అనిన ఉపనామం ధరించినవారు. శాంతి సంపద చిత్తానికి ప్రసన్నతను కల్గిస్తుంది. ప్రసన్నమైన మనస్సు నిర్మలమైన తటాకంవంటిది. ఏవిషయమైనా ప్రతిఫలించుటకు అట్టి ప్రసన్నత అవసరం. ఈ గ్రంథ రచనలో శాంతిశ్రీ గారు ఎన్నో గ్రంథాలనుండి విషయాలను సేకరించి ఉదాహరించారు.

చిన్నచిన్న వాక్యాలతో స్పష్టత ప్రధానంగా విషయాన్ని సుబోధకంగా చదువరులకు అందించారు. అక్షరజ్ఞానంకల ప్రతి ఆంధ్రునికీ ఈ గ్రంథం భక్తి ప్రబోధాన్ని అద్భుతంగా కలిగిస్తుంది.

శ్రీ శాంతిశ్రీగారు ఈ నారద భక్తి దర్శనం వరకు రావడానికి వేసుకొన్న సోపానాలు వారి రచనలలోని భక్తిరసభరిత కవితా ఖండికలు కొన్ని ఉన్నాయి. అవి "జ్యోతిర్మయి" కావ్యకదంబంలోని కళ్యాణమూర్తి, రామమహిమ 'త్యాగమయి' కావ్యంలోని దేవీతత్వం "ఉదాహరణత్రయి" లోని శారదోదాహరణం సత్యోదాహరణం "సుందర మందారం"లోని హనుమద్భక్తి మరియు 'హనుమన్మండలి' మొదలైనవి. వీటిలోని భక్తి నిష్ఠ పరిస్ఫుటమై "నారద భక్తి దర్శనం"తో అభ్యుదయాన్ని కల్గించిందనిపిస్తుంది.

లోతుగా పరిశీలిస్తే భక్తి జ్ఞాన కర్మయోగాలు ఒకదానితో మరొకటి ముడిపడి ఉంటాయి. ఇవి నాలుగూ ఒకదానినుండి మరొకదానిని వేరుచేయటానికి వీలులేనివి. ఈ నాలుగూ ఆత్మ ద్వారానికి నాలుగు కమ్ములు. ఈ ద్వారంగుండానే పరమాత్మ సాక్షాత్కారం అవుతుంది. ఈ మహా ద్వారం చేరుకోవటానికి ఒకరు విహాయస మార్గంపై ప్రయాణిస్తారు. మరొకరు పిపీలిక మార్గాన నడుస్తారు. ఇంకొరు వాయు మార్గాన పరువెత్తుతారు. మార్గాలెన్ని అయినా వీరందరి గమ్యం మాత్రం ఒక్కటే. ఇన్ని మార్గాల కూడలి పరమాత్మ ముంగిలి.

మన శాంతిశ్రీగారు ఈ గ్రంథంలో భక్తి జ్ఞాన కర్మయోగ తత్వాలను గురించి ఎత్తారు. ఆలోచనలు రేకెత్తించే విషయాలెన్నో

